అవంతీ ప్రచురణలు 4.

# ఓనమాలు

★

రచన:

మహీధర రామమోహన్‌రావు



అవంతీ ప్రచురణలు,
434 A – 27 ప్రజాశక్తి నగరు,
విజయవాడ – 2.

# 1947...

....నాటి తెలంగాణా ఒక అగ్నిగుండం.

దుస్సహమైన జాగీర్దారీ వ్యవస్థను నిర్మూలించగల పోరాటాల్ని ప్రజానీకం సాగిస్తూంది. వాటి నన్నింటినీ ఒకే జెండాక్రిందికి తెచ్చి, రాజకీయ నాయకత్వం సమకూర్చడానికై ఆంధ్రమహాసభా, కమ్యూనిస్టుపార్టీ సన్నాహాలు సాగిస్తున్నాయి.

రెండోవైపున - విదేశీపాలనకూ, సంస్థానాధీశుల నిరంకుశ పాలనకూ వ్యతిరేకంగా జాతీయ ప్రజాతంత్ర పోరాటాలు తెలంగాణాని అలుముకొంటున్నాయి.

ప్రజాతంత్ర హక్కులకై సాగుతున్న ఈ పోరాటాలు ఐక్యతను కూర్చుకొంటూ నిజాము పరిపాలనా యంత్రాన్ని మొదలంట కదిల్చి వేస్తున్నాయి.

ఈ దశలో....

విచ్ఛిన్నమైపోతున్న జాగీర్దారీ వ్యవస్థను రక్షించగలశక్తి నిజాము ప్రభుత్వానికి లేదని గ్రహించిన భూస్వామ్యవర్గం నూతన నాయకత్వం కొరకై వెతుకులాడుతూ జాతీయోద్యమంలో తనకు రక్షణ నివ్వగల శక్తుల్ని చూసుకొంది.

సమాజంలో తనకున్నబలం క్రమంగా క్షీణించిపోతూంటే, కూలిపోతున్న తన అధికారాన్ని పరిరక్షించుకొనేటందుకై మతవాదుల్నీ, రౌడీల్ని సమీకరించి విధ్వంసకాండకు పూనుకొంది, నిజాము సర్కారు.

ప్రజానీకానికీ, ప్రతిరోధశక్తులకూ మధ్య జరిగిన ఈ ఘర్షణలలో తెలంగాణా ఒక అగ్నిగుండమే అయింది.

ఆ నాటి సంఘర్షణలే నా యీ నవలకు కథావస్తువు. సుదీర్ఘమైన ఈ నవలలో మొదటిభాగం పాఠకులముందుంచుతున్నా. త్వరలోనే మిగతావీ.

విజయవాడ,
20—3—56. } రచయిత.

భూమి కోసం

భుక్తి కోసం

నిగళబంధ

విముక్తి కోసం

నేల కొరిగిన

తెలుగు జోదుల

కిత్తు నంజలులు.



# కృతజ్ఞత

తమ పత్రికలో ధారావాహిగా వెలువడిన ఈ నవలను పుస్తకరూపంలో ప్రచురించుకొనుట కనుమతించిన విశాలాంధ్ర సంపాదకులకు —

రచయిత.

# ఒకటో ప్రకరణం.

నెత్తిన తన్నుతూన్న కాకుల్నీ, గోరింకల్నీ తప్పించుకుంటూ చక్కర్లు కొడుతున్న ఓ గద్ద దీర్ఘప్లుతంలో కృష్ణ నామస్మరణ చేస్తూంది.

ఏప్రిల్ నెల, ప్రొద్దుట ఎనిమిదింటికే ఎండ భగ్గుమంటూంది. ఎర్రగా కనిపిస్తున్న నేల వేగిపోయినట్లు పొగలు చిమ్ముతూంది.

కనుచూపు మేరలో పచ్చదనమే కనబడని పర్రభూమి. అక్కడా అక్కడా చాపంతమేరా, చదరంతమేరా పండి, ఎండి గోధుమరంగు లీనుతున్న అవిరిగడ్డి మాసికలు: ఆ అవిరిగడ్డి కూడా లేక బొగులు బొగులుమంటున్న చిన్న చిన్న గుట్టలూ, పెద్ద పెద్ద బండలూను.

మండుతున్న ఆ మైదానంలో కంటికి చల్లగా కనబడుతున్నదొక్క బోళ్ళ పొలమే.

గట్టు, దాని వంచన రాయి పగులకొట్టి కట్టిన మోటబావి. గుండ్రంగానో, పలకలుగానో, అంచులు తీర్చి కొట్టిందీకాదు. కట్టిందీకాదు. పనసపండు మీది పగులులాగ రసం చిప్పిలుతూన్న ఒక పెద్ద బీట అది. పొడుగ్గా బద్దలయిన బండలలో ఒక మూల మోటకోసం రాతితో తీర్చి కట్టిన అంచు కట్టూ, ఆ రాతికట్టులో నీటికి కొంచెం పైగా పెద్ద పెద్ద గూళ్ళలా కట్టిన గుళ్ళూ చూస్తే తప్ప అదొక నుయ్యి అనిపించదు. పొడుగ్గా బద్దలయిన బండమధ్య, కొమ్మ నాచుక్రింద నల్లగా కనిపిస్తున్న చల్లని నీళ్ళూ.

నీళ్ళలోంచీ ఎగుడు దిగుడుగా గొగ్గిపళ్ళల్లావున్న అంచులూ, ఆ ఎగుడు దిగుడుల్లోనూ, రాతి నెరియల్లోనూ వేళ్ళూనుకొని పెరుగుతూన్న జువ్వి మొక్కా, వేపచెట్టూ, వాని మధ్యనుంచి నూతిలోకి దిగేటందుకు మెట్లుగా కొట్టిన రాళ్ళూ, రాళ్ళక్రింద కొమ్మనాచు అలుముకొని, నల్లగా, చల్లగా కనిపించే నీరు బొగులు బొగులు మంటున్న ఆ పట్రలో యింత చల్లని మేరని సృష్టించింది.

మోటగాడికి రెండువేపులా కానుగచెట్ల వరస. వాని కావల మెరకమీద నాలుగు చింతలూ నల్లని నీడల్ని పరుస్తూ, కళ్ళనూ, కాళ్ళనూ ఆకర్షిస్తున్నాయి. ఆ నీడల్లో రాళ్ళమధ్యగా సాగుతున్న మోటబోదె, బోదెకు రెండు వేపులా మల్లెదుబ్బులూ, తులసిమొక్కలూ, రుద్రజడలూ ఒకదానినొకటి ఒత్తుకొని పిట్టగోడ పెట్టినట్లున్నాయి. ఆ పచ్చని గోడలకు వెలుపల ఒక గజంమేర వరకూ పచ్చగా చెంగలిగడ్డి పట్టి కలకల్లాడుతూ తివాసీ పరిచినట్లుంది.

పచ్చని మొక్కల గోడలమధ్యనుంచి, మోట బోదె బయల్పడినచోట ఓ పది కుంటల వరిచేను. చేనుమధ్య కూడా బండలున్నాయి. ఆ బండల కుదుళ్ళలోకంటా మన్ను పరిచేసి వరిమొక్కలూడ్చారు. వరిమళ్లు చిన్న చిన్నవి. మెట్లు మెట్లుగా బోదెలోని నీటిని అంచెలంచెలుగా అందుకొంటున్నాయి.

బావిచుట్టూనూ, వరిమళ్ళకంటానూ ఒక వరసా, క్రమంలేకుండా అనేక రకాల పళ్ళమొక్కలు చిన్న అడవిలా పెరుగుతున్నాయి. ఆ పళ్ళ తోటనూ, మరి కొంత ఖాళీస్థలాన్నీ చుట్టుకొని, గాదంగి మొక్కల వెలుగు మంచి ఎత్తుగా పెరిగివుంది.

చెట్ల గుబురులో, బావికి సమీపంగా ఒక చిన్న పాక. పాకముందర చదరంత మేర వరికళ్ళంకోసం చదునుచేసి, పేడతో అలికి శుభ్రం చేసిన ముంగిలి.

* * * *

మోటగాడి అంచున, నీటిబోదె ప్రక్కన చింతల నీడలో చెంగలి తివాసీమీద వెంకటయ్య తలక్రింద చేతులు పెట్టుకొని, వెల్లకిలా పడు కొని ఏవేవో ఆలోచనల్లో కొట్టుకొని పోతున్నాడు.

ఆతని ఆ స్థితి సత్తెమ్మకు కొత్తగా వుంది. ఎప్పుడూ నవ్వుతూ, తుళ్లుతూ వుండేమనిషి, గంభీరంగా నిద్రలో పనిచేస్తున్నట్లు కనబడుతూంటే ఆమె మనస్సుకేదో భీతిగా వుంది. కూడు తిన్న పళ్ళెం బోదెకో కడిగి, పాకలో చూరునున్న వుట్టిమీద జాగ్రత్తపరిచింది. తడిచేతులు చీరకొంగున తుడుచుకుంటూ నెమ్మదిగా నడిచి వచ్చి ప్రక్కన నిలబడింది. ఓరకంట ఆతని ముఖంలోకి చూసింది. ఆతని కళ్ళు చూస్తూనే వున్నా, ఆమెను గుర్తించినట్లు లేవు. సంకోచిస్తూనే ప్రక్కన కూర్చుంది. అప్పుడూ అతడు కదలలేదు. ఆతని మీదుగా వొంగి తులసిమొక్కనుంచి పొడుగాటి వెన్ను ఒకటి తుంపింది. వెచ్చని రొమ్ములు ఒత్తుకున్నా ఆతనిలో కదలికలేదు. తులసివెన్నుతో గడ్డంక్రిందా, భుజాలమీదాచక్కిలిగిలి పెట్టింది. గిలిగింతకు ఆతని కండరాలు తరంగిస్తూంటే కిలకిల నవ్వింది. గిలిగింతలు పెడుతున్న చేతిని పట్టుకొని వెంకటయ్య ఆమెను గుండెలమీదికి లాక్కున్నాడు. అంతలో ఏదో గుర్తు వచ్చినట్లు చేయి వదిలేసేడు.

సత్తెమ్మ ప్రయత్నాలేవీ వెంకటయ్యను ఆ ఆలోచనలనుంచి బయటకు లాగలేక పోయాయి. ఓటమికి ఆమెకళ్ళల్లో నీళ్లు తిరిగేయి. దుఃఖం, అభి మానంతో ఆతనిని త్రోసివేస్తూ, ఆమె చర్రున లేచి నిలబడింది.

అనునయమూ, ఆదరమూ చేయలేని పనిని నైరాశ్యమూ, అభి మానమూ సాధించాయి. ఆమె నెట్టడంతో వెంకటయ్య ఆలోచనలు చెదిరి

పోయాయి. కోపంతో వెళ్ళిపోబోతున్న ఆమెను పట్టుకోడానికి చెయ్యి జాపేడు. చేతికి దొరికిన చీరకుచ్చెళ్లు పట్టుకొని దిగలాగేడు. ఆ గుంజ డంలో చీర విడిపోయినంత పనయింది. కోకముడి పట్టుకొని సత్తెమ్మ చటుక్కున కూర్చుంది. ఆమె మరల లేవడానికి వీలులేకుండా వెంకటయ్య దొర్లి, ఆమె వొడిలో తల చేర్చేడు. ఆమె చేతిని చేతుల్లోకి తీసుకొన్నాడు; కళ్ళల్లోకి చూస్తూ చిరునవ్వు నవ్వేడు.

కాని, ఆ నవ్వులో తానెరిగిన ఉత్సాహం కనబడలేదు. ఆ కళ్లు తనను చూస్తున్నట్లే లేవు. సత్తెమ్మకు నెత్తిమీద నీళ్ళు దిమ్మరించినట్లనిపించింది. వొణికిపోయింది. వెంకటయ్య తనకి కాకుండా పోతున్నాడనిపించింది. కన్నీరు దాచుకోలేకపోయింది. నుదుటిమీద పడ్డ కన్నీటిచుక్కతో వెంక టయ్యకు పూర్తిగా తెలివి వచ్చింది. మనస్సులోని భావోద్వేగానికి ఆమె ముఖం జేవురించి వుంది. కళ్ళ నీళ్లు కారుతున్నాయి.

వెంకటయ్య ఆశ్చర్యపడ్డాడు. ఆమె ఏడ్పు ఎందుకో అర్థంకాలేదు. కాని, ఆమెస్థితి ఆతని మనస్సును తల్లక్రిందులు చేసింది. చటుక్కున లేచి కూర్చున్నాడు. దగ్గరగా జరిగి, కారణంకోసం కళ్ళల్లో వెతికేడు.

"ఎందుకు చిన్నీ!"

చిన్నమ్మ అదృష్టదేవతకి మారుపేరు. తల్లిదండ్రుల ముద్దు ముచ్చట లలో చిన్నమ్మ చిన్నీ అయింది. ప్రణయంకూడా అదే పేరును స్వీక రించింది.

ఆ పలకరింపుతో ఆమె వుద్వేగం కట్టలు తెగించి. ముందుకు వంగి ఆతని భుజంమీద తల పెట్టుకొని నిశ్శబ్దంగానే వెక్కివెక్కి యేడ్చింది.

వెంకటయ్యకా ఏడ్పు అర్థంకాలేదు. ఒక్కొక్క వెక్కు ఆతని హృదయంలో ఒక్కొక్క పోటులా తగులుతూంది. గడ్డంపట్టుకొని ముఖం తనవేపు తిప్పుకోబోయేడు. ఆమె భుజంమీదినుంచి తల తిప్పనే

లేదు. వెంకటయ్య ఎంతో ఆప్యాయంగా ఆమె వీపు నిమిరేడు. గుండెల కదుముకొని, దెబ్బతిన్న పక్షిలా విలవిల్లాడేడు.

"ఎందుకు చిన్నీ!"

ఆతని ఆరాటంలో ఆమె తేరుకుంది. కాని హృదయం కంఠంకూడా విడలేదు. ఆతడు తనకు దూరం అయిపోతున్నాడనే భయంవదలలేదు.

ఆ మాటనే ఎంతో దుఃఖంతో, ఎంతోభయంతో, అనునయిస్తూ వెలువరించింది.

వెంకటయ్యకు ఆమె భయం అర్థం అయింది; నవ్వు వచ్చింది. తానామెను వదలిపోతాననే భయం ఎందుకు కలిగిందో అతనికే అర్థంకాలేదు. ఆమెనోట వచ్చిన మాటనే తాను అనవలసి వస్తుందని ఈ వారంనుంచీ తానే ఎంతో తటపటాయిస్తున్నాడు. మనస్సులోని మాటను పైకి చెప్పలేకుండా వున్నాడు కాని....

ఆ భయాన్నే సత్తెమ్మ వెలిబుచ్చడం ఆశ్చర్యం కలిగించింది. ఆమె బేలతనానికి జాలీ కలిగించి. గాఢంగా కాగలించుకొని నలిపేసేడు.

ఆమెలో కనబడిన ఆందోళనా, భయంతో అంతవరకూ తాను చెప్పడానికి తటపటాయిస్తున్నమాట నాలికను దాటేసింది. ఆమె తల రెండు అరచేతుల్లో పట్టుకొని ఎత్తి తనవేపు తిప్పుకొన్నాడు. ఒత్తి ఒత్తి పెదవులమీద పూదేడు.

"మనం పెళ్ళి చేసేసుకొందాం."



# రెండో ప్రకరణం

పదహారో యేట సత్తెమ్మ కాపురానికెళ్ళింది. పదిహేడో యేట తాడుతెగి పుట్టింటికి చేరుకొంది. తండ్రి మరణించేక మగదిక్కు లేని ఆ సంసార భారాన్ని భుజానికెత్తుకొంది.

తండ్రి ఆఖరు రోజుల్లో మూలబడ్డ వ్యవసాయాన్ని చేతిలోకి తీసుకొంది. వ్యవసాయంలో తనకి తోడుకోసం గ్రామంలో మంచి పనివాడుగా పేరున్న వెంకటయ్యను మరో బుడ్డెడు గింజలెక్కువిచ్చి పనిలో పెట్టుకొంది. నీరసపడి, మూలబడ్డ బావిక్రింది సాగు వారిద్దరి నిర్వహణలో మళ్ళీ పుంజుకొంది. పుట్టి మళ్ళీ నిండింది.

ఇద్దరూ కలిసి బావిచుట్టూ వనం పెంచేరు. ఇద్దరికీ చెట్లూ మొక్కలూ పెంచడం అంటే మంచి సరదా. అతడు మొక్క నాటితే, ఆమె నీరు పోసింది. అతడు మోట కడితే ఆమె నీరు మళ్ళించింది. అతడు కంచె పాతుతుంటే తాను పెండె కట్టింది. ఇద్దరూ పోగడి ఆ ఎడారిలో ఒక చల్లని నీడపట్టు సృష్టించేరు. చల్లని చెట్లనీడలు. తియ్యటి బావినీళ్లు ప్రశాంతమైన వాతావరణం గ్రామంలో అందర్నీ చివరకి 'దొర' అల్లుణ్ణీ, కూతుర్నీ అతిథుల్నిగా రప్పిస్తూంటే ఇద్దరూ గర్వపడ్డారు. తాము చూపుతున్న శ్రద్ధను అభినందిస్తూంటే ఒకర్నొకర్ని చూచుకొన్నారు.

పనిలో కలిసిన మనస్సులు, మనువులు కలిపాయి. పాలేరుగావచ్చిన వెంకటయ్య ప్రాణాధికుడయ్యేడు. ఒకరొకరితోడిదే జీవితం అనుకొన్నారు.

అటువంటివాడు ఒక వారం పది రోజులనుంచి పరధ్యానంగా వుంటున్నాడు. అతడు దూరదూరంగా వుంటున్నాడనిపించింది. ఆ ఆలోచనతో

మనస్సు కలిగిపోతూంది: హృదయం ఆరాటపడిపోతూంది: అతనిని కదిలించడానికిచేసిన ప్రయత్నాలన్నీ విఫలం అయ్యాయనిపిస్తూంటే ఎంతో బాధపడిపోతూంది.

ఈ వారం పదిరోజులుగా అతనిలో కనిపిస్తున్న ధోరణి ఏమిటో అర్థం కాలేదు. ఏమేమిటో కారణాలు కల్పించుకొంటూంది. ఆ కారణాలన్నీ ఆమెను మరింత బాధిస్తున్నాయి.

అతడు తన ఎరికలో ఇంత గాఢంగా ఆలోచనల్లో మునిగివుండడం ఎప్పుడూ జరుగలేదు. అతడు ఆలోచించవలసిన విషయాలు మాత్రం పెద్దగా ఏం వున్నాయిగనక, ఆస్తా.... సెంటు భూమి లేదు. పన్నుకి పీడించేవాళ్ళింక పుట్టవలిసిందేనని అతడే వేళాకోళంగా అంటూంటాడు....తల్లా, తండ్రా? ....ఆ ఇద్దరూ కూడా ఏ నాడో మరణించారు.

....పెళ్లామా, పిల్లలా?.... ఈ మాట ఆలోచనకు వచ్చినప్పుడు సత్తెమ్మ అంత సులభంగా 'కాదు' అనుకోలేకపోయింది. ఆలోచించగా, ఆలోచించగా అసలు కారణం అక్కడేవున్నట్లు కూడా అనిపించింది. అనిపించడంతో కళ్ళనీళ్లు తిరిగేయి.

అతనిని కాదనడానికి తనకున్న హక్కు ఏమిటి? అతనికోసం తాను ఎంతయినా త్యాగం చేసివుండొచ్చు. ఉండొచ్చునేమిటి? చేసింది.

ఊరువాళ్ళ మాటల్ని ఖాతరు చెయ్యలేదు. తల్లి ఏడ్పును లెక్కచెయ్యలేదు. కులమర్యాదల నాలోచించలేదు. అతనికోసం ఆత్మార్పణ చేసుకొంది. సమాజంలో ఆడుది చేయగల త్యాగానికది పరాకాష్ఠ. అయితేనేం?....

అతడు తనకి మగడు కాదు. తనకి మగడు లేడు. వెంకటయ్యకోసం తాను ఎంత తపనపడ్డా, తానోవితంతువు మాత్రమే. అతనిమీద తనకు హక్కులేదు.

తనతో సావాసం చేసేక అతడు ఇతర పడుచుల్ని ఆటుకోలేదు. కన్నెత్తికూడా చూడలేదు. వెంకటయ్యకోసం దార్లుకాచిన పడుచుల్నీ. ఆతని మాటకోసం కొట్లాడుకొన్న పడుచుల్నీ ఆమె ఎరుగును. అన్నీ ఎరిగే ఆమె ఆతనితో నేస్తం చేసింది. తనతో చేరేక అతడు పూర్తిగా మారిపోయేడు. ఆతని పరిచయాల విషయంలో తాను పడ్డ జాలికూడా ఆతనికి నవ్వుతాలయింది. ఆ సంగతి నామె ఎరుగును. అతడు తనదే లోకంగా ఆనందిస్తున్నాడు. తనకేమాత్రం కష్టం కలిగినా గిజగిజలాడి పోతాడు. తన కాళ్ళక్రింద కళ్ళు పరిచేడు. తళ్ళముందు హృదయం విప్పేడు.

సత్తెమ్మ ఆ కళ్ళల్లో ఉత్తమలోకాల్ని చూసింది. ఆ హృదయంలో తన జీవితాన్ని చదివింది.

అది ఆమెకు ఇదమిత్థమని చెప్పలేని ఒక మహానుభవం. ఆ అనుభవంలో ఆమె ప్రతి అణువూ ఉత్తేజితం అయింది. ఆ ఉత్తేజనమే ఆమె జీవితాలంబనం.

నేటి వెంకటయ్య ధోరణి ఆ ఆలంబనాన్నే మొదలంట నరికివేస్తున్నట్లు తోచింది. భయం కలిగింది. ప్రపంచాన్నే లెక్కచేయని ఆ తెగువ ఇక్కడ నీళ్ళకారిపోయింది.

గతంలో ఆతడు దూరదూరంగా వుండడమే ఆమెను ఆకర్షించింది. కాని నేడదే భయం కలిగిస్తూంది.

ఆ రోజుల్లో...

ఊళ్లో పడుచువాళ్ళ కళ్ళన్నీ తనమీదే వుండేవి. ఆ సంగతి సత్తెమ్మకూ తెలుసు. కాని. ఆమె ఎన్నడూ. ఎవ్వరికీ అలుసు ఇవ్వలేదు.

వెంకటయ్య విషయంలో ఆమె బింకం నిలవలేదు.

అతడు మంచి వయస్సులో వున్నాడు. మాంచి పొడగరి. జువ్వలా చేవదేరిన వొళ్లు. కాయకష్టంతో బొండాలు తిరిగిన కండలతో నిగనిగలాడుతూండే వొళ్లు. కోలమొగం, నిండైన మీసం, చురుకైన కళ్లు.

అతని పెదవులూ, కళ్లూ ఎప్పుడూ నవ్వుతూంటాయి. మనిషి మంచి మాటకారి. మాటల గిలిగింతలో మనువులు కలపగలడు.

కాని, ఆమెను ఆకర్షించినది ఆతని అందచందాలూ కాదు: మాటకారి తనమూకాదు.

నిజం చెప్పాలంటే ఇతర పడుచులతో అంత హుషారుగా గంతువేసే వెంకటయ్య ఆమె అగల్‌బగల నున్నదంటే గప్‌చిప్. అంతవరకూ ఆతనితో కేరింతాలు కొట్టిన పడుచులు కూడా పెదవులు బిగపట్టుకొని నవ్వు నాపుకొంటూ బుద్ధిమంతురాళ్ళల్లే తమ పనులు చూసుకొనేవారు.

అసలు ఆతడు తన అందాన్ని లెక్క-చేయలేదనే అభిమానమే ఆమె మనస్సు నాతనివేపు తిప్పింది.

సత్తెమ్మది అందం అని చెప్పదగిన రూపం. రూపసౌందర్యంకన్న ఆమెలో ఆరోగ్యసౌందర్యానిది హెచ్చుపాలు. దృఢమైన శరీరం. పచ్చని మిసిమి. పెద్ద కళ్ళు-తెలివీ, గాంభీర్యం వెలార్చే చూపులు, ప్రధమ యౌవనపు పొంకం కట్టిన మోటుచీరలోంచి తొంగితొంగి చూస్తూంటుంది. ఊళ్లోని పడుచువాళ్ళంతా అమెను ఆకర్షించడానికి ఆతలాకుతలం అయ్యేవారు. వాళ్ళమాదిరిగా వెంకటయ్య ఆమెముందు అట్టహాసం ఏమీ చెయ్యక పోవడమే ఆమెను ఆకర్షించింది. ఆత్మార్పణం చేయించింది.

* * * *

వెంకటయ్యను పనిలోకి పిలిచేనాటికి సత్తెమ్మకు మగడి గుర్తు వుందని చెప్పలేము. కాని, ఆతడు ఇంట్లో తిరుగుతూండగా చూసి, తనకు మగడంటూ ఒకడు ఏర్పడినందుకు తలుచుకు తలుచుకు దుఃఖపడింది.

కానైతే వెంకటయ్య తన కులంవాడే, తనకు ఈడూజోడూ కూడాను. అయినా, తనకు అదివరకే ఓమారు పెళ్ళయిపోయింది. తన కులంలో మారుమనువు మర్యాద కాదు. నిషిద్ధం. ఆ విధంగా, ఇంక మొండిపడ్డ జీవితాన్ని మొలకలెత్తించే అవకాశంలేదు. ఇంక సంఘం కళ్లుకప్పాలి.

అది ఆమెకు ఒప్పలేదు. ఆ పని లోకం దృష్టిలో తన్నెంతో లోకువ చేస్తుంది. అలా లోకువ కావడం ఇష్టంలేదు. చిన్ననాటి సంఘటన ఒకటి ఆ రోజుల్లో తనకు అర్థంకాకపోయినా తన మనస్సుకి హత్తుకుపోయింది. పెద్ద అయ్యాక అర్థం అయింది. అర్థం అయ్యాక, అది గుర్తు వచ్చినప్పుడల్లా వణికి పోతుంది.

సావిత్రి ఆమె నేస్తం. ఒకే గ్రామం కాకపోయినా, ఒకే మౌజాక్రింద మజరాలు వాళ్ళిద్దరివీ.

ఒకనాడు సావిత్రికోసం సత్తెమ్మ వెదుతూండగా ఆ ఘటన జరిగింది.

సావిత్రి తండ్రి ఆమె చిన్నతనంలోనే అదృశ్యం అయిపోయేడు. తల్లి అనసూయ పట్వారీ లక్ష్మీనారాయణతో జత కలిపింది. అనసూయ చిన్న వయస్సునీ. ఆమె పరిస్థితినీ ఆలోచించి గ్రామంలోవాళ్లు విచారపడేవారు. క్షమించారు. కాని కూతురుమాత్రం క్షమించలేకపోయింది. ఆమె వయస్సయినా ప్రపంచపు ఆశల్నీ, ఆశాభంగాల్నీ అర్థం చేసుకోగల పాటిదికాదు.

కాని, లక్ష్మీనారాయణ ప్రసంగం వచ్చినప్పుడల్లా, ఆమె కళ్ళల్లో మంటలు కనిపించేవి. తల్లిని ఎంతో అసహ్యంచుకొనేది. ఆమెతోపాటు తాపంతా కూడా అనసూయమ్మమీద అసహ్యం ప్రకటించేవారు. దానికో ప్రత్యేకమైన కారణం ఏమీ లేదు కూడాను. తన ఒక్కగాని ఒక్కకూతురు కోసం వచ్చిన అభిమానంకొద్దీ అనసూయమ్మ తమకందరికీ ఏమి శ్రీముక్కో చిదిపి ఇంత చేతిలో వేసేదికూడాను. అయినా ఆమెమీద అభిమానం కలగనేలేదు. ఎందుచేతనంటే వాళ్ళే చెప్పలేరు. తమ నేస్తకత్తె మీదవున్న సానుభూతి తప్ప మరోకారణం వాళ్ళకి తెలియదు.

ఆ రోజున సత్తెమ్మ సావిత్రికోసం వెడుతూంటే గవినిరావి క్రింద కూర్చున్న నలుగురూ నిదానించేరు.

ఎవరింటికి వెడుతున్నదీ చర్చించేరు. వాళ్ళల్లో ఒకరు ప్రక్కనేవున్న పట్వారీ లక్ష్మీనారాయణను చూపేడు.

"వీళ్ళ సావిత్రికీ. ఈ పిల్లకీ దోస్తీ."

మరొకడు ఏమీ ఎరగనట్లు ప్రశ్నించేడు.

"నీ కూతురు పేరు సావిత్రా,"

ఇంకొకళ్లు సమాధానం ఇచ్చేరు. కథోపకథనంలో లక్ష్మీనారాయణ రసికత్వం రసవత్తరంగా వర్ణించేరు. ప్రక్కనేవున్న లక్ష్మీనారాయణ ఏమీ అనలేదు. చుట్ట చుట్టుకొంటూ, స్నేహితుల వాక్చాతుర్యానికి మీసాలలోనే నవ్వుకొన్నాడు.

ఆ ఘటన అర్థం అయ్యే వయస్సు వచ్చేక, ఆమెకు అనసూయమీద కన్న లక్ష్మీనారాయణమీద అసహ్యం కలిగింది. కట్టుకొన్న భార్యను గురించే ఆ పరిహాసాలు జరిగిస్తుంటే అతడా విధంగా చిరునవ్వు నవ్వుకో గలిగేవాడేనా ? కన్నకూతురు అసహ్యానికీ, గ్రామంలో చిన్నతనానికీ కూడా తలవొగ్గి, తనకు లొంగిన అనసూయ విషయంలో పట్వారీ చూపిన దృక్పథం ఆమెకు చాలా బాధ కలిగించింది తన స్నేహితురాలి తల్లిని చులకనచేస్తున్నవాడే, ఆమెచులకన కావడానికి కారణం. ఆ పతనంలో అతనికీ భాగం వుంది. అయినా అక్కడున్న వాళ్ళెవళ్ళకీ ఆ ఆలోచనే లేదు.

ఆ ఘటననూ, అల్లాంటి ఘటనలనూ తలచుకొని సత్తెమ్మ కొంతకాలం మనస్సును బిగపట్టుకోగలిగింది. కాని, ఆ భయం ఎంతో కాలం పని చెయ్యలేదు.

కొంతకాలం తమ యిద్దరి మధ్యా వున్న ఆర్థిక అంతరువుల్ని మననం చేసుకుని ఆతనిమీద మనసును అణచిపెట్టుకోడానికి ప్రయత్నించింది. ఒకప్పుడు మాటెల్లావున్నా, ఇప్పుడు తన పుట్టింటివాళ్లు కాస్త వున్నవాళ్ళల్లోనే

లెక్క. ఓ ఏభయ్యేకరాల భూమి వుంది కాలమానం సరిగ్గా వుంటే ఇల్లు నిండుతుంది. గట్టుక్రింద బావివుంది. కాలమానం కూడివస్తే ఓ పదిహేను కుంటలు సాగవుతుంది. అదో పెద్ద ఆస్తేంకాదు. కాని. గ్రామంలో ఆ మాత్రం వున్నదెవరికి!

వెంకటయ్యకి అదీలేదు. వాళ్ళతాతా. తండ్రీ కాలంలో ఏ మాత్రమో వుండేదట. వాళ్ళకి తోట పొలం కూడా వుండేదట. కాని. వాళ్లు చనిపో యేక దున్నే దిక్కుకూడా లేకపోగా. కుర్రవాడికోసం జాగ్రత్తపెట్టి ఇస్తానని పెద్దదొరే ఆ భూమిని తన వ్యవసాయంతో చేర్చుకొన్నాడు. వెంక టయ్య అడిగేడు. బాకీక్రింద ఆస్తి తనకు స్వాధీనపడిందేగాని ఆ ఆస్తి మీద వెంకటయ్యకు హక్కేమీలేదన్నాడు. దాని నిజానిజాలు తేల్చుకోవాలంటే కోర్టుకెళ్ళాలి. వెంకటయ్యకు ఆ స్తోమతూలేదు. సరదాలేదు. అతనిమీద దయతలచి రెండేళ్ళు తనవద్దనే పాలేరుగా పెట్టుకొని దొర యింత తిండి పెట్టేడు. ఆఖర్నో ఏభయి రూపాయలిచ్చి నీ బ్రతుకు బ్రతకమన్నాడు. ఇప్పుడు వెంకటయ్యకు ఓ ఇల్లులేదు. భూమీలేదు. అతనికన్న చెట్టుమీది పక్షి మేలు. వీటన్నింటినీ. ఈ ఆర్థిక అంతరువుల్నీ గుర్తుచేసుకొని సత్తెమ్మ తన కోరికను చంపుకోడానికి ప్రయత్నించింది.

కాని, ఆర్థిక అంతరువులు జ్ఞాపకం పెట్టుకోగల అవకాశాలు ఆ యింట్లో లేవు. ఆ కులంలో ఆడవాళ్లుకూడా పొలాలకెళ్ళి కాయకష్టం చేస్తారు. నెత్తిన మత్తపెట్టుకొని మగాళ్ళకి అన్నాలు తీసుకెళతారు. ఇంటికి వచ్చే టప్పుడు పొయ్యిలోకి సందెడు పుల్లలో. పాడిఆవుకి ఓ కట్ట పచ్చగడ్డో కట్టుకు వస్తారు. పొలాలలో మగాళ్ళతోపాటు పని చేస్తారు. సత్తెమ్మ కూడా అలా పనిచేస్తున్నదే. ప్రక్కనే నిలబడి, కూడా కూడా పనిచేసే వ్యక్తుల మధ్యవుండే ఆర్థిక అంతరువు ఓ అంతరువుకాదు. అది వ్యక్తుల మధ్య ఆకర్షణలను అడ్డుకోగల అంతరువూకాదు.

అందుచేతనే సంఘభయం కొన్ని నెలలేనా పనిచేసింది గాని, డబ్బు పెద్దరికం ఒక్క పూట కూడా పనిచెయ్యలేదు. పనిసమయంలో నిశ్శబ్దంగా వెంకటయ్య తన వేపు చూస్తూంటే అమె రక్తం వుడికిపోయాది.

తర్వాత మనస్సును నిలుపుకొనేటందుకో క్రొత్త భయాన్ని కల్పించుకొంది. చనిపోయిన మగనిమీద ఆమెకెప్పుడూ పెద్ద గౌరవమూ లేదు; భక్తీ, అభిమానమూ కూడా లేవు. కాని తన నడవడి ఆయన పుణ్యగతుల కెక్కడ ఘాటా తెచ్చిపెడుతుందోనని ఒకతెచ్చికోలు భయంకల్పించుకొంది. దానిని నిలవబెట్టుకోడానికి ఆయనమీద భక్తిని పెంచుకోబోయింది. ఆయన మూర్తిని గుర్తు చేసుకోబోయింది.

కాని, ఎంతప్రయత్నించినా ఆ మొగం ఎల్లావుంటుందో కూడా గుర్తు రాలేదు.

భర్తమీద ఆమెకెన్నడూ సద్భావంలేదు. అమె కాపురానికి వెళ్ళేసరికే ఆయన నానాతిరుగుళ్లూ తిరిగి మనిషి పూర్తిగా వొట్టిపోయేడు. పెళ్ళాం మీద చెయ్యి వెయ్యకుండానే మంచంమీద శరీరం జేరవేసేడు. ఆమెకు అత్తగారింట్లో భర్తృసుఖం లభించలేదు. భర్తృసేవే దొరికింది. ఆ సేవ రెండు చేతులా చేసింది.

ఓ ఏడాదిపాటు ఆయన బ్రతుకుతానని బెదిరించేడు. మగడి చావుకి ఏడవాలో సంతోషించాలో అర్థంకాని అవస్థలో సత్తెమ్మ పుట్టింటికి చేరింది. ఇప్పుడా మగణ్ణి గుర్తుచేసుకోవాలంటే సాధ్యమా ? నిరాకారచింతనం ఆమె మనస్సుకి సరిపడలేదు. ఎదురుగా మనస్సునీ ఆలోచనల్నీ ఆక్రమించుకొని సుందరవిగ్రహం నిలబడివుంటే చచ్చిపోయినమగడి పుణ్యగతుల్ని ఎంత వెతుకుదామన్నా పట్టుకోడం సాధ్యమా ?

అయితే చనిపోయిన భర్త ఆలోచనలు ఈ మారు నిజంగానే ఆమెలో ఒక కొత్తభయాన్ని తెచ్చిపెట్టేయి.

ఆ మరణించినవాడు మాట్లాడక వూరుకోకుండా ఏ దయ్యమో అయి వెంకటయ్య వెంటబడతాడేమో ననే ఆరాటం ఆమెకు నిజంగానే కలిగింది. చచ్చిపోయినవాళ్లు దయ్యాలయి ఎన్నెన్నో అఘాయిత్యాలు చేస్తూండడం ఆమెకు తెలుసు వాళ్ళ వూళ్ళో ఇంటికో దయ్యం వీధికో దయ్యం ఏదో రోజున హాజరుపట్టి వేయించుకొంటూనే వుంటాయి. తక్కువ కులాల యిళ్ళల్లో దయ్యాల అలవాట్లు వేరు. గేదెచేత పాలివ్వకుండా తన్నించేసో, పాలు విరిగిపోయేటట్లు చేసో ఏడిపిస్తాయి. నాలుగు తిట్లుతిని వెళ్ళిపోతూంటాయి.

కాని పెద్దయిళ్ళలో ముఖ్యంగా మగడులేని పడుచులుండే యిళ్ళల్లో హాజరయ్యే దయ్యాలు తమ అస్తిత్వాన్ని నిరూపించుకొనేటందుకు చాల కష్టపడతాయి, కష్టపెడతాయి కూడా.

నరసారెడ్డిగారి వియ్యమ్మని మగడు ఈమధ్య వదిలిపెట్టేదేగాని ఎంత రభస చేసేవాడు ? ఒకరోజున ఆమె సావిట్లో పండుకొనివుండగా ఆ దయ్యం మొగుడు అటక ఎక్కేడు. అక్కడినుంచి ఓ పెద్ద సన్నికల్లుపొత్రం ఆమె తల ప్రక్కన పడేటట్లు విసిరేడు. రాయిపడ్డచోట నేల ఇంతమేర గుంట కూడా పడింది. అదే తలమీదపడితే ? ఇంకేమన్నావుందా ? తలకాయి వెలగపెంకులా తుక్కు తుక్కయిపోదా ?

కాని పెద్దదొర అల్లుడూ కూతురూ పొలంవేపు ఓమారు షికారు వచ్చినప్పుడు మాటలసందర్భంలో ఆ భయంకాస్తా వదలకొట్టేరు. ఆ రోజుల్లో వియ్యమ్మ దయ్యమ్మొగుడి రాతి సరసంతో వూరు గుబగుబలాడిపోతూంది. అంతా విని దొర అల్లుడు రాజిరెడ్డి ఓ ప్రశ్న వేసేడు.

“వియ్యమ్మమీద దయ్యం మొగుడికి కోపమా ? అభిమానమా ?”

ఆమెకు ఎంత ఆలోచించినా సమాధానం దొరకలేదు.

"పెళ్ళాంమీద ఆమె ఏవో అపరాధం చేసిందనో చేస్తూందనో ఆ మగ దికి కోపంవుంటే ఆ రాయి సరాసరి నెత్తినే పడెయ్యచ్చుకాదూ? అలాగాక ప్రేమా అభిమానమూ పట్టలేక వెంటపడ్డాడంటే ఆమెమీద ఓ పువ్వువేస్తే అందం చందం. అంతే కాని. నేలకూడా సొట్టపడేటంత ఎత్తునుంచి ఓ మనిషి లేపినా లేవని పాత్రం గిరాటెయ్యడం ఏమిటి?"

ఆ ప్రశ్నల్ని నెమరువేసుకొన్నాక దయ్యాల అస్తిత్వం విషయంలో ఆమెకు అదివరకుంటూవచ్చిన నమ్మకం కాస్తా జారిపోయింది. మళ్ళీ ఆమె మనస్సు పురకలు వేసింది.

ఒకరోజున పక్కయింటి ముంతాజ్‌తో సరాగాలాడుతున్న వెంక టయ్యనూ ఆమె ముఖములో కనిపించిన దీప్తినీచూసి సత్తెమ్మ తాను జీవి తానందాన్నే కోల్పోతున్నాననుకొని వ్యధచెందింది. ఆత డామె జెడపట్టుకు లాగి అల్లరిపెడుతూంటే ముంతాజ్ నవ్వుతూంది. కపటకోపం అభినయి స్తూంది. నవ్వుతున్న కళ్ళతో బెదిరించడానికి ప్రయత్నిస్తూంది. తప్పించుకు పోతున్నట్లు నటిస్తూ ఆతనిచుట్టూ అలవుతొక్కుతూంది.

ఆ సాయంకాలం అవకాశం చూసుకొని ముంతాజ్‌ని పట్టుకొంది. ఆమె వెకిలితనానికి చీవాట్లు పెట్టింది. కాని మరునిముషంనుంచీ ఆమెను అంత ఆనందపరచిన ఘటనలకోసం సత్తెమ్మ తానే ఎదురుచూడ సాగింది. ఏవేవో పనుల మిషతో బావిదగ్గర పాకలోకీ ఇంటివద్ద గదిలోకీ ఎన్నోమార్లు పిలిచింది. కాని మిష అనుకొన్నవి అవసరమైన పనులే అవుతూ వచ్చేయి. ఆమె ఆశలు విఫలం అవుతూవచ్చేయి. ఎదురుచూడడమే మిగిలింది.

ఆడపిల్లలందరితో వెంకటయ్య ఏ సంకోచం లేకుండా మాట్లాడుతాడు. జడలులాగీ. కొంగుపట్టుకొనీ. నీళ్లుచల్లీ. మోటుహాస్యాలాడి. నవ్వీ. నవ్వించి ఎంతో చిలిపితనం చూపేవాడు. అలాంటివాడు తన దగ్గర కిమన్నాస్తి. అల్లరి మరిచిపోతాడు.

ఆమె తపనను వెంకటయ్య కనిపెట్టలేదంటే అర్థంలేదు. జుట్టునో బట్టనో పట్టుకొన్న ఏ గడ్డిపరకనో తీసెయ్యడం మిషలో తాకిన ఆమె చేతి వ్రేళ్ల అతనికి ఏవిధమైన సందేశాన్నీ యివ్వలేకపోతే అతడు వట్టి మట్టి బొమ్మయినా కావాలి. లేకపోతే సత్తెమ్మమీద యిష్టమేనా లేకపోవాలి.

కాని అతని ప్రవర్తనచూస్తే ఆలాగ అనిపించదు. ఆమె ఏమాత్రం కష్ట పడుతున్నా తాను అడ్డం వస్తాడు. అందులో సేవక భావం కనబడదు. అయినా పొరపాటున కూడా ఆమె కొంగునేనా తాకడానికికూడా అత డెన్నడూ సాహసించలేదు. అవకాశం చిక్కితే ఆమె సాన్నిధ్యాన్ని ఒక్క క్షణంకూడా వదలడు. కాని నోట ఒక్క హాస్యంమాట కూడా రాదు.

తాను ఎదురుగావున్నా కథుర్లు చెప్తున్నా వెంకటయ్య ఏదో కలలో వున్నట్లుండేవాడు. సరాసరి కళ్ళల్లోకి చూడలేకపోయేవాడు. మాటలోమాట కలపడు. హాస్యమాడలేడు. ఆమె కెన్నోమాట్లు విసువు పుట్టింది. ఒకటి రెండురోజులు అతనివేపు చూసేది కాదు. మాట్లాడేదికాదు. అతడే పలక రిస్తే విసువూ, కోపం చూపేది. అటువంటి ఘట్టాల్లో వెంకటయ్య మొఖంలో బెదురూ, ఆశ్చర్యమూ చదివి ఎంతో జాలిపడేది.

ఆతడు తన్నో దేవతలాగ దూరంనుంచే కొలుస్తున్నకొద్దీ ఆమెలో మనుష్య సహజమైన కోరికలు విజృంభించాయి. సుందరమైన పువ్వును చూసినట్లు ముట్టుకొంటే కందిపోతుందేమోనని జంకుతున్నట్లనిపించిన కొద్దీ ఆమె రక్తం పీడనకు ఎదురు చూసింది.

చివరవరకు వెంకటయ్య ఆమెను పూజాపీఠంనుంచి దింపనేలేక పోయేడు. ఆఖరుకు సత్తెమ్మే సాహసించింది. దేవత దిగివచ్చింది. చేతికి చిక్కిన పెన్నిధానాన్ని వెంకటయ్య రెండుచేతులా అందుకొన్నాడు.



## మూడో ప్రకరణం

రెండేళ్ళ క్రితం సరిగ్గా ఇవే రోజులు. రాత్రీ పగలూ బావివద్ద పని. ఏమాత్రం ఏమరినా పండబారిన చేనుకాస్తా ఎండిపోతుంది. ఎడ్లు నలిగిపోతున్నాయి. మనుష్యులు నలిగిపోతున్నారు. రాత్రింబగళ్లు పనితో వెంకటయ్య నలిగిపోతూంటే మనస్సు వొప్పక చేయగలదిలేక సత్తెమ్మ దిక్కులు చూస్తూంది. పొలంలో తనకి సహాయం ఇంటివద్ద తల్లికి సాయం చేస్తూ తిరుగుతున్న సత్తెమ్మనుచూసి వెంకటయ్య బాధపడుతున్నాడు.

ఆ రోజున వెన్నెల పుచ్చపువ్వులావుంది; ప్రకృతిఅంతా చల్లని తెల్లని తెరమాటున నిద్రిస్తున్నట్లుంది. నేల వుబ్బ తగ్గిపోయింది. చల్లని గాలి తోలుతూంది.

వెంకటయ్య మోటబోదె ప్రక్కనే చెంగలిగడ్డిలో పైపంచ పరుచుకొని నిద్రపోతున్నాడు. అతనికాళ్ళవద్ద అంత దూరంలో కావలి కుక్క పడుకొని వుంది. పశ్చిమానికి దిగిపోయిన చంద్రుడు చెట్లక్రింది నీడల్ని దూరం దూరం పాకిస్తున్నాడు. గాలికి చెట్లకొమ్మలు కదిలినప్పుడల్లా వెన్నెలరేకలు వెంకటయ్య వొంటిని తడుముతూ కదులుతున్నాయి.

తెల్లవారబోయే ముందు సత్తెమ్మ వచ్చింది. పాక వాకిట్లో మంచం ఖాళీగావుంది. కొద్దిదూరంలో కావలికుక్క గుర్రుమని తామక్కడున్నట్లు తెలిపితే అటు నడిచింది. గడ్డిలో వెంకటయ్య వెల్లకిలా పడుకొని వున్నాడు. ఆతడు పడుకొన్న విధంచూస్తే భయం వేసింది. పొలాల్లో పాములు తిరుగుతూంటాయి. రాత్రిళ్లు పొలాలు వెడుతూనూ పొలాలనుంచి వస్తూనూ పాముకాటుకు మరణించిన వారి కథలు గుర్తువచ్చేవి. గుండెలు

పట్టేసినట్లయింది. ఎంతో ఆదుర్దాతో అతనిప్రక్కకు వురికింది. ప్రక్కన మోకాళ్ళమీదపడి రెండుభుజాలూపట్టి కుదుపుతూ మొగంమీద మొగంపెట్టి చూసింది.

ఆ కుదుపుకు వెంకటయ్య కళ్ళుతెరిచేడు. ఆమె సంతోషం పట్టలేక పోయింది. ఆదుర్దా ఆనందమూతో సంకోచాలూ సందేహాలూ ఎక్కడివక్కడ తప్పుకొన్నాయి. ఇంక అక్కడ మిగిలిందల్లా పాతికేళ్ళ పడుచుదనం ఒక్కటే.

ఆ రోజు మొదలు వెంకటయ్య మరోపడుచుతో హాస్యంకూడా ఆడలేదు. నిరాభరణమైన ఆమె నిసర్గసౌందర్యంతో గ్రామంలోని అందగత్తెల నగలు నిండిన మెడల్నీ కాలుచేతుల్నీ పోల్చి నవ్వుకొనేవాడు. తెల్లని మోటుచీరలలో దాగిన ఆమె దృఢశరీరం అతనిని స్వర్గాల అంచులకు తీసుకు పోయింది. మోటసరసాలూ, హాస్యపుమాటలూ లేకపోయినా వారి కళ్ళల్లోనూ గతుల్లోనూ లోకం కానని లోతులు కనబడ్డాయి.

అతని సన్నిధానంలో సత్తెమ్మ కళ్లు దుఃఖరేకల్ని విడిచేయి. నడకలో చురుకుదనం విలాసం విభ్రమం ప్రవేశించేయి. ఆ చూపుల్లో ఆ మాటల్లో ఆ నడకల్లో అసలు శరీరం తీరులోనే జీవితానందం పువ్వులు తొడిగింది.

ఊళ్లో గుసగుసలు బయలుదేరేయి. పొరుగింటి నేస్తం ముంతాజ్ కసి తీర్చుకొనేటందుకు బుగ్గలు పొడిచింది. సత్తెమ్మ గిలిగింతలు పెట్టినట్లు నవ్వింది. తల్లి అనుమానాన్ని దాచలేక మాటతేలలేక చురచురాచూసి నప్పుడు తన్ను కానట్లు తలతిప్పుకొంది. ఆమె కూతురుమీద అభిమానాన్ని వెంకటయ్యను ఈసడించడంతో సంతృప్తిపరచుకొనబోయింది. కాని కూతురు భృకుటిక్షేపంలో ప్రళయ కల్లోలపు పొలిమేరల్ని తొక్కి చూసి నాలికను సంభాళించుకొంది.

ఒకమారు తల్లి కూతురు అభిమానాన్ని రక్షించడానికి నడుంకట్టక తప్ప దనుకొంది. కూతురికి హితబోధ ప్రారంభించింది. ఆమె మారుచెప్పలేదు. ఆధైర్యంతో వెంకటయ్యను పనిలోంచి పంపెయ్యాలని ప్రతిపాదించింది. సత్తెమ్మ వెంటనే వీటోచేసింది.

ఆ ఆవేశంలో తల్లి తిట్టినప్పుడు ఆమె తన భయాలన్నింటినీ పాతేసింది. ప్రతిమాటలో బల్లేలు విసిరింది. అశ్చర్యంలేదు. ఓ కునిష్టిని క్షయరోగపక్షిని అర్థాయుష్షుగాడిని తనకు మొగుడంటూ గొంతుకోసిందని ఇదివరలో ఆమె తల్లిని ఎన్నోమార్లు మనస్సులోనే తిట్టుకుంది. ఇప్పుడా అభిప్రాయాల్నే బయట పెట్టింది.

కోపోద్రేకంలో మాటజారినా మాటమధ్యలోనే సిగ్గేసింది. సిగ్గుతో ఉడుకుబోతుతనం పుట్టుకొచ్చింది. ఆ ఉడుకుబోతుతనంతో మంచంమీద పడి ఏడ్చి రెండుపూటలు ఉపవాసం చేసింది.

ఆ రెండుపూటలూ వెంకటయ్యకు తిండికూడా దొరకలేదని తెలిసింది. ఇంకామె మనస్సు నిలబడలేదు. ఇంత కూడు మూటగట్టుకొని పొలం బయలుదేరింది.

ఆమె సన్నాహాలు చూస్తూన్న ముసలమ్మ నిర్విణ్ణురాలై నిలబడి పోయింది. గుమ్మంలో నిల్చున్నదల్లా ప్రక్కకు తప్పుకొని నోట్లోనే గొణుక్కుంది.

"ఎంత సిగ్గుమాలినదానివి పుట్టేవే."

సత్తెమ్మ వినబడనట్లు గుమ్మందిగి పది అడుగులు వేసింది. మళ్ళీ వెనక్కి వచ్చింది. రుసరుసలాడుతున్న తల్లిఎదుట నిలబడింది. ఆమె చూపుల్ని తట్టుకోలేక తల్లి తల తిప్పుకొని యింట్లోకి తిరిగింది.

"అమ్మా!"

ముసలమ్మ నిలబడింది. సత్తెమ్మ సందేహిస్తున్నట్లు ఒక్కక్షణం ఆగింది. ఇంతవరకు మనస్సులోని కోరికను బయటపెట్టనివ్వని బెదురులే ఇప్పుడూ నోరు నొక్కేయి. కాని తప్పదు. బయటపడాలి.

తల్లి మళ్ళీ అసహ్యం ప్రకటించింది. కూతురు సిగ్గులేనితనం తమ యింటా వంటా ఎక్కడా ఎప్పుడూ లేదంది.

సత్తెమ్మ ఆవేశపడింది. ఆ ఆవేశంలో సందేహం ఏకాస్త మిగిలినా ఎగిరిపోయింది.

తనయెడ కూతురు వెలిబుచ్చిన అభిప్రాయాన్నివిని తల్లి అదిరిపోయింది. కూతురుకు పెళ్ళిచేయడంలో తన తప్పేముందో ఆమెకు తోచలేదు. ఆడపిల్ల అయ్యాక పెళ్ళిచెయ్యక తప్పదు. కనక ఓ వరుణ్ణి చూసింది. వాళ్ళకో పెద్ద లోగిలివుంది. సంసారం కొంచెం చితికిపోయినా పేరూ, ప్రతిష్ఠావున్నవాళ్లు. పెద్దయింటివాళ్లు. వాళ్ళతో సంబంధం తమకేగొప్ప అనుకోవలసిన స్థితి. వాళ్లువచ్చి పిల్లని చేసుకుంటామనడమే చాలగొప్ప అనిపించింది. సంతృప్తిపడింది. కాని ఇప్పుడా సంతృప్తిని కూతురు దెప్పి పొడుస్తూంటే ఏమనుకోవాలి? ఆ కుటుంబం మనుష్యులూకూడా అంతగా చితికిపోయారని ఆమెకేం తెలుసును?

ఆమె దిగ్భ్రమచెంది కూతురు ముఖంవంక చూస్తూ నిలబడిపోయింది.

వాళ్లు ఆమె కిచ్చింది మొగుణ్ణీకాదు. మగాణ్ణీకాదు. అది నిజమే. కాని అది తనకు అర్థంఅయ్యేసరికి చెయ్యిదాటిపోయింది. పెళ్ళినాటికే తనకి కొంచెం తెలుసు. కాని ఏదో చిన్నతనం అనుకొందేగాని అల్లుని శృంగార లీల వివరాలు పరిశీలించేటందుకు ప్రయత్నించలేదు. ఏదో ఎవరుమాత్రం చెయ్యడంలేదులే - అనుకొంది. సరిపుచ్చుకొంది.

కూతురు అత్తవారింట్లో సుఖపడిందిలేదు. రాత్రీ పగలూ బండచాకిరీ చేయించేరు. జీవితానికి సరిపడా నైరాశ్యం వైరాగ్యం నెత్తికెత్తేరు. మగడు చచ్చిన మరునాడే పెట్టి నెత్తినపెట్టి పుట్టింటికి తోలేసేరు.

తాను ఎరిగిన గాథనే కూతురునోట వింటూంటే వీరమ్మకు తన అప రాధం నూరింతలు భయంకరంగా కనబడింది.

సత్తెమ్మ మనస్సులోవున్న అక్కసంతా కక్కేసి విసవిస బయిటకు నడిచింది. వెళ్ళేటప్పుడింకోమారు ఖబడ్దార్ చెప్పింది. ఇన్నాళ్ళకు, ఎన్నాళ్ళకో ఆమెకు మళ్ళీ బ్రతుకు దొరికింది. దానిని లాగెయ్యడానికి ప్రయత్నిస్తే ప్రతిఘటించకుండా వుంటుందా? "గొంతు నులిమేస్తా" నని వాగ్దానం చేస్తూంటే తల్లి మెడ తడివి చూసుకొంది. ప్రమాదం కలగలేదని స్థిరంచేసుకొని తలఎత్తేలోపున సత్తెమ్మ వీధిలోవుంది. అటుతర్వాత నామె కూతురు మమకారాన్ని క్రీగంట చూడ్డానికికూడా ప్రయత్నించలేదు.

ఆతనికోసం సత్తెమ్మ సమాజాన్నీ, కులమర్యాదల్నీ, కుటుంబగౌరవాల్నీ బంధుప్రీతినీకూడా ధిక్కరించింది. ఆతడే నేడు తనకు దూరమైపోతున్నా డనిపించేసరికి దుఃఖం ఆగిందికాదు. ఆతనిని నిలపగల సంఘబలం తనకు లేదని కన్నీరు కార్చింది.

కాని....

ఇంతవరకూ తనకు లేదనుకొన్న అధికారాన్నే ఆతడు కలిగిస్తా నంటూంటే నమ్మలేకపోయింది. వెంటనే పెళ్ళికి అంగీకరించనూ లేక పోయింది. ఆలోచనలో, అపనమ్మకంలో తలవంచింది. తలవంచుకొనే కళ్ళెత్తి చూసింది.

ఆ చూపుల్లోని అపనమ్మకాన్ని చదివి వెంకటయ్య తన ప్రతిపాదనను మళ్ళీ రెట్టించేడు.

"కామచిన్నీ! నిజమే మనం పెళ్ళిచేసుకొందాం."

ఒకవైపున ఆ పునరుద్ఘాటన మనస్సుకి ఆశ్వాసం కలిగిస్తున్నా ఒక్క మాటుగా నమ్మనూలేక పోయింది. ఆతని ఆలోచనల ధోరణిని అర్థమూ చేసుకోలేకపోయింది.

తడి ఆరని రెప్పల్లోంచి కోరచూపులు చూస్తూనే తన అనుమానాన్ని వెలిబుచ్చింది.

పెళ్ళిచేసుకోవాలనే పెద్దమనిషేనా ఈ పదిరోజులనుంచీ మాటేనా ఆడకుండా తప్పించుకు తిరుగుతున్నాడు? అనుమానం కలిగిందంటే ఆశ్చర్యం ఏం వుంది?

వెంకటయ్యా తన అపరాధాన్ని గుర్తించినట్లు సిగ్గుపడ్డాడు. తన ప్రతిపాదన అనుమానించవద్దని ప్రాధేయపడుతున్నట్లు ఆమెను మరింత దగ్గరకు లాక్కున్నాడు.

ఈ పదిరోజుల్నుంచీ ఈ ఆలోచనతోనే కొట్టుమిట్టాడిపోతున్నాడని తెలిసి సత్తెమ్మ ఆశ్చర్యపడింది. ఇదివరలో ఇంతవరకూ ఈ ఆలోచన ఎన్నడూ తమ ఇద్దరిలో ఏ ఒక్కరికీ కలగలేదు. హఠాత్తుగా ఇదెందుకు వచ్చింది? దీనిలో ఏదోవిశేషం వుండాలి.

సత్తెమ్మ ప్రశ్నలకి అతడు తన ప్రతిపాదననే రెట్టించి చెప్పేడు. ఆమె ఊఁ అనకపోతే బ్రతకలేనంటూ తన పదిరోజులు ఆలోచనల పర్యవసానాన్నీ ఒక్క వాక్యంలో తేల్చి తన గుండెల్ని అదుముకొన్న ఆమెతలలో మొగం దాచుకొన్నాడు.

నిన్ను విడిచిన బ్రతుకులేదన్నమాటకన్న మగవాడు ఆడుదానియెడ చూపగల ప్రేమకు మరో మాటలేదు. ఆ మాటతో సత్తెమ్మ హృదయం నిండిపోయింది. ఆతనిని మరింత బిగ్గరగా కౌగలించుకొంది.

వెంకటయ్యా ఈ పదిరోజులనుంచీ తన మనస్సులోపడ్డ ఆరాటాన్ని వివరించేడు. ఆమెను విడిచి దూరంగా వుండలేనన్నాడు.

కాని, సత్తెమ్మకు అతని ఆలోచనలకూ, పెళ్ళి ప్రతిపాదనకూ గల సంబంధం ఏమిటో అర్థంకానేలేదు. దూరంగా వుండలేననేవాడు. ఎందుకన్నాడు? అతని మాటలలో కేవలం ప్రేమప్రకటనేగాక, ఏదో కొత్త

విశేషం కూడా వుందనిపించింది. కౌగిలి విడిపించుకొని, ఆతనిని తగులుతూ ఎదురుగా కూర్చుంది. మీసాలూ జులపాలూ సర్దుతూ సంతృప్తి కనబరిచింది.

వెంకటయ్య ఆమెను మరల దగ్గరకు లాక్కుని శిరస్సుమూర్కున్నాడు. దూరంగా ఎవరుండమన్నారని అడిగితే సమాధానం ఏం వుంది ? ఒకరుండమనేదేమిటి ? తనకు బాధ్యతలేదా ? తమరు దొంగతనంగా కలుస్తున్నారు. లోకానికి తమ కలయిక ఇష్టంకాదు. ఆమెతల్లికే వొప్పువలలేదు. పైవాళ్ళది చెప్పేదేముంది ? ఆమెను నలుగురూ చులకనచేస్తారు. నాలుగుమాటలూ అంటారు. ఆమె మాటపడడాన్ని ఆతడు సహించగలడా ? ఇదివరకే వచ్చే మాటేదో రానేవచ్చిందంటే. వచ్చింది. ఆ విషయాన్ని గురించి ఆతడిదివరకు ఆలోచించలేదు. ఆ మాటకూడా తోచలేదు. కాని, ఇప్పుడు ఆ ఆలోచన తట్టింది....

ఇప్పుడే ఆ ఆలోచన ఎందుకు తట్టవలసి వచ్చిందో ?.... అంతకన్న తన గౌరవాన్ని గురించి ఆతడు చూపుతున్న శ్రద్ధకు సత్తెమ్మ బ్రహ్మానందపడింది. తన స్నేహితురాలితల్లి విషయంలో పట్వారీ లక్ష్మీనారాయణ చూపిన వ్యవహారం గుర్తువచ్చింది. వెంకటయ్యయెడ కృతజ్ఞతతో ఆమె మనస్సు నిండిపోయింది....

అంతవరకూ తాననుకొన్నదే తనకు వెంకటయ్యతో పెళ్ళయివుంటే ఇల్లాదూరంగా వుంటాడా అనుకొన్నదే కాని. తీరాచేసి ఆ ప్రసంగాన్ని ఆతడే తెచ్చేవరకు మహాగంభీరంగా తల అడ్డం తిప్పింది. తన్ను ఎవరన్నా ఏదన్నామాట అంటారనే భయంలేదని ఘట్టిగాచెప్పింది. తన్ను ఎవళ్లు ఏమనడానికీ ఎన్ని గుండెలుండాలి. "నా కొడుకులు, ఏమన్నా అంటే...." గుడ్లు పీకెయ్యదూ ? వాళ్ళబ్రతుకులు కడికి వీధి నెయ్యదూ ?

ఊళ్ళోవాళ్ళ రంకులు రచ్చకీడుస్తానన్నది. వెంకటయ్యకు సంతృప్తి కలిగించలేదు.

కాని, సత్తెమ్మ మళ్ళీ తలతిప్పింది. ఈ మారు ఆ ప్రతిపాదనకు గల అభ్యంతరాల్నే ముందుకు తెచ్చింది.

"వెధవముండతో పెళ్ళేమిటి?"

ఆతని తలను రెండుచేతులమధ్యా పట్టుకుని చుంబించింది.

"నీకేమన్నా అవుతుంది బాబో...."

అపాయశంకతో గలిగిన అదుర్దాను తెలుపుతూ గాఢంగా కౌగలించుకొంది.

కాని, వెంకటయ్య తన ప్రతిపాదనను ఉపసంహరించుకొనేటట్లు చేయడానికి ఆ అభ్యంతరాలు పనిచేయలేదు. సత్తెమ్మవద్ద ఆ ఎదురుప్రశ్నకంటె మారుసమాధానమూలేదు.

వెధవముండతో సంపర్కం పెట్టుకుంటే పనికివచ్చినప్పుడు పెళ్ళిచేసుకొంటే పనికిరాదా? పెళ్ళిలేకుండా సంపర్కం పెట్టుకుంటే ఏమీ ప్రమాదంరానిది కొత్తగా వస్తుందా? .... అదే అడిగేసేడు. అయితే ఆ బూతుమాట పవిత్రతచెడిపోకుండా చెవిలో నోరు పెట్టి అడిగేడు.

"ఛా! ఏమ్మాటలవి" అంటూనే సత్తెమ్మ కిలకిలా నవ్వింది. అతని ప్రశ్నకు సమాధానం ఏంఇస్తుంది? పది ఎదురుప్రశ్నలతో అసలు విషయాన్ని అడుగున పెట్టడానికి ప్రయత్నించింది.

"ఇల్లావుంటే చాలదేం?"

"పెళ్ళిచేసుకుంటే నాలోలేని అందం కొత్తగా వస్తుందా ...."

"తక్కువ కులాల్లోమాదిరిగా ఛ! మారుమనువేమిటి?....నవ్వుతారు"

"ఇంటా వంటాలేదు. మారుమనువు చేసుకొంటే నీకేమన్నా అవుతుందేమో. బాబోయ్ వద్దు ..."

"మన్నిరానిస్తరా? వూళ్లో వుండనిస్తరా?"

"మాతమ్ముడు ఏమంటడో? అమ్మ ఏమౌతది?...."

ఆమె ప్రశ్నలు అనేకదృక్కోణాలనుంచివచ్చేయి. సంఘం, ఆచారాలు, కుటుంబం, ఆర్థికసమస్యలు అన్నీ కదిలేయి. ఆఖరు ఆయుధంగా పిల్లలు పుడితే వాళ్ళగతేమిటంది.

"ఇప్పుడో?"

"పుట్టరు."

ఆ ధైర్యం ఏమిటో సత్తెమ్మ చెప్పలేదు.

"ముందూ అంతే..."

ఆమెతల అడ్డంగా తిప్పింది. అది అంగీకారమో, అనంగీకారమో అతడికి అర్థంకాలేదు.

వెంకటయ్య తన ప్రయత్నం మానలేదు.

ఆతని దృష్టిలోపిల్లలసమస్య ముఖ్యంకాదు. పుట్టబోయేపిల్లలు పెద్ద వాళ్ళయ్యేసరికి ఎన్నిమార్పులొస్తాయో? ఇదివరకు పెద్దయిళ్ళల్లో మారు మనువు లెన్నడన్నా వున్నాయా? ఇప్పుడది వాళ్ళయిళ్ళల్లో మామూలే అయిపోవడం లేదూ?

వెంకటయ్య తన వాదనలకు బలంగా వితంతు వివాహాలు చేసుకొన్న పెద్దరెడ్లవీ, దొరలవీ పేర్లు బాహరించేడు. ఈ మాదిరి పెళ్ళిళ్లుచేయించడంలో ఆర్యసమాజంవాళ్లు తీసుకుంటున్న శ్రద్ధనుగురించికూడా చేప్పేడు.

సత్తెమ్మ ఆ సమాజం పేరు నెప్పుడూ వినలేదు. అదేమిటో తెలుసు కొన గోరింది. కాని, వెంకటయ్యకూడా పెద్దగా చెప్పగలస్థితిలోలేడు. ఆ పేరు నాతడు విన్నదయినా ఈమధ్యనే. దాన్నిగురించి అతనికి తెలిసింది కూడా ఒక్కటేవిషయం. సాయిబులకీ వాళ్ళకీ చుక్కెదురు. తమలాంటి వాళ్ళు పెళ్ళిచేసుకొనేటందుకు సాయిబుల్లో కలిసిపోనక్కర్లేకుండా వాళ్ళే

చేయిస్తున్నారు. ఆ సమాజం తనకెంతవరకూ వుపయోగపడుతుందో అంత వరకే ఆతనికి అర్థం అయింది.

సత్తెమ్మ ఏమీ అనలేదు. తన ప్రతిపాదనకు ఆమెను వొప్పించలేక పోయానని వెంకటయ్య గ్రహించేడు. తన అసమర్ధతకి విచారపడ్డాడు.

"నేనింక నీకు చెప్పలేను. నిన్ను అంటుకోనూలేను."

అంటుకోనంటూనే ఆత డామెను మరింత దగ్గరకు లాక్కున్నాడు. ఆ మాటల్లో ఆత్మవిశ్వాసం కనబడ్డమేలేదు. సత్తెమ్మ ఆతని గుండెలమీద తలచేర్చి ఆతని ముఖంలోకి చూస్తూనవ్వింది.

ఆమెకు తెలుసును. వెంకటయ్య తనముందు ఎంతోసేపు బింకం చూపలేడు. ఆ మాటనే అంటూ కిలకిలానవ్వింది.

వెంకటయ్య నిట్టూర్చేడు. నిరుత్సాహంగా చేతులొవదిలేడు.

"మీ యమ్మలా మా సంగం వాళ్ళూరుకోరు."



# నాలుగో ప్రకరణం.

సంగం పేరెత్తేసరికి సత్తెమ్మ వులికిపడింది. ఆమెకు స్పష్టంగా తెలియ డంలేదుగాని, ఈ మధ్య నీమధ్య వెంకటయ్య సంగంవాళ్ళతో ఎక్కువ సంబంధాలు పెట్టుకొంటున్నట్లు ఆమెకు తరుచుగా అనిపిస్తూనేవుంది.

ఏడాదిక్రితం ఆతనికి ఇష్టంలేకపోయినా తానే సంగంలో చేర్పించింది. కాని, తర్వాత జరిగిన ఘటనలతో ఆమె అదిరిపోయి సంగంవేపుకూడా చూడవద్దని చెప్పింది. కాని, వెంకటయ్య వూరుకున్నట్లులేదు. ఆ సంగతి తనకూ చూచాయగా తెలుసు. కాని, ఆతడెన్నడూ ఆ మాట సూచనగానైనా తనకి చెప్పలేదు. మొదట్లో సంగంలో పేరివ్వడానికే ఆతడు మొరాయించిన ఘట్టం గుర్తుచేసుకొని, ఆమె తన అనుమానాలకు ఎక్కువ ప్రాధాన్యత కూడా ఇవ్వలేదు. తానూ ఏమీ ఎరగనట్లే నటిస్తూంది. అల్లాంటివాడు నేడు ఉన్నట్లుండి సంగం పేరెత్తడంతో నిర్విణ్ణురాలయింది.

తెలంగాణా పల్లెల్లో ఆంధ్రమహాసభకు "సంగం" అనేపేరు. ఆంధ్ర మహాసభ మధ్యతరగతుల వుద్యమంగానే వుండిపోయినంతవరకు గ్రామీణ ప్రజానీకాన్ని ఆకర్షించలేకపోయింది. చిలుకూరులో జరిగిన మహాసభలో వెట్టి వ్యతిరేక తీర్మానంచేసినా భువనగిరి మహాసభవరకూ అది కాగితం మీదనే వుండిపోయింది.

భువనగిరి మహాసభ అనంతరం ఆంధ్రమహాసభ, కార్యవిధానంలోనే పెద్దమార్పు వచ్చింది. ప్రజానీకాన్ని వెట్టికీ, జాగీర్దార్ల పీడనకూ వ్యతిరే కంగా సంఘటితపరచి చిలుకూరు తీర్మానాన్ని కార్యరూపంలో పెట్టడానికి నడుం కట్టింది. ఆ కార్యక్రమాన్ని అమలుజరపడంలో అంధ్రమహాసభ 'సంఘం' అయింది. సంఘం ప్రజలనోట్లో సంగంగా పరిణతి పొందింది.

ఏనాదిక్రితం ప్రక్క-వూళ్లోకి సంగంవాళ్లు వచ్చేరన్నారు. ఊరంతా సంగంకట్టేరనీ. వెట్టిమానేసేరనీ చెప్పేరు. సీతారాంపురంవాళ్ళు కూడా ఆ 'మీటంగా'నికి వెళ్ళేరు. తిరిగి వచ్చేటప్పుడు తిరిగి ఓ సంగం జెండా తెచ్చుకొన్నారు. దానితోపాటు సంగంనాయకుల్నీ పిలుచుకొచ్చేరు. తమ వూళ్లోకూడా సంగంపెట్టుకొన్నామని తప్పెట్లూ, తాళాలతో వూరేగింపు తీసేరు.

ఊరిబయట చింతలక్రింద పెద్దసభ జరిగింది. అన్నికులాలవాళ్ళూ, అన్నివృత్తులవాళ్ళూ, బీదా, సాదా జనంఅంతా సభలోవున్నారు. సంగం పెట్టేసేరు. పెద్దల్ని ఎన్నుకొన్నారు. వెట్టిచెయ్యడంలేదని తీర్మానం చేసేసేరు.

ఆనాడు వూరంతా పెద్దసంబరం జరిగింది. అమ్మవారి జాతరకూ్కడా అంత హడావిడి వుండదు.

సంబరం మంచిజోరుగావున్న సమయంలో దొరగారి సేరీదారు కిష్టయ్యా ధూం ధాంచేస్తూ, చాకలిపద్దాలుని వెట్టికి రాలేదని కేకలుపెడుతూ వచ్చేడు. ఆ రోజున దొరల యింట్లో పద్దాలుది వంతు. ఆ పద్దాలే అసలు సంగాన్ని ఊళ్ళోకితెచ్చింది. సంగం భవిష్యత్తు త్రాసులోపడింది. అంతా పద్దాలువేపే చూస్తున్నారు.

కాని, పద్దాలు వెనకాడలేదు. సంగం పెట్టుకొన్నాం. వెట్టిచెయ్యక్కర్లేదు పొమ్మన్నాడు. అనడం అవసరంకన్న గట్టిగానే అన్నాడుకూడా. మంగలి నరసయ్యా, కుమ్మరి గురవయ్యా, గొల్ల భాగయ్యా వగైరాలంతా 'అదిఅంతే' నన్నారు. సాతాని బూసయ్య వెట్టికి వెళ్ళమనకపోయినా, అంత తొందరెందుకని మందలించేడు. కాని, జనం ధోరణిచూసి, ధూము ధాములుచేసిన కిష్టయ్యను మందలించక తప్పలేదు. అతడే సంగానికి పెద్దమరి.

సభఅంతా అతని చర్యను ఆమోదించింది. సంగానికి జై కొట్టింది. మామూలుగా అరుపులు, తిట్లు, కర్రదెబ్బల ముక్తాయింపుతోగాని మట్లాడని

కిష్టయ్య నీళ్ళతొట్టిలోపడ్డ ఎలకలా చల్లగా జారుకొన్నాడు. జనం మళ్ళీ హర్షధ్వనులు చేసేరు.

ఆ వెళ్ళడం, వెళ్ళడం కిష్టయ్య పదిహేనురోజులు మళ్ళీ వూళ్ళో కనబడనేలేదు.

ఆ ప్రథమ విజయంతో ప్రజల సంతోషానికి హద్దులేలేవు. వూరంతా నిల్చున్నపాటున సంగంలోకి పేర్లిచ్చేసేరు.

సంగం కట్టడం విషయంలోగాని, పెట్టడం విషయంలోగాని వెంకటయ్యకేమీ భాగంలేదు. వూరంతా అంత సంబరం చేసుకొంటూంటే ఆతనికి దానిలో భాగం లేకపోవడం సత్తెమ్మకు నచ్చలేదు. ఆమె వెళ్ళమంటూంటే ఆతడు నవ్వేడు.

"మనం ఇద్దరం సంగం.మన సంగంలో మూడోవాడుండడానికి వీల్లేదు."

ఆతని పట్టువిడిపించుకొని సత్తెమ్మ వీధిలోకి వెళ్ళింది. గొల్ల భాగయ్యతో చెప్పి సంగంలో వెంకటయ్యపేరు చేర్పించింది. పెద్దల్ని ఎన్నుకొనే వేళకి పడుచుకారంతా ఆతని పేరు ఇచ్చేసేరు. వెంకటయ్యకి వూళ్ళో స్నేహిత బృందం ఎక్కువే. ఆ స్నేహితుల్లో అతనికిగల స్థానం పెద్దదే. అందుచేతనే ఆతడానాడు మీటింగుచాయలకి రాకపోయినా ఆతడు సంగం పెద్దల్లో ఒకడయిపోయేడు. ఆతనికి ప్రజలలోవున్న మంచి పేరుచూసి సత్తెమ్మ బ్రహ్మానంద పడిపోయింది.

కాని, ఆమె ఆనందం ఎన్నోరోజులుండలేదు. పదిహేనురోజులునాటికి నిజాం పోలీసులు వూళ్ళోకి వచ్చేరు. దొర పెద్దకొడుకు రమణారెడ్డి సర్కిలినస్పెక్టరు. ఆతని నాయకత్వాన పోలీసులు తెల్లవారేముందర వూళ్ళో వీధులన్నీ కాచేరు. మగాళ్ళనందర్నీ నిల్చున్నపాటున లాక్కువచ్చేరు. పోలీసులతోపాటే వూళ్ళోకివచ్చిన కిష్టయ్య సంగంపెద్దల్ని పేరు పేరున చూపించేడు.

ఊరంతా చూస్తుండగా పోలీసులు పద్దాలుని నడివీధిలో నిల్చోబెట్టి కాల్చేసేరు. ఇక మిగిలిన పెద్దల్నీ, ఆ రోజున మీటింగులో చురుగ్గా పాల్గొన్న వాళ్ళనీ కొట్టడం ప్రారంభించేరు. పదిహేను రోజులపాటు వూరంతా మంగలంలోలాగ వేగిపోయింది. ఓ అరడజనుమందిని జైళ్ళకు పంపేరు.

పోలీసులు పద్దాలుభార్యని లాక్కుపోయి స్టేషన్‌లో చాకిరీకి పెట్టారు. రెండునెలలయ్యేసరికి వొంటినిండా గాయాలతో ఆమెతిరిగి వచ్చింది. ఆమెను లొంగదీయడానికై రమణారెడ్డిచేసిన ప్రయత్నాలన్నీ విఫలమయ్యాయనుకొన్నారు. ఆమెను లొంగదీసే ప్రయత్నంలో అతని సంసారంకూడా విచ్ఛిన్నం అయిపోయిందని అనుకొన్నారు. అదో పెద్దకథ.

వూళ్లోకి తిరిగివచ్చేనాటికి ఆమెప్రాణాలు కళ్ళల్లో వున్నాయి. వూళ్లోకి గోలుగోలున ఏడుస్తూ అడుగు పెట్టింది. వెంకటయ్య దారిలో ఎదురయి ఆమెను మామయింటికి తీసుకెళ్ళేడు. కాని అత్తమామలు ఆమెను యింట్లో అడుగుపెట్టనీయలేదు. కడుపునపుట్టిన కొడుకుపోయేక కోడలితో సంబంధం ఏం వుందన్నారు. ఆమె నెత్తినగుడ్డ వేసుకొని వీధిలోకి నడిచింది. మరల వెంకటయ్యే ఆమెను తీసుకెళ్ళి తన స్నేహితుడింటిలో ఒక పంచచూపింప చేసేడు.

సంగం పెట్టడంలో వెంకటయ్యకు భాగం ఏమాత్రం లేకపోయినా పోలీసువాళ్ళదెబ్బలలో అతనికి పెద్దవాటాయే ముట్టింది. సత్తెమ్మ ఇచ్చిన డబ్బూ, దొర కూతురూ, అల్లుడూతో ఆమెకున్న పరిచయమూ అతనిని ఖైదుశిక్షనుంచి తప్పించింది. భర్తతో కలిసి దొరకూతురు సుమిత్ర బోళ్ళ పొలంవేపు చల్లగాలికి షికారువచ్చినప్పుడు కలిసిన పరిచయం వుపయోగ పడింది.

ఓ వారంరోజులు మంచంపట్టడానికి సరిపడా దెబ్బలతో వెంకటయ్య బయటపడ్డాడు. కర్రదెబ్బలకి నల్లగా కమిలిపోయి శరీరభాగాలు కదుములు

కట్టిపోయాయి. వానికింత ఆముదంవ్రాసి కాపడంపెడుతూ అతని దెబ్బలకి కారణంతానే అయ్యేనని ఎంతోఏడ్చింది. ఆమెనూరడించడానికై సంగంతో సంబంధంమాట అటుంచి ఆరోజున వూళ్లోకూడా లేనివాళ్ళకీ, ఏదోచుట్టా లింటికివచ్చిన పొరుగూరివాళ్ళకీకూడా, తనతోపాటు సమంగా దెబ్బలు తగిలినకధలుచెప్పేడు అత్తవారింట కూతుర్ని దిగబెట్టడానికి వచ్చిన మల్లయ్య గోలునఏడుస్తూ. తనది ఆవూరేకాదని చెప్తూంటే రమణారెడ్డి ఏమన్నాడో వెంకటయ్య చెప్పాడు. సత్తెమ్మ ఆ కధలువిని ఒక్కనిట్టూర్పు విడిచింది. కాని, అతనికి కలిగినబాధలో తనబాధ్యతనుమాత్రం మరచిపో లేక పోయింది.

కాని, వెంకటయ్యలో కసి రగిలింది. మంచందిగిన మొదటిరోజుననే ఆతడు సంగం నాయకులకోసం వాకబు ప్రారంభించేడు. చేయి ఆసరా యిచ్చి నడక అలవాటుచేయిస్తున్న సత్తెమ్మ ఆతని ప్రశ్నవిని దిక్కులు చూసింది. స్వరం తగ్గించి కళ్ళనీళ్లపెట్టుకుంటూ అతడినింక సంగంవూసు ఎత్తవద్దని ప్రాధేయపడింది.

వెంకటయ్య ఆశ్చర్యంతో ఆమెవేపు ఓరగంట చూసేడు. కాని, ఏమీ అనలేదు. సత్తెమ్మ ఆ చూపును గమనించింది. అర్థమూ చేసుకొంది. కాని, తన భయాన్నీ, ఆదుర్దానూ కప్పిపుచ్చుకోలేకపోయింది.

ఇంక వెంకటయ్య ఆమెవద్ద యెన్నడూ ఆ వూసు తీసుకురాలేదు. కాని ఆతడు సంగం వాళ్ళతో దగ్గర సంబంధాలు కలిగివుంటున్నాడని ఆమె త్వరలోనే గ్రహించింది.

వెనకటిమాదిరిగా గాక అతడిప్పుడు తరుచుగా రాత్రిళ్ళు ఎక్కడికో పోతున్నాడు. అడిగితే వూళ్ళో వూసాడుతూకూర్చుంటే పొద్దుపోయిందనో చేను చూసిరాబోయేననో ఏదో సాకుచెప్తున్నాడు. అవన్నీ వట్టిసాకులు మాత్రమేనని ఆమె త్వరతోనే గ్రహించింది. ఆమెగ్రహించిందని అర్థం

చేసుకొన్నా వెంకటయ్య ఏమీ ఎరగనట్లే పూరుకున్నాడు. సత్తెమ్మ కూడా మళ్ళీ ఏమీ అనలేదు.

అప్పుడప్పుడు ఎవరో బావివద్దకు వస్తూంటారు. ఏదో పనికోసం వాళ్ళని పెట్టేనని చెప్పేవాడు. మొదట నిజమేననుకొంది. కాని. ఆ వచ్చే వాళ్లు ఎప్పుడువచ్చినా ఏ రాత్రివేళో వచ్చేవారు. రాత్రి అయితేగాని వెళ్ళే వారుకారు. వాళ్ళ రాకపోకలకీ వెంకటయ్య రాత్రిసంచారాలకీ సంబంధం వున్నట్లనిపించింది.

కొత్తవాళ్ళని పనిలోకి పెట్టినరోజున తానుతెచ్చిన ముద్దకాస్తా వాళ్ళకి పెట్టేసేవాడు. మళ్ళీపోయి తెస్తానంటే వొప్పుకొనేవాడుకాదు. అతడు తిండి లేకుండా వుండగా చూడలేకపోయింది. కాని. అతడు అకలి వొప్పు కొనేవాడేకాదు. అటువంటి సందర్భాలలో వుపయోగపడేటందుకని ఓ బుడ్డెడు బియ్యమూ. జొన్నలూ పాకలో పాతిపెట్టి చూపించింది. వెంక టయ్య గ్రహించేడు. కాని. ఏమీ అనలేదు. ఎందుకనేనా అనలేదు. సత్తెమ్మకు సందేహమే లేకపోయింది.

అటుతర్వాత కూడా అతడు ఆమెకు ఏమీచెప్పకపోయినా. దాచడానికి ప్రయత్నం చెయ్యలేదు. తరుచుగా తమపనిలో కనిపించే అతనిపేరు సత్తి రెడ్డి అని తెలుసుకొంది. ఆయన వెంకటయ్యకు ఏవేవో పెద్దసంగతులు చెప్తూండడం ఓ రోజున వింది. వెంకటయ్య ఎప్పుడో చదువుకూడా నేర్చు కొన్నాడనీ. ఏవో కాగితాలు చదవగలుగుతున్నాడనీ ఆమె గ్రహించింది కూడా అప్పుడే. తనకు చదువు కొంచెంవచ్చినా తానెప్పుడూ అక్షరాలు నేర్పడానిక్కూడా ప్రయత్నించలేదు. కాని. సంగం మనిషి ఎప్పుడునేర్పేడో ఎన్నిసంగతులు నేర్పేడో వాళ్లు చెప్పుకొనేవి తనకేమీ అర్ధమేకావడంలేదు. అదేచాలు సంగంవాళ్ళమీద విపరీతమైన అభిమానం కుదరడానికి.

అతని మాటల్లో వెనకటల్లే బూతుమాటలు దొర్లడంలేదని ఆమె ఆరోజునే గ్రహించింది. సంభాషణ మధ్యలో వెంకటయ్య ఓ బూతుమాటని వూత

పదుంగావాడితే సత్తిరెడ్డి తప్పుపట్టేడు: వెంటనే వెంకటయ్య క్షమార్పణ చెప్పుకొన్నాడు తానిప్పుడు బూతులు మాట్లాడ్డం లేదనడానికి సాక్ష్యం సత్తెమ్మనే అడగమన్నాడు.

పాకచాటునుంచి వారిసంభాషణ వింటున్న సత్తెమ్మ ఆలోచించింది. నిజమేననిపించింది. తనకొక్కర్తికిమాత్రమే వినబడేలాగ చెవిలోనేతప్ప ఆతడీమధ్య బూతులు మాట్లాడ్డంలేదని ఆ రోజునే ఆమె గ్రహించింది. వెంకటయ్యకు మర్యాదలు నేర్పుతున్న సత్తిరెడ్డిమీద ఆమెకెంతో అభిమానం కలిగింది.

కాని, ఈవేళ సంగంవాళ్లు తమస్నేహాన్ని వొప్పుకోరనేసరికి ఒక్కమారు చర్రుమనిపించింది. తనతల్లికే పట్టనిగొడవ వీళ్ళకెందుకుఅనుకొంది.

సత్తిరెడ్డి చెప్పిన మాటలన్నింటినీ ఆతడు వినిపించేడు. పెళ్ళిలేకుండా ఈ వొంగసంబంధాలు పెట్టుకోవడంవలన సత్తెమ్మకెంతో అవమానం వస్తుందని ఆయన చెప్పేడన్నప్పుడు తన మిత్రురాలి తల్లిమాట గుర్తు వచ్చింది.

సత్తిరెడ్డివాదన అంతేకాదు. ఏ కడుపైనావస్తే మరింత అవమానం. అది పోగొట్టుకొనేటందుకు చేసేప్రయత్నాల్లో ప్రాణాపాయం కలుగుతుంది. కనక అలవాటున్నా లేకపోయినా నలుగురూ మెచ్చేపని చేయమన్నాడు.

అవన్నీ నిజమే. సత్తెమ్మ ఆలోచనలో పడింది. తన మర్యాదను, తన ప్రాణాన్నీ కాపాడ్డంకోసమే అంత శ్రద్ధతీసుకొన్న సత్తిరెడ్డి సలహా అంత సులభంగా కొట్టిపారెయ్యరాదు.

కాని,....

తనకోమాటు పెళ్ళయిందనేసంగతి ఆతనికి తెలుసో తెలియదో....

ఆ ప్రశ్నే అనవసరం. తెలియకపోతే ఇంత చర్చవచ్చేదేకాదు. వెంకటయ్యకూడా తలతిప్పేడు.

సత్తెమ్మ మొగుంతిప్పుకొని మరో ప్రశ్న వేసింది. తాను కొన్నాళ్ళు కాపురం వెలిగించిందని తెలుసునో తెలియదో.

వెంకటయ్య మళ్ళీ తలవూపేడు. నిజానికి సత్తిరెడ్డి వివాహ ప్రశంస తెచ్చినప్పుడు ఆతడు చూపినపెద్ద అభ్యంతరమే అది.

తనభార్యఅని చెప్పకోవలసినయామె మరొకడితో నాలుగురోజులేనా మె కాపురంచేసింది అనే ఆలోచన ఆతనికిదుర్భరం అనిపించింది. ఇప్పుడంటే వేరు. మరొకడి పెళ్ళాన్ని పక్కలోకితెచ్చుకొన్న వీరుడల్లే చలామణీ అవుతాడు. ఆమెనే పెళ్ళిచేసుకొంటే అన్ని తరవాయిలూ తీరిందాన్ని కట్టుకొన్నాడంటారు. అదీ ఆతని భయం.

చెప్పి చెప్పి సత్తిరెడ్డికి ప్రాణంచాలొచ్చింది. అంతవరకూ తానుపయోగించవద్దన్న బూతుమాట సహాయంతో తన మనస్సులోని విసుపు ప్రకటించేడు.

ఆమెను పెళ్లాంలా వుపయోగించుకోడానికి ఏ అభ్యంతరంలేదు: కాని. పెళ్ళాం అనుకొనేటందుకుమాత్రం అన్నీ అభ్యంతరాలే. అదేమన్నమాట?

వెంకటయ్య ఆలోచనలో పడ్డాడు. సత్తిరెడ్డి మరీసూటిగా చెప్పేడు.

"నువ్వు ఇన్నిచెప్పే ఆమె మొదటిమగడిమాట ఆమెతోవున్నప్పుడు నీకెన్నడూగుర్తురానే లేదా? పెళ్ళిఅంటే ఏమిటి: ఇప్పుడు మీమధ్యవున్న సంబంధానికి సంఘంవేసేముద్ర. ఆ ముద్రకి పనికిరాని ఆడది పక్కలోకి పనికివస్తుందందేం?"

తర్వాత ఈ మాదిరి సంబంధాలవలనవచ్చే దుష్ఫలితాలు సత్తెమ్మను ఏలా నాశనం చేస్తాయో చెప్తూంటే వెంకటయ్య తన ఆటంకాలన్నీ మరచిపోయాడు.

ఆరోజున సత్తిరెడ్డి వాదనలనే ఆతడు నేడు సత్తెమ్మముందు పెట్టేడు. ఆమెకు ఏమాత్రం ప్రమాదంగలిగినా తాను బ్రతకలేనన్నాడు. ఆమెకుకలిగే

అగౌరవం తన అగౌరవమేనన్నాడు. అతడామెతో పొందుతున్నతాదాత్మ్యం అంత ఘనిష్ఠం.

తను ఓ దురదృష్టవంతురాలని సత్తెమ్మ నమ్మకం. తన్నుపెళ్ళిచేసుకొంటే వెంకటయ్యకు అశుభం తగులుతుందని తాను భయపడుతూంటే పెళ్ళిచేసుకోకపోతే తనకు కష్టంవస్తుందని అతడు భయపడుతున్నాడు.

సత్తెమ్మ ఏమీ తేల్చుకోలేకపోయింది. తానే ఆ సంగంపెద్దతో ఓమారు మాట్లాడితే? అడిగింది.

ఎవరు ఎప్పుడువచ్చేదీ, ఎక్కడకెళ్ళేదీ, ఎక్కణ్ణుంచివచ్చేదీ ఎవ్వరికీ తెలియనివ్వరాపనేది రహస్యజీవితం గడుపుతున్న నాయకులతో పరిచయం పెట్టుకొన్నప్పుడు వెంకటయ్య నేర్చుకొన్న ప్రథమపాఠం. ఆమాటగుర్తు వచ్చింది. నిజానికి సత్తిరెడ్డి ఆరాత్రివస్తున్నాడని ఎరిగివున్నా పదిరోజులు దాకా రాడని అబద్ధం ఆడేడు.

కాని అసలుసంగతి మరోవిధంగా చెప్పేడు. మరునాడు ఇద్దరికీ కూడు ఇక్కడికే తెమ్మన్నాడు. పని అయ్యేక కూర్చుని కబుర్లుచెప్పుకోవచ్చు. మళ్ళీ ఆదరాబాదరా ఇంటికి పరుగెత్తనక్కర్లేదు.

ఆ మాటను సత్తెమ్మ అర్థంచేసుకొంటే సరేసరి....

సత్తెమ్మ అర్థంచేసుకొంది.



## అయిదో ప్రకరణం

ఆరోజున ఇంటికి వచ్చేసరికి సత్తెమ్మ పెద్దతుఫానును ఎదుర్కోవలసి వచ్చింది. అంతవరకూ తనయెడ ఎంతోభయం, భక్తీ, ప్రేమా చూపుతూ వచ్చిన తమ్ముడు రంగయ్య తన ప్రవర్తనపై చేసినవ్యాఖ్యానాల్ని వినేసరికి ఆమెకి కోపం బదులు ఆశ్చర్యంకలిగింది. తానంటే విశేష పరిచయంలేని కొత్తకోడలు సూరమ్మ తన తరఫుననిలబడ్డం చూసేసరికి ఆశ్చర్యంతో పాటు ధైర్యమూ చిక్కింది. తాను వెంకటయ్యను పెళ్ళిచేసుకోదలచానన్న సంకల్పాన్ని సరాసరివాళ్ళ మొహానపడవేసి. గింజుకుచావండన్నట్లు మొహం పెట్టింది.

ఇంక ఎవరికి వారే బలా బలాల ప్రదర్శన ప్రారంభించేరు. ఏడ్పులు, మొత్తుకోళ్ళు, రుంజుకోడాలు, మొగంమాడ్చుకోడాలు, ప్రారంభ మయ్యేయి. ఒకర్ని విడిచి ఒకరుపవాసాలు చేశారు. సమస్య పరిష్కారానికి వచ్చేటట్లు కనపళ్ళేదు.

తల్లి నూతిలోనో, గోతిలోనో పడతాననే దృఢసంకల్పాన్ని ప్రకటిం చింది. ఈ తుపానుకు ముందురోజున మాత్రమే వచ్చిన తమ్ముడు వెంటనే బయలుదేరుతున్నానన్నాడు. ఆ గుడిసేటి కొంపలో క్షణం వుండనన్నాడు.

కాని, సత్తెమ్మ తుపానుమధ్య కొండలా నిశ్చలంగా నిలబడింది. ఆమె ఏడవలేదు. ఎదిరించింది. సవ్యసాచిలా అందరికీ అన్నిమాటలు వప్పగించింది.

నూతిలోపడి ప్రాణం పోగొట్టుకోవడంలో తల్లికి కొన్ని మెలుకువలు నేర్పడానికి ప్రయత్నించింది. మనశ్శాంతికి వేదాంతబోధ చేసింది.

"ఎవళ్ళూ ఎవళ్ళకోసం జీవించడంలేము. చావడంలేము. చావదలచు కొన్నవాళ్ళెవరూ చెప్పిచావరు. గప్‌చిప్‌గా తమపని పూర్తిచేసేస్తారు. పెద్ద దానివై పోయేవు. ఉట్టిగట్టుకొని ఊరేగుతావా యేం? ఎప్పుడయినా చావు వుండేదే. కొడుకుచేతిమీదుగా వెళ్ళిపోతే పుణ్యమూ, పురుషార్థమూ; పైగా కూతురు చాటుమాటున ఏడవడంమాని బహిరంగంగా పెళ్ళికితెగించిందన్న అప్రతిష్ఠమాట చెవినిపడకుండా వెళ్ళిపోతావు. మంచిఆలోచనే, కానియ్యి."

కూతురు ఎకెసెక్కెపుమాటలకు తల్లి వీరమ్మ వుడికిపోయి నిల్చున్న పాటున నూతివద్దకు పరుగెత్తింది. తనవెనక్కాల ఎవరన్నావచ్చి నిలవ దెట్టేస్తారేమోనన్నట్టు భయంతో అడుగడుగునా వెనక్కిచూసింది.

సత్తెమ్మ సన్నికల్లుపొత్రం తీసుకుని వెంటబడింది. తాడు తెస్తున్నాను ఒక్కనిముషం నిలబడమని కేకేసింది.

"ఇదిగో ఈబండకాస్తా మెడకుకట్టుకొని మరీవురుకు. దిక్కుమాలిన ప్రాణం అంతసులువుగా పోదు. పైకితేలుతావు. ఎవ్వరో ఒకరుతీసి గట్టున పడేస్తారు. మళ్ళీ ఈపాడులోకం కనబడుతుంది. ఒక్క నిముషం ఆగు."

కూతురు తీసుకొన్న ధోరణిచూసేక వీరమ్మ ఇంక నూతులో పడాలనే సంకల్పాన్ని పూర్తిగా వదులుకొంది.

కొరడా చురుకుల్లాగ ఆమెమాటలు నసాళం అంటిపోతూంటే తమ్ముడు నోరు వెళ్ళబెట్టేడు.

"నీ ఏడుపు నాకుతెలుసు. ముండమోసిన అప్పఇంట్లోనేవుంటే నీపుచ్చ పూస్తుంది. నిన్నూ. పెళ్ళాన్నికూర్చోబెట్టి చాకిరీ చేస్తుంది. అటు పొలం పనీ, ఇటుఇంటిపనీ చేస్తుంటే నువ్వుపట్నంలో పెద్దరికం వెలిగించొచ్చు. ఇక్కడికి ఇరవైమూడేళ్లు వచ్చేయి. నీ పొలం హద్దులు నీకు తెలుసూ, నాలుగురోజులయి వూళ్ళోకొచ్చేవు. చేను ఏమౌతూందో చూచుకొన్నావా, నీకక్కర్లేదు. అప్పముండచేసేస్తూంది. నీకాశ్రమకూడా ఎందుకు; నలుగురి

చేతా నాలుగుమాటలుపడ్డా. పెళ్ళీపెటాకులూ లేకుండా నీయింట్లోచాకిరీ చేస్తూంటే నీ ప్రతిష్ఠకి ఘాటారాదు. అంతేగా నీరుంజుకోడానికి అర్థం?

తన మాటల అర్థంఏమిటో అక్క వివరించేసరికి రంగయ్యనోరు వెళ్ళబెట్టెడు. మరుగుతున్ననీళ్లనెత్తినపోసినట్లే. చెవులుమూసుకొని ఇంట్లోంచి పారిపోయేడు.

ఈవ్యతిరేకత గంద్రగోళం ఇంట్లోవాళ్ళతోనే ఆగినంతవరకు ఆమె లొంగలేదు. తల్లి తనబెదిరింపు వ్యర్థమయ్యేక సన్నిహిత బంధువుల్నితోడు తెచ్చుకొంది. ఇంక ఆమె ధైర్యం ఎంతో కాలం నిలబడలేదు.

అంతవరకూ తనను నెత్తినపెట్టుకొనేవాళ్ళూ, గౌరవించినవాళ్ళూ నేడు తానేదో కానిపనిచేయబోతున్నట్లు ఉపదేశం చేయడానికి పూనుకొనేసరికి ఆమె తన గాంభీర్యం నిలుపుకోలేక పోయింది.

వెంకటయ్య తనకుగల సంబంధాన్ని వారంతా ఎరిగినవారే. ఎరిగిసహించినవారే. హాస్యమాడి తలవూపినవారే. వారేనేడు గంభీరంగా హితోపదేశానికి పూనుకొనేసరికి ఆమెకు ఏడ్పేశరణ్యం అయింది.

ఏడ్చినా, ఆమె తన ప్రయత్నం విరమించుకొంటున్నాననలేదు.

ఉపదేశికులసంఖ్య రోజులుగడచినకొద్దీ పెరిగింది. పెద్దమనుష్యులం అనుకొనేవారు మనసాలలో అడుగుపెట్టేరు.

తన బెదిరింపులు విఫలమయ్యేక వీరమ్మ గ్రామపెద్దలకాళ్ళు పట్టుకొంది.

"పెద్దదాన్ని అయిపోయాను. బ్రతికినన్నాళ్లు బ్రతకను. నా కళ్ళముందు నాకన్నకూతురే ఇంటావంటాలేనిపని చేస్తూంటే భరించలేను."

ఆ పెద్దలు తమపెద్దరికాన్ని నిలుపుకొనేటందుకు ముందు ఆమెను నిరసించేరు.

"తోటకూరకాడ నాడేనా చెప్పకపోతే" ఇల్లాంటివి తప్పవన్నాడు ఒకాయన.

డబ్బు ఖర్చులేకుండా నానాచాకిరీ చేస్తున్నాడుగదాయని సంతోషించావంటూ వేరొకాయన ఆమె పొదుపరితనాన్ని ఎత్తి పొడిచేడు.

ముసలమ్మ ఏడ్చింది. ప్రమాణాలు చేసింది. పొలం పనికి ఎంత మంది పాలేర్లను పెట్టుకోడంలేదు ? ఈ విచిత్రమైనస్థితి తనకువచ్చిందిగాని.

విసుక్కుంటూ పెద్దలు సలహాలిచ్చేరు. ఒక్కొక్కరే కదిలేరు.

నరిసిరెడ్డి మనసాలలో స్తంభానికి జేరబడికూర్చుని గదిలో తలుపులు మూసుకొని కూర్చున్న సత్తెమ్మకు వినబడేలాగ హితోపదేశం ప్రారంభించేడు. ఈ పెళ్ళివలన కలగగల కష్టాలన్నీ తల్లిచేతా, తమ్ముడుచేతా ఏకరువు పెట్టించేడు.

సత్తెమ్మ తలుపు తియ్యలేదు. దేనికీ సమాధానం ఇవ్వలేదు. నోరు నొప్పిపుట్టి నరసారెడ్డి ఒక తిరుమంత్రం ఉపదేశించేడు.

"ఈ మదపిచ్చికి ఒక్కటేమందు. చింతబరికెలు నాలుగుతెచ్చి వీపు చిట్లగొడితే అన్ని తిమ్మిర్లూ వొదులుతాయి. ఒళ్ళు కొవ్వెక్కి...."

తోకతొక్కిన తాచులాగ బుసలుకొడుతూ సత్తెమ్మ గదితలుపు తీసుకొని గుమ్మంలో నిలబడింది. రేగినజుట్టు. ఏడవడంచేత ఎర్రబడ్డకళ్లు. బుగ్గల్ని కన్నీటితడి. తడికి అంటుకొన్న ఒకటి రెండు ముంగురులు. మాసినబట్టలు - ఆ ఆకారంలో అతడెన్నడు ఆమెను చూడలేదు. మగడు చచ్చి ఇంటికి చేరుకొన్న రోజునకూడా ఆమె అలాగలేదు. కోపంతో పెదవు లదిరిపోతూంటే. మీదపడిపోయేలావున్న ఆ చెట్టంతమనిషినీ చూసేసరికి నరిసిరెడ్డి హడలిపోయేడు. తన పెద్దరికాన్నికూడా మరచిపోయి తడబడు తున్న గొంతుకతో "అఁ, అఁ." అన్నాడు.

సత్తెమ్మకూడా అక్కడ ఎంతోసేపు నిలబడలేదు. నరిసిరెడ్డి పెద్దరికాన్ని ఒక్కమాటతో నేలగలిపి. వెనక్కితిరిగి. తలుపు భళ్ళున వేసుకొంది.

"వియ్యమ్మ కీ వైద్యం పనిచెయ్యలేదేం ? బహూశా తురకాణ్ణి వొప్ప చెప్పేవు అందుకే. నీ బ్రతుకూ, నువ్వూ...."

ఆధూత్కారంలో మొహాన్న ఏమన్నాపడిందేమోనని నరిసిరెడ్డి అప్ర యత్నంగా పైగుడ్డతో మొహం తుడుచుకొన్నాడు.

వియ్యమ్మ నరిసిరెడ్డి కూతురు. పెళ్ళికాకుండానే ముండమోసింది. వయస్సువచ్చింది మొదలు వూళ్ళో పడుచువాళ్ళకి వూరదేవత గుడిని విహారభూమిగా మార్చింది. ఎంతగింజుకొన్నా బంధువులు ఆమెను నిలుప లేకపోయేరు. చివరకు నరిసిరెడ్డి కొడుకులు ఆమె ప్రియుల్లో ఒకణ్ణి చంపేసేరు.

దానితో కొంతకాలం వూళ్ళో పడుచువాళ్ల వెనకాడేరు. చివరకి ఓనాడు పొరుగూరి జాగీర్దారు తమ్ముడు ఛోటేజాన్‌తో ఆమె ఏలాగో కత్తు కలిపింది. ఈ మారు తల్లిదండ్రులూ. అన్నదమ్ములూ భయపడేస్థితివచ్చింది. ఛోటేజాన్ కచ్చడంబండి కట్టుకొని సరాసరి యింటికేవచ్చేస్తాడు. ఆ బండి చప్పుడు వినగానే ఇంటిల్లిపాదీ ఎక్కడివాళ్ళక్కడే గప్‌చిప్. మాటమధ్య లోనే అందరికీ నిద్రవచ్చేస్తుంది.

ఒక్కొక్కప్పు డతడు వియ్యమ్మను తనతో బండెక్కించి ఎక్క డికో తీసుకుపోతూంటాడు. రెండు మూడురోజులామె ఎక్కడుందో ఎవరికీ తెలియదు. అయినా ఆమె ఇంట్లోవున్నట్లే అంతానటిస్తారు.

ఛోటేజాన్ ఒక్కొకరోజున తాగివచ్చి ఆమెను తన్ని పోతూంటాడు. ఆమె మీద తన కేదో పెత్తనం వున్నట్లు వాళ్ళతోనూ వీళ్ళతోనూ పోయే వంటాడు. అదో పెద్ద రభస.

సత్తెమ్మ కొట్టిన దెబ్బతో మనసాలలో వున్నవాళ్ళంతా స్తంభించి పోయేరు. ఒక్కరి నోట కూడా మాటరాలేదు.

సత్తెమ్మకూడా ఇంకఎదిరించనూలేదు. ఇంకపెళ్ళిమాట తలపెట్టను అని వాగ్దానం చేసింది. వెంకటయ్యను పనిలోంచి పంపెయ్యడానికి అంగీక రించింది. ఆ మాట అన్నతర్వాత ఒక్కమారు బావురంది.

అంత అప్రతిష్ఠపని మానినందుకు తన్ను అభినందించవచ్చిన తల్లిని తోసేసింది. ఆ ఉక్రోషంలో బండబూతులు తిట్టింది.

"వియ్యమ్మలా కనిపించినవాడికల్లా .... తే మీ ప్రతిష్ఠపోదు. పెళ్ళి చేసుకొంటే మీ బతుక్కి అప్రతిష్ఠ. ఛూ... "

తా నన్నమాటలకి క్షమార్పణ చెప్పకోడానికి వచ్చిన తమ్ముడి మొగం వేపుకూడా చూడలేదు.

"సబబు చెప్పడానికి మీరు తెచ్చిన మూకను చూసేక మర్యాదంటే మీకున్న అభిప్రాయం అర్థం అయింది."

ఆ మాట విన్నాక తమ్ముడు మరల ఆమె దిక్కు మొగం చూపడానికూ కూడా ప్రయత్నించలేదు.

ఆ వరసన సత్తెమ్మ రెండు రోజులు పూర్తిగా నిరాహార వ్రతంచేసింది. బ్రతిమాలిగాని, బెదిరించిగాని ఆమెచే ఎవ్వరూ పచ్చిమంచి నీళ్లకూడా త్రాగించలేకపోయేరు.

వెంకటయ్య పొలంలోవాడు పొలంలోంచే పనిమానుకొని వెళ్ళిపోయేడు. వెళ్ళిపోయేముందు ఒక్కమారు సత్తెమ్మను చూడగలిగితే బాగుండు ననుకొన్నాడు. కాని సాధ్యం ఎల్లాగ, బంధువుల కాపలాలో వున్న ఆమెకు కబురు అందించడం కూడా సాధ్యం కాలేదు. ఒక్క నిట్టూర్పు విడిచేడు. చూరులో గుచ్చిన చేతికర్రనున్న కంబళీ భుజాన వేసుకొని అల్లాగే వెళ్ళిపోయేడు.



# ఆరో ప్రకరణం

సత్తెమ్మ పరిస్థితులకు లొంగిపోయి తల వంచింది. కాని, ఆ లొంగుబాటులో చేసిన త్యాగం తల మళ్ళీ ఎత్తగల శక్తిలేకుండా చేసింది. ఆమె జీవనాడుల్ని పూర్తిగా క్రుంగదీసింది. ఆమెలో యిప్పుడు వెనుకటివుత్సాహం-ఉత్సాహమనేదేలేదు. ఎవ్వరితోనూ మాట్లాడదు. పలకరిస్తే ఏదో గాఢ నిద్రలోవుండగా లేపినట్లు మిర్రిచూపులు చూస్తుంది. పదింటికోమాట సమాధానం ఇస్తుంది. అదయినా ఎంతో విసుపూ, కోపంతో.

తల్లి ఆమెను మరల ప్రకృతిలోకి తేవడానికి ప్రయత్నాలు చెయ్యబోయింది. కాని, ఆమెఎదుట కనిపిస్తేనే సత్తెమ్మకు మహాచిరాకు. అయినా ఆమె ప్రయత్నాలు మానలేదు. చిరాకుల్నీ, పరాకుల్నీ లెక్కచెయ్యకుండా హితోపదేశంచేస్తూ వెంటబడేసరికి సత్తెమ్మ "కంయ్" మంది. "ఓరిదేవుడా" అనుకుంటూ ముసలమ్మ పారిపోవడంతప్ప ఏమీ చెయ్యలేకపోయింది.

"మీ గౌరవం కాపాడేను. ఇంకేం కావాలి? నా ప్రాణమా? తాడు తెస్తావా? విషం ఇస్తావా?"

ఆ మాట అన్నాక ఇంకామెను ఎవ్వరూ పలకరించలేకపోయేరు. క్రమంగా ఆమె ఇరవై నాలుగ్గంటలూ మంచంమీదనే పడివుంది. ఇంటి కప్పును నిర్నిమీలితంగా చూస్తూ వుండిపోతూంది. నవనవలాడుతూ ఎక్కవస్తున్న మొక్క వాడిపోయినట్లుంది మనిషి. తమ్మునికి బాధ అనిపించింది. వెళ్ళి పలకరించేడు. మందొకటి తెచ్చి యిచ్చేడు.

సత్తెమ్మ మాత్రం పొట్లం మంచంకోటి మూలలో పెట్టేసింది. తనకేమీ జబ్బులేదని చెప్పేసింది.

మరదలు అద్దంతెచ్చి మొగంముందు పెట్టింది.

"చూసుకోండి, ఏలాగున్నారో...."

సత్తెమ్మ అద్దంలో తన ప్రతిమవంకచూసి, అప్రయత్నంగానే రేగి వున్న జుట్టు సర్దుకొంది.

"మనుష్యు లెప్పుడూ ఒక్కలాగే వుంటారా? పెద్దదాన్ని అవుతున్నా, చిన్ననాడున్నట్లు లేనంటే...."

"పాతికేళ్ళ వయస్సులో పండుముసలి మాటలు" రంగయ్య నిశ్శబ్దంగా వెళ్ళిపోయేడు. కాని, మరదలు వెంటవదలలేదు. ఆమెకు ఆడబిడ్డపై ఎంతో అభిమానం ...

.... ఆ రోజున చీకటిపడేముందు పొరుగింటి ముంతాజ్ దొడ్డిదారిన యింట్లోకి వచ్చింది. కొంతసేపు ఆ మాటలూ, ఈ మాటలూ చెప్పి సత్తెమ్మను తమయింట సాయంపడుకొనేటందుకు రమ్మని కోరింది. వాళ్ళ అయ్య వూరికెళ్ళాడు.

వీరమ్మ ముంతాజ్ మాటల్ని నమ్మలేదు. ఎంతో ప్రయాసమీద లొంగి వచ్చిన కూతురికి మళ్ళీ మనస్సు మార్చేస్తారేమోనని ఆమె భయం.

ఆ యింటవచ్చిన గంద్రగోళంలో ముంతాజూ, ఆమెతండ్రీ కూడా సత్తెమ్మ అభిప్రాయాలకు అనుగుణంగా మాట్లాడేరు. వాళ్ళంతట వాళ్లుగా కలగచేసుకొని మాట్లాడలేదు; ఆ పేచీలలోకి దిగనూలేదు. అలాగని మాట వచ్చినప్పుడు నీళ్లు నమలనూలేదు. వీరమ్మ తన గోడు వెళ్ళబోసుకొంటూంటే సిలార్ తమలోవున్న అలవాట్లను చెప్పేడు. వాళ్ళల్లో మగడు పోతే పెళ్ళి చేయడం తప్పు అనే నిషేధం లేదు. ఇష్టంలేకపోతే తలాక్ ఇచ్చేసి మళ్ళీ నిఖా కట్టేసుకొంటారు కూడా.

ముంతాజ్ సరాసరిగా సమాధానం ఇవ్వలేదు.

"మా అయ్యే నన్ను పెళ్ళి చేసుకోమంటున్నాడు. నేనే కాదంటున్నాను గాని...."

ముంతాజ్‌కి ఓమారు పెళ్ళి అయింది. ప్రక్కవూళ్ళోనే దర్జీపని చేసుకు బ్రతుకుచున్న బుడన్ అనే పడుచువాడికిచ్చి పెళ్ళిచేశాడు, తండ్రి. పెళ్ళి అయ్యేక బుడన్ మళ్ళీ కొట్టుతెరవలేదు. సరాసరి మామయింటనే మకాం పెట్టేడు.

పైకి చూడ్డానికి బుడన్ ఎంత సౌమ్యంగా, అందంగా వుంటాడో అంత క్రౌర్యం, ధూర్తత్వం వుందని చెయ్యిజారేకకాని సిలార్‌కు తెలియ లేదు. దంపతులకి అనుకూల్యం కుదరలేదు. వాడు రోజూ త్రాగి వచ్చి కూతుర్ని కొడుతూంటే తండ్రిప్రాణం కొట్టుమిట్టాడి పోయింది. చివరికి ఓ రోజున దొడ్డిలోకి ఓ పంది వచ్చిందని వూళ్ళో వడ్డెరకుర్రాడిని ఒకడిని బల్లెంతో బుడన్ పొడిచి చంపేయడంతో సిలార్ ఇంకసహించలేకపోయేడు. ఇంట్లోంచి తరిమేసేడు. ఇంటికి చేరనివ్వలేదు. విడాకు లిప్పించి మళ్ళీ పెళ్ళిచేయాలని ఆలోచనలో పడ్డాడు. ముంతాజ్ ఆ సంగతే చెప్పింది.

ఆ సమాధానాలు విన్నాక వీరమ్మ ఇంక వాళ్ళని సలహా అడగలేదు. వాళ్ళు తన ప్రయత్నాలకు వ్యతిరేకులని ఆమె నిర్ణయించుకొంది.

ఇప్పుడు ముంతాజ్ సత్తెమ్మను సాయం రమ్మని అంటూంటే ఆమెకు అనుమానమే కలిగింది. తీరా తీసికెళ్ళి ఏం చేస్తారో, చల్లబడ్డ కొంపలో ఏం చిచ్చురగులుస్తారో యని భయం.

"నాడు. వాడ మధ్య భయమేంది పిల్లా!"

ఆ మాట వినడంతో సత్తెమ్మకు చాల కోపంవచ్చింది. ఇదివరకు అనేకమాట్లు ముంతాజ్‌కి సహాయంగా వాళ్ళయింట పడుకొంది. చాల మార్లు తల్లే పంపిందికూడా. ఇదే మొదటిమారు కాదు. అప్పు డెప్పుడూ తోచని 'నాడు వాడ'లు ఈ రోజు గుర్తు రావడంతో సత్తెమ్మకు ఆవేశం పుట్టింది. తల్లి తనను అనుమానిస్తూందని కోపమూ వచ్చింది.

"వెంకటయ్య వస్తాడట మాట్లాడాలి. వెడుతున్నా"

ఆశ్చర్యంతో నోరు తెరచిన ముంతాజ్ చెయ్యిపట్టుకు లేవదీసింది.

"రా."

కూతురు మాటవినగానే వీరమ్మ కంగారుపడింది. తాను అనుమానిస్తున్నాననే కోపంతో ఆమె యీ మాట అన్నదని గ్రహించినది. ఆ సమాధానంలో క్రోధాన్నీ, పెంకెవనాన్నీ అర్థం చేసుకొంది. తెగేదాకా లాగడం తెలివిగల పనికాదు. నిజంగా ఆ పిలుపులో ఏమన్నా కుట్రవుంటే కూతురు పైకి అనేస్తుందా? సర్దుకొంటున్న మనిషిని రెచ్చకొట్టకూడదనుకొంది.

"అదేం మాట పిల్లా!"

సత్తెమ్మ సమాధానం ఇవ్వలేదు. వెడుతున్నానని కూడా చెప్పకుండా ముంతాజ్‌ని చెయ్యిపట్టుకొని తీసుకుపోయింది.

ఇంటికి చేరేక ముంతాజ్ కోప్పడింది.

"నిన్ను రానివ్వదనుకొన్నా. అల్లా అన్నావేమిటి?"

ముంతాజ్ ఆందోళనకి కారణం ఏమిటో సత్తెమ్మకి తెలియదు. మామూలుగనే అనేసింది.

"లేకపోతే చూడు. వెధవ అనుమానాలు. తన పక్కలోంచి తీసుకుపోయినా కళ్ళుతెరవని ముండకి. ఇప్పుడు నీకు సాయం కావాలనేసరికి అనుమానంట. గింజుకు చావనీ."

సత్తెమ్మ ఇప్పుడు అనవలసిన మాటా, అనకూడనిమాటా ఆలోచించడం లేదు. తన వ్యవహారం వీధినిపడ్డాక ఆమెలో సున్నితం అనేది లేకుండా పోయింది.

కోపంలో ఏదోమాట అనేసినా, ఆ మాట వెనకటిజ్ఞాపకాలను ముందుకు తెచ్చేసరికి ఉక్కిరిబిక్కిరయి పోయింది. పూర్వ స్మృతులతో మనస్సు కలిగిపోయి దొడ్డిగుమ్మంలోనే కూర్చుండి పోయింది.

స్నేహితురాలి మానసిక వ్యధచూసి ముంతాజ్ చాల బాధపడింది.

"నువ్వు గట్టిగా నిలబడవలసింది బహన్!"

ఆ మాట విని సత్తెమ్మ ఏడ్చింది. వెక్కుతూనే అప్రయత్నంగా అనేసింది.

"ఒక్కమాటు చూడగలిగితే..."

ఎంతోగంభీరంగావుండే మనిషి ఆలాడీలాపడిపోతూంటే ముంతాజ్ సానుభూతి తెలిపింది. కళ్ళుతుడిచింది. అరచేతుల్లో దాచుకొన్న మొగాన్ని పైకి ఎత్తింది. చెవిలో రహస్యంగా తానుపిలుచుకువచ్చిన కారణంవూదింది.

"వెంకటయ్య వస్తా డిప్పుడు."

తల్లితో తానన్నమాటకు ముంతాజ్ ఎందుకు భయపడిందో సత్తెమ్మ కిప్పుడు అర్థం అయింది. ఆమె దౌత్యంనడుపుతూందనిపించి చాలకోపం వచ్చింది.

"తార్పుడు ప్రారంభించేవా?"

ఆ మాటలోని తీవ్రతకూ, నీచత్వారోపణకూ ముంతాజ్ నిస్తబ్ధురాలయి పోయింది. బారుమని ఏడుస్తూంటే ఆమెను ఊరడించడం ఓ పెద్ద పని అయిపోయింది.

"అల్లాంటి పనులెప్పుడూ చెయ్యకు. వెంకటయ్యను పంపేసెయ్యి."

ఈ విధంగా రాయబారాలు నడిపి, సంకేతాలు ఏర్పాటుచేసుకొని పరాయిఇంట్లో దొంగతనంగా కలుసుకోడం చిన్నతనం అనిపించింది. వెంకటయ్య తమయింట్లో వున్నప్పుడు మాత్రం వారు తమ సంబంధాన్ని రహస్యంగానే వుంచినా అది చిన్నతనం అనిపించలేదు. తమ సంగతి తల్లికి తెలుసును. అదామె కిష్టంలేదని తెలుసును. అందుచేత ఆమె ఎదుట నున్నంతవరకు వారు గుట్టుగానే వుండేవారు. కాని, నడకల్లో. చేతల్లో చూపుల్లో మనస్సులు ప్రతిబింబిస్తూనే వుండేవి. అది బహిరంగమూకాదు. రహస్యమూకాదు.

ఎరిగివున్న బంధువులూ ఏమీ తేలలేదు. ఏదో మామూలుగా జరిగి పోయే ఘటనలా వదిలేసేరు. చెలికత్తెల బుగ్గపొడుపుల్లోకూడ ఈర్ష్య. వినోదం మాత్రమే కనబడేవిగాని నింద వినిపించలేదు. ఏదో దొంగపని చేస్తున్నట్లు అనిపించలేదు.

కాని, ఇప్పటి పరిస్థితివేరు. ఈ పదిహేను రోజుల్లో నడిచిన వ్యవహారం. తల్లికి తా నిచ్చిన వాగ్దానం. వాటిదృష్ట్యా నేడు ముంతాజ్ తాము కలుసుకొనేటందుకు అవకాశము కలిగించడం ఎంతో చిన్నతనంగా కనిపించింది.

సత్తెమ్మ లేచి నిలబడింది. ముంతాజ్ చేయిపట్టుకొంది. ఆ చేతిని నెమ్మదిగా విడిపించుకొంటూ నెమ్మదిగా అంది.

"ఇల్లా కభుర్లుపెట్టి చిన్నపుచ్చవద్దని చెప్పు."

ఆ కబురు అందుకోవలసిన వెంకటయ్య మధ్యవర్తుల అవసరం లేకుండానే వాళ్ళముందు హాజరయ్యేడు. సత్తెమ్మమాట వినసూ విన్నాడు. క్షమార్పణా చెప్పుకొన్నాడు.

తనపని తీరిపోయినట్లూ, ఇంక వారిద్దరిమధ్యా తాను అడ్డం వుండదలచ నట్లూ ముంతాజ్ నెమ్మదిగా జారుకొనేటందుకు ప్రయత్నించింది. కాని సత్తెమ్మ వదలలేదు. తనముందుకు లాక్కుని, వెనకతిప్పి నిలబెట్టింది. ఆమె వీపు నానుకొని, రెండుభుజాలమీదా చేతులానించి. ఆమె తలమీదుగా వెంకటయ్య చూపుల నెదుర్కొంది.

"జరిగింది చాలదనా? ఇంకెప్పుడూ ఇల్లా రాబోకు."

తాను చేసినపనికి కోపపడ్డా, వెంకటయ్యతో అంత నిక్కచ్చిగా చెప్పగలుగుతుందని ముంతాజ్ అనుకోలేదు. ఆతనిపై ఆమెకున్నప్రేమనూ, ఒక్కరోజు ఆతడు కనబడకపోతే ఆమెపడే ఆరాటాన్నీ ఎరుగును. ఇద్దరిపీ ఇరుగు పొరుగిళ్లు కావడమూ, ఇద్దరిదీ ఇంచుమించు ఒకేవయస్సు కావడముతో వారిమధ్య అరమరికలులేవు. గత అనుభవాన్నిబట్టి సత్తెమ్మ ఈ మాదిరిగానైనా కలుసుకోడానికి తొందరపడుతూండి వుంటుందనే ఆమె నమ్మకం. కాని, ఇప్పుడీ మాటలువిని ఆశ్చర్యపడింది.

ముంతాజ్ కిదేమీ అర్థంకాలేదు. తాను స్నేహితురాలికి చేసింది ఉపకారమా? అపకారమా? ఆతని నొక్కమారు చూడలేక పోయేనని

ఒక్క క్షణం క్రితమే కళ్ళనీళ్ళు పెట్టుకొన్న మనిషి. ఆతడు నిజంగా ఎదుట నిల్చున్నప్పుడు ఇల్లా ఎదురు తిరుగుతుందేం ?

తన ముఖంవేపు చూడడానికై ముంతాజ్ వెనక్కి తలతిప్పబోతూంటే సత్తెమ్మ కదలనివ్వలేదు. రెండు అరచేతుల్లో ఆమె బుగ్గల్ని ఒత్తిపెట్టి, తల తిరగకుండా నొక్కిపట్టింది. గడ్డం అదిమి తలను నొక్కి పెట్టింది.

ముఖం చూడలేకపోయినా, తన వీపును అదుముతున్న రొమ్ముల కదలికలలో, ఆమె మనస్సులో రేగుతున్న తుపానును ముంతాజ్ అర్థం చేసుకొంది.

వెంకటయ్య తల గోక్కుంటూ నిలబడి పోయేడు. ఈ పదిహేను ఇరవై రోజులనుంచీ ఆమెపై బంధువులు తెచ్చిన వొత్తిడి తీవ్రతను ఆత డూహించ లేకపోలేదు. తాను వినకనూ పోలేదు.

ఆమె ధైర్యస్థైర్యాల నాతడెరుగును. ఆమె లొంగిపోయిందనే వార్తనే నమ్మలేక పోయాడు. ఇప్పుడీ మాట.

ఆ గంద్రగోళం రోజుల్లో ఆతడు సాధ్యమైనంతవరకు వూళ్ళోకి రాకుండా బావులవద్దనే కాలక్షేపంచేసినా, ఎవరో ఒక స్నేహితుడు ఎప్పటి కప్పుడు వూళ్ళో విషయాలు చెవిని వేస్తూనే వున్నాడు. ఊళ్లో పెద్దవాళ్ళు కొందరు తమ పెళ్ళికి వ్యతిరేకం. చాలమంది తటస్థం. పడుచుకారు అంతా తనకు అనుకూలం. కాని, ప్రధాన నిర్ణయం సత్తెమ్మమీద ఆధార పడివుంది. ఆమె ఎవ్వరికీ లొంగడం లేదని విన్నప్పుడు. అవసరమయితే ఆమె సహాయానికి పరుగెత్తడానికై వెంకటయ్య పనులన్నీ కట్టిపెట్టేసి కూర్చున్నాడు. కాని, కడకామె లొంగిపోయిందన్నారు. మొదట నమ్మ లేదు. తర్వాత నమ్మక పోవడానికి కారణం కనబడలేదు.

నేడు తాను కోరినంతమాత్రాన రాగలుగుతుందని అతడనుకోలేదు. కాని అవసరం. ప్రయత్నించేడు. ఫలించింది. అంతమాత్రంచేత ఆమె

తన చేతుల్లో పురుకుతుందని భావించలేదు. ఆమె విషయం తాను చెప్ప లేదు గాని, తానే ఆ సాహసం చేయలేదు. ఎవరో పరాయిమనిషి విషయములో, కొత్త మనిషి విషయంలో కలిగినట్లే మనస్సుకు సంకోచం కలుగుతూంది.

....అయినా సత్తెమ్మ రావద్దనీ, కనపడవద్దనీ అంటుందని ఆతడనుకోలేదు.

తాను మాట్లాడదలచిన సంగతేవేరు. ఆమె తన అభిప్రాయాన్ని మార్చుకోడానికి గల కారణాల్ని అడగకూడదనీ, వెనకటివి తవ్వి ఆమె మనస్సుని బాధించరాదనీ వచ్చేటప్పుడే ఆతడు నిశ్చయం చేసుకొని మరీ వచ్చేడు. కాని ఆమె మాటలతో ఆతని ప్రణాళిక తల్లక్రిందులయింది. అనుకోకుండానే, అంతవరకూ తాను అడగకూడదనుకొన్న సంగతులు ఎత్తుకొన్నాడు.

"నాకు నమ్మకం లేదు. నీ నోటితో చెప్పు. ఏది ఏమయి పోయినా సరే...."

అదివరకు మాట్లాడుతున్న విషయాంమీద అభిప్రాయం చెప్పమన్నట్లు ప్రారంభమయింది. ఒకదానికొకటి సంబంధంలేని మాటలే అయినా, సత్తెమ్మ కా మాటలు అర్థం అయ్యాయి. ముంతాజ్ కొంటెతనంగా భుజం ఎగరవేసింది. అయినా సమాధానం రాలేదు. ఆత డొక్కక్షణం ఆగేడు.

"భూమీ, పుట్రా, డబ్బూ దస్కంలేని ముహ్తాజ్‌ని. నీవో దేవతవు. నాకు అదృష్టంలేదు...."

ఆతని నిట్టూర్పుతో ఆమె దుఃఖం పొంగి పొర్లింది. రెండు కన్నీటి బొట్లు ముంతాజ్ తలలో ఇంకేయి.

"తల తడిపేసేలాగున్నావే"

ముంతాజ్ గిజాయించుకొని లోనికి పరుగెత్తింది. సత్తెమ్మ ద్వారబంధంమూలకు జేరబడిపోయింది.

ముంతాజ్ ఇషారాను వెంకటయ్య గ్రహించకపోలేదు. సత్తెమ్మ ఏడుస్తూందని చెప్పింది. ఆమెను ఊరుకోపెట్టుకో మన్నట్లు తమరిద్దరినీ వదిలి వెళ్ళిపోయింది. కాని. ఆతడు సాహసం చెయ్యలేకపోయేడు.

ఒక్క నిముషానికి వెంకటయ్య సర్దుకున్నాడు. ఈ మారు తాను పిలిపించిన పనిని గురించి ఎత్తుకొన్నాడు.

"నిజానికి నాకు సంబంధం లేదనుకో. కాని, తోట చేతులతో పెంచేను. అది పాడయిపోతుందేమోనని మనస్సుకి ఏలాగో వుంటూంది."

ఆతడు బోళ్ళపొలంగురించి తానుపడిన శ్రమను వర్ణించేడు. సత్తెమ్మ చెవులు రిక్కించింది. బాధాకరమైన సంభాషణనుంచి ప్రసంగం తప్పించి నందుకు సంతోషం కలగడానికి బదులు ఈమారు ప్రసంగం మరింతబాధ కలిగించింది.

బోళ్ళపొలం పాడుకానివ్వకంటే నవ్వొవచ్చింది. కాపురం వదిలిపోతూ మగడు ఆకలికి ఓర్చుకోలేడని ఒకామె అత్తగారికి వప్పచెప్పి పోయిందట. ఆలా వుందనిపించింది. తనకన్న బోళ్ళపొలం ఎక్కువన్నమాట. అదే అనేసిందికూడా.

కాని వెంకటయ్య ఇచ్చిన సమాధానం ఆమెను తల్లక్రిందులు చేసేసింది.

"నీమీదా, ఆ పొలంమీదా కూడ నాకేవిధమైన హక్కులేదు. నీమీద నాకు వెర్రి ముహబ్బత్ వుంది. కాని, దానిని చూపలేను. నిన్నుదూరం నుంచైనా చూడగల హక్కులేదు. కాని, పొలంసంగతి వేరు. అక్కడి కెళ్ళి ఓ నిముషం కూర్చున్నా ఎవ్వరూ వద్దనరు. ఆ అభిమానం చూపించ గలను. అంతే లేదా !"

సత్తెమ్మకు గత పది పదిహేను రోజుల ఘటనలూ గుర్తు వచ్చేయి. వాటితోపాటు నిరాశ, నిస్పృహా కూడా.

"ఏ దెల్లాపోతే నా కెందుకు ? నేను చెయ్యగలది మాత్రం ఏం వుంది ?"

ఆమెకు ధైర్యం చెప్పడానికీ, కర్తవ్యం బోధించడానికీ వెంకటయ్య చాలా చెప్పుకొచ్చేడు. ఆమె కది చెవికెక్కలేదు. విసుపు కలిగింది.

"నీ ఎరికనే ఎవరన్నా మొక్కా. మోటీ అంటే శ్రద్ధగలవాడుంటే కుదిర్చి రంగడితో చెప్పు."

వెంకటయ్య ఆమె మొగంవంక ఆశ్చర్యంతో చూసేడు. తానంటే ఒకప్పుడు రంగయ్యకి మంచి అభిప్రాయం వుంటే వుండొచ్చు. కాని, ఇప్పుడు అతడు తన మంచి సలహానికూడా సద్భావంతో తీసుకోగలడని ఎలా అనుకోడం ?

ఇద్దరూ చాలాసేపు నిశ్శబ్దంగా నిలబడిపోయేరు. ఈ మారు సత్తెమ్మే సంభాషణ ప్రారంభించింది.

"నేను ఆ తోట కేమన్నా చాకిరీ చెయ్యగలనా ? నా వశమా ?...."

ఆమె మాటలు మెత్తబడ్డట్లు సూచిస్తూన్నాయి. అదే సమయం. తన అభిప్రాయం తేల్చేడు.

"సరయ్యని పెట్టుకోరాదూ ? ముసలాడి కెవ్వరూలేరు. పొలాన్నే వుండి, వొండుకు తింటూంటాడు. తోటా, దొడ్డీ పాడుగాకుండా చూస్తూం టాడు."

సరయ్య ఎవరో జ్ఞాపకం చేసుకోడానికి సత్తెమ్మ ప్రయత్నించింది. కాని గుర్తురాలేదు. మరల వెంకటయ్యే సహాయం చేసేడు.

"నూజీడు సరయ్య. మామిళ్ల తెచ్చిచ్చేడు. యాదిలేదు ?"

ఈ మారు గుర్తురావడమేకాదు. వెంకటయ్య ప్రయత్నం ఏమిటో కూడా అర్థం అయిందనిపించింది.

అరవయికి పైగా వయస్సు. నెరసి మాసిన గడ్డం. డొక్కు పోయిన దవడలు. వేలాడిపోతున్న కండరాలు. సరయ్య ఆకారం కళ్ళ

ముందు మెదిలింది. అంతా అతన్ని నూజీడు ముసలాడనేవారు. ఆతడెప్పు డొచ్చినా సంగంవాళ్లు రావడానికి పూర్వమో, వచ్చి వెళ్ళాకనో, ఆతడో మారు కనిపించినప్పుడు సంగంనాయకు డొస్తాడాయని తాను అడగడం గుర్తు వచ్చింది.

ఇప్పుడా ముసిలివాని పేరు రాగానే మళ్ళీ వెనకటి అనుమానమే కలిగింది. ఆతని ముఖంవేపు చూసింది. కాని, దానిమ్మనీడలో ఆ ముఖం అర్థం కాలేదు.

సత్తెమ్మ ఆలోచించింది. తాను లేకపోయినా, సంగంవాళ్ళకి మదుగుగా వుపయోగపడేటందుకే వెంకటయ్య బోళ్ళపొలంలో సరయ్యని పెట్టమంటున్నా డనిపించింది. ఆ ప్రయత్నం ఆమెకు అభ్యంతరంకాదు. అందుకే అయితే తప్పక వొప్పుకోవా లనిపించింది.

తమరిద్దరినీ పెళ్ళి చేసుకోవాలసిందిగా సంగం వాళ్లు తెచ్చిన వొత్తిడి మూలంగానే ఇంత గంద్రగోళం జరిగిందనీ, వాళ్ళు ఆ పేచీ పెట్టకపోతే ఈ రభస వచ్చేదికాదనీ ఆమె అప్పు డప్పుడు అనుకోక పోలేదు. కాని, వాళ్ళ పట్టుదలవెనక ఎంత సద్భావం వుందోకూడా ఆ పది రోజుల రగడలోనూ అడుగడుగునా కనిపించింది.

ఆ గంద్రగోళం ప్రారంభమయ్యేక సంగంవాళ్ళు మంచికిగానీ చెడ్డకి గానీ ఆమె వ్యవహారాల్లో ఎదురుకాలేదు. అయినా వాళ్ళ అభిప్రాయం ఆమెకు తెలిసింది. పెళ్ళికాకుండా సంపర్కం వద్దన్నారు. కొన్నాళ్ళు కక్కుర్తి తీర్చుకొని మగాడు పారిపోతే, పెళ్ళి అయ్యేక పారిపోకూడదా అంటే ఆ స్థితివేరు. నేను పెళ్ళిచేసుకోవాలంటే సంఘాన్ని ఎదుర్కొని పెళ్ళి చేసుకోవాలి. సంఘాన్ని ఎదిరించగల దృఢ నిశ్చయం చూపగలవాని ఏకా గ్రతను శకించ నక్కర్లేదు. ఆ ధైర్యం లేనివాడితో సంపర్కం ఆత్మనాశ నానికి దారితీస్తుంది. సంఘంలో మగాడిస్థానం వేరు. ఆడదాని స్థితివేరు. ఈ విధంగా దొంగతనంగా సంపర్కం పెట్టుకొన్నప్పుడు ఏ కడుపన్నా

అయితే ఏమిటి చెయ్యడం? పెళ్ళిచేసుకొనే ధైర్యంలేనివాడు పిల్లవాడికి పితృత్వం అంగీకరిస్తాడా? ఆమె తన స్థితికి సమాధానం ఏం ఇస్తుంది? ఆమెను ఎవరు అనుకొంటారు? తలఎత్తుకోలేక వీధినపడాలి. లేదా ఏమందో పుచ్చుకోవాలి. ఆ పని తరుచుగా ప్రాణాపాయం కలిగిస్తుంది. తప్పకుండా ఆరోగ్యానికి దెబ్బ. భర్త పోతే ఎందుకు పెళ్ళిచేసుకోకూడదు? ఒకడుంచుకొన్నాడన్న మాటకన్నా మళ్ళీపెళ్ళి చేసుకొందన్నమాట భయంకరమా?

వాళ్లు పుణ్యం, పాపం, స్వర్గం, నరకం వగైరాల్ని గురించి ఒక్క మాట కూడా చెప్పలేదు. తన ఆరోగ్యం, తన క్షేమం, తన ప్రతిష్ఠ, తన భవిష్యత్తునూ గురించి మాత్రమే ఎంతసేపూ చెప్పేరు.

తల్లీ, వాళ్ళధోరణితో ఆ మాటల్ని పోల్చిచూసింది. పెళ్ళి చేసుకొంటానంటే ఇంతరాద్ధాంతం చేస్తున్న బుద్ధిమంతులు, ఆ మనిషితోనే చాటుమాటుగా రహస్య సంబంధాలు కలిగివుండడానికి పేచీ పెట్టలేదు. వస్తే అవమానం తనకు వస్తుంది. పోతే తానుపోతుంది. అంతేగా వాళ్ళ ఊరుకోడానికి అర్థం? కాని, పెళ్ళి అనేసరికి ఎంతపేచీ. దానిలో అగౌరవం ఏముందీ? పెద్దవుత్సవంగా సంతోషించే పెళ్ళికే తనకు అభ్యంతరం. తమయింటి ఆడపడుచు మళ్ళీ పెళ్ళిచేసుకోడం కుటుంబానికే మచ్చ! కన్న కూతురుకన్న, ఆమె ప్రతిష్ఠ, ప్రాణం మర్యాదకన్న, కుటుంబం, కులం మర్యాద ఎక్కువ. ఏ కడుపన్నావచ్చి, పెళ్ళి ప్రయత్నం చేస్తాం దను కొని మందుకూడా ఇప్పిస్తామన్నారు. ఎరకల పుల్లిమందుతింటే గర్భం పోకపోయినా, ప్రాణంపోతుంది. అల్లాగ ఎందరో చచ్చిపోయారని తన బంధువు లెరగరా? ఎరుగుదురు. కొంతమందిని తానే ఎరుగును. ప్రాణం దక్కినవాళ్ళు ఎవరన్నావుంటే యావజ్జీవం ఎందుకూ కొరగాకుండా తయారయ్యేరు. ఒకళ్ళిద్దర్ని తానూ చూసింది. ఆ రోజున సత్తిరెడ్డి అదేచెప్పేడు. గట్టిగా చెప్పేడు. కాని తనతల్లి! తాను చచ్చినా, యావజ్జీవం పనికి రాకుండాపోయినా ఆమెకేమీ చింత లేనేలేదా?

ఇల్లాంటి ఆలోచనలే ఈ పదిహేను రోజుల్లో కొన్ని వందలమార్లు ఆమె మనస్సులో పరుగులు తీసేయి. ఇప్పుడూ అవే తోచేయి.

"ఆ చెట్లు నీ చేతుల్లో పెరిగేయి. ఎవరినో ఒకర్ని నువ్వేకుదుర్చు" - అంది. వెంకటయ్య ఆలోచనకు తన అభ్యంతరం ఏమీ లేదన్నట్లు.

వెంకటయ్య ఆమె అభిప్రాయాన్ని అర్థం చేసుకొన్నాడు. కాని, తా నా విషయంలో కలగచేసుకో లే నన్నాడు.

సత్తెమ్మ ఏమీ అనలేదు. ఆతడు ఎందుకు నిరాకరించేదో అర్థం చేసుకోడం కష్టంకాదు. సరయ్యను కుదిర్చినది ఆతడేనని తెలుస్తే ఇంటిల్లి పాదీ కందిరీగలతుట్టలా రేగిపోతారు. వారి నెదుర్కో-గలశక్తి తనలోలేదు. మరి సరయ్యను రప్పించడం ఎల్లాగ ? కబురు ఎవరు చేస్తారు ? ఆ మాట అందించడానికికూ-డా వెంకటయ్య నిరాకరించేడు.

"ఎప్పుడో వస్తాడు. నువ్వే అడుగు."

ఆఖరు నిముషంలోకూడా ఆతడు తన వుద్దేశాన్ని బయటపెట్ట దల చుకో లేదనుకుంది. కాని, తానేమీ అనలేదు.

ఇద్దరూ అల్లాగే ఓ నిముషం ఏవేవో ఆలోచనలలో నిలబడిపోయేరు.

ఆఖరుకు ఆతడే "వెళ్ళనా ?" అన్నాడు.

సత్తెమ్మగుండె దడదడలాడింది. మాటకూడా గట్టిగారాలేదు. తల వంచుకొనే క్షమార్పణ వేడుకొంది.

"నామీద కోపం వుంచుకోకు."

వెంకటయ్య ఎంతో బాధతో ఆమెవంక చూసేడు. ఏం చెప్పగలడు ? ఆమెమీద కోపగించగలశక్తికూడా తనకు లేదని చెప్పాలి. కాని చెప్పలేదు. ఆమె మాటలకన్న కంఠంలో గద్గదికం ఆతనిని నిర్వాక్కు-ణ్ణి చేసింది. నోటితో ఏమీ చెప్పలేక చెయ్యి ఆడించేడు. తొందరగా అడుగులేసు కొంటూ వెళ్ళిపోయేడు.

సత్తెమ్మ ఆతడు వెళ్ళినవైపే చూస్తూ చాలసేపు నిలబడి పోయింది. వెనక్కి పిలుద్దా మనుకుంది. కాని, పిలువలేక పోయింది. ఒక్క నిట్టూర్పు విడిచింది.

వాకిట్లో చాలసేపు అలికిడి లేకపోతే ముంతాజ్ వెతుక్కుంటూ వచ్చింది. నీరసంగా దొడ్డిగుమ్మంవేపు చూస్తూ శిలా ప్రతిమలా నిలబడి వున్న సత్తెమ్మ భుజంమీద చెయ్యివేసింది.

"బహన్".

సత్తెమ్మ పెదవులు కదిల్చింది. ముంతాజ్ అడగలేకపోయిన ప్రశ్న కది సమాధానం.

ఇద్దరూ ఇంట్లోకి వెళ్ళేరు. చెరో మంచాన్నీ ఆశ్రయించేరు. అనేక ఆలోచనల మధ్య తల్లక్రిందులవుతూ ఎంతో రాత్రి అయ్యేవరకూ నిద్ర పట్టక దొర్లుతూనే వున్నారు.

ముంతాజ్ పక్కలోంచే పలకరించింది.

"నిద్రపోలా ?"

సత్తెమ్మ సమాధానం ఇవ్వలేదు. కాని, లేచి కూర్చుంది. ముంతాజ్ లేచి వచ్చి ఆమె ప్రక్కనే నిలబడింది.

సత్తెమ్మ ఆమె వీపు నిమిరి చేయి పట్టుకొని ప్రక్కన కూర్చోబెట్టుకొంది. ఆమె పెదవులు క్షీణస్వరంతో పలకరించేయి.

"ముంతాజ్ !"

ముంతాజ్ ఆమె ముఖంవంక చూసింది.

"నే నో తప్పు చేసేను. నే నిచ్చిన సలహా తప్పు. ఒకమారు పెళ్ళి అయ్యేక మొగుడూ, కాపురమూనా యన్నాను. నాది తప్పు".

ముంతాజ్ ఆమెను నిలపడానికి ప్రయత్నించింది. అవన్నీ ఇప్పు డెందుకులే - అంది. కాని సత్తెమ్మ ఆగలేదు.

"ఎందుకు చేసుకోకూడదు ? ఆడదానికి సుఖం, సంసారం అక్కర్లేదా? మనసిచ్చి మాట్లాడుకొనేటందుకు మనిషి లేక మంచంపట్టె నంటిపెట్టుకొని పరుండవలసిందేనా ?" అప్పుడు ఆమెను వేళాకోళం చేసింది. కాని, తనవట్టుకి తాను ఆగలేకపోయింది. ఈ రెండేళ్ళలో ఆమెకామాటే గుర్తు రాలేదు. ఇప్పుడు....

సత్తెమ్మ దుఃఖంతో మాట్లాడలేకపోయింది. ముంతాజ్ ఆమెకు ధైర్యం చెప్పడానికి ప్రయత్నించింది.

ఓదార్పు మాటలు విన్నకొద్దీ సత్తెమ్మకు దుఃఖం పొంగి పొర్లింది. అరచేతుల్లో మొగం వాల్చుకొని ఏడుస్తూ కూర్చుంది.

ముంతాజ్ ఆమె దుఃఖంలో సానుభూతి తెలుపుతూ ఆమె భుజంమీది చెయ్యి తియ్యకుండా నిశ్శబ్దంగా అలాగే కూర్చుండిపోయింది.

"నావాళ్ళే నా గొంతుకోసేరు. నన్ను మోసం చేసేరు. నీకా బాధ లేదు. త్వరలో పెళ్ళిచేసుకు సుఖపడు. నా మాటలు మరిచిపో." - అంటూ సత్తెమ్మ కళ్ళు తుడుచుకొంది.



# ఏడో ప్రకరణం

దుఃఖం, సంతోషం కూడా సాంక్రామికాలు. సత్తెమ్మ నిరుత్సాహం నేడింట్లో అందరినీ అంటుకొంది. ఇల్లిప్పుడు వెనకటల్లే సందడిగా వుండడం లేదు. శవం వెళ్ళిన యింట్లోమాదిరిగా అంతా నిశ్శబ్దం. ఒకరి ముఖం ఒకరు తప్పించుకు తిరుగుతున్నారు. ఎవరిముఖానా నవ్వనేది కనబడదు. ఎప్పుడేనా ఒక హాస్యపుమాట వినబడ్డా నూతిలో వేసిన బెడ్డమాదిరిగా అక్కడి అలలు అక్కడే అంతరించి పోతున్నాయి. అట్టే కదలికలు కలిగించవు.

వెనకటి మాదిరిగా ఇంట్లో పాటలు పదాలు వినబడవు. సత్తెమ్మ పాటలపుట్ట. ఇంట్లోవున్నా, పునిలోవున్నా గొంతెత్తి ఏదో పాడుతూనే వుంటుంది. పాట వినిపించకపోతే ఆమె ఇంట్లో లేనట్టే వీధిలోవాళ్లు అనుకొంటారు. ఆమె హృదయం విచ్చిన నవ్వు. ప్రతికదలికా, మాటా, ఘటన ఆమెకు గిలిగింతలు పెడుతుంది. నవ్వు నాలుగువిధాల చేటని తల్లీ వాళ్ళూ కోప్పడుతూనే వుండేవారు. కాని, అప్పుడుకూడా ఆమె నవ్వడం మానేదికాదు. అటువంటిది ఇప్పుడా పాటలూ లేవు, నవ్వులూ లేవు.

ఇంట్లో వచ్చిన ఈ మార్పు, ముఖ్యంగా అక్కగారి పరిస్థితి రంగయ్యకు చాల బాధ అనిపించింది. అసలీ తుపాను ఎందుకు తెచ్చిపెట్టేనాయనికూడా అంతా అయిపోయేక బాధపడుతున్నాడు. అంతవరకూ ఆతనికా ఆలోచన కలగలేదు. ఒక్కటే పంతం. అది కాస్తా చెల్లేక ఎంతపని చేసేనని పదిమాట్లనుకొన్నాడు.

తానేమో వితంతు వివాహాలు కావాలని వాదించేవాడే. అయినా తన అక్కగారు మళ్ళీ పెళ్ళిచేసుకొంటానంటే ఇంత రభస ఎందుకు తెచ్చేడు ?

ఆమెను నేలబెట్టి రాసేసేవరకూ తనకు ఆ సంస్కరణ దృక్పథంమాట ఎందుకు గుర్తు రానేలేదు ?

ఒకమారు పొలంవద్ద ఇల్లాంటి చర్చే వచ్చినప్పుడు రాజరెడ్డి అన్న మాటలు గుర్తు వచ్చాయి. మనస్సుకి మరీ బాధ కలిగింది.

వీరేశలింగం పంతులుగారి సమాజ సంస్కరణాభిప్రాయాల్ని న్యాపతి సుబ్బారావు పంతులుగారు బలపరిచేరు. విధవావివాహాలు జరిపించేటందుకు సాయమూ చేసేరు. ఆ విషయంలో ప్రోత్సాహం ఇస్తూ ఉపన్యాసాలూ ఇచ్చేరు. కాని,

....ఆయన సోదరుడే వితంతు వివాహం చేసుకొనేసరికి ఎదురు తిరిగేరు. పంతులుగారిమీద కక్ష కట్టేరు.

వీరేశలింగం పంతులుగారి ఆత్మచరిత్రనుంచి రాజరెడ్డి ఈ ఘటనను ఉదాహరించి చెప్పేడు.

సంఘంలో వున్న దురాచారాలమీద నిజంగానే కోపం వుండొచ్చును. వానిని నిర్మూలించాలనే పట్టుదలా వుండొచ్చు.

కాని, మనం ఒక్కటి మరిచిపోకూడదు. ఆ దురాచారాలు వందల కొలది సంవత్సరాలుగా మన నిత్యజీవితంలో భాగాలుగా ఏర్పడిపోయాయి. అవి మన మనస్సులమీదా, జీవిత పద్ధతులమీదా మనకు తెలియకుండానే పనిచేస్తున్నాయి. ఆ బంధనాల్ని మనుష్యుడు తెగ్గోసుకోగలగాలంటే అదంత సున్నితమూకాదు. సుఖమూ కాదు. మానవజాతి చరిత్రలో అటువంటి బంధనాలను తెగకోసుకొని బయట పడేటందుకు జరిగిన ప్రతి ప్రయత్నమూ ఒక్కొక్క పునర్జన్మ.

"తనదాకా వచ్చినప్పుడే తన విశ్వాసాల బలం బయటపడుతుంది." — అన్నాడు ఆ రోజున రాజరెడ్డి.

తాను దానికి అంగీకరించేడు. భావనా బలం లేకపోతే వాదనలలోనే మనిషి తేలిపోతాడని తాను అనుకొన్నాడు.

తన వాదనలలో ఎప్పుడూ గాంభీర్యం, విశ్వాసం కొరవడలేదనే అతని వూహ. తాను తనదాకా వస్తే - కూడా నిలబడతా ననుకొన్నాడు.

కాని....

ఇప్పుడేం జరిగింది ? తానేం చేసేడు ?....

తాము వూళ్ళోకొచ్చిన రెండో రోజున పడక గదిలో భార్యతో కభుర్లు చెప్తున్నాడు. మాటల నడుమ ఆమె అతడు చెప్పే సంస్కరణల కభుర్లని ముదలకించింది.

వితంతువులకి వివాహాలు చెయ్యాలంటూ అన్ని వుపన్యాసా లిస్తారే. ఇంట్లో పూచిన తంగేడులా వున్నారు. వాదినకి ఆ పెళ్ళేదో చెయ్యరాదూ ?

ఆ మాటలు విని, రంగయ్య వులికిపడి తలుపు వేపు చూసేడు. పెళ్ళాం నోరు మూసేడు,

"గట్టిగా అనకు. ఆవిడచెవిని పడిందంటే మనమిద్దరం ఈ యింట్లోంచి ఈపూటే మూటకట్టెయ్యాలి. వెధవముండకి పెళ్ళిమాట చెప్తే చంపే స్తుంది."

సూరమ్మ మగని అమాయికత్వానికి నవ్వింది.

"ముంతాజ్ మగడి గొడవల్లో ఆవిడచేత వందమాట్లు చీవాట్లు తిన్నాను. ముసల్మానుల్లో మళ్ళీపెళ్ళి తప్పుకూడా కాదు. ఆ పిల్లతండ్రి సిద్ధంగా వున్నాడు. కాని, అక్కగారి గురుత్వమే. ఆవిడ పెళ్ళి చేసుకోనంది. మంచిదానివి, నా దగ్గిరకనక సరిపడింది. పొరపాటునేనా అన్నావు గనక, గుడ్లు తోడేస్తుంది."

సూరమ్మ బహు తాపీగా సమాధానం ఇచ్చింది.

"ఈ మాటు వదిన తిట్టరులెండి. మాటవరసకి ఓమారు కస్సుబుస్సు మన్నా నాలిక పీకెయ్యరు."

భార్య అనుమానాన్ని ఆమెనోట విని రంగయ్య మహా తామస పడ్డాడు. తన అక్క వెంకటయ్యను ఎన్నుకొందన్న మాటను అతడు నమ్మలేక పోయేడు.

"పాలేరువాడు. ముండల ముఠాకోరు."

అది వెంకటయ్య ఆర్థిక, నైతిక విలువలయెడ రంగయ్య అభిప్రాయం. కాని, సత్తెమ్మ దృష్టిలో ?

ఒకప్పుడు తన అక్క పెళ్ళి చేసుకోడం గురించి అతడూ ఆలోచిం చేడు. సంఘ సంస్కరణను తన యింట్లోంచి ప్రారంభిస్తే, తనకు రాగల ప్రతిష్ఠను గురించి కూడా ఎన్నో సంగతులు అల్లుకొన్నాడు. తన అక్క మగడు ఏలా వుండాలో, ఏమిటో కూడా ఆలోచిస్తూ అనేక కథలు వూహించుకున్నాడు.

కాని తీరాచేస్తే తన అక్కగారు ఒక అతి సామాన్యమైన పాలేరు వాణ్ణి వరించి వూరుకొంది. పాలేరుకిచ్చి పెళ్ళిచేసేనని చెప్పుకోడాని క్కూడా సిగ్గేసేస్థితి. సంస్కరణ వివాహం చేసేమన్నా ఓ పేరూ, ప్రతిష్ఠా వుండాలి. పెద్ద చదువుకొన్నవాణ్ణో, పెద్ద వుద్యోగస్థుణ్ణో, ఆస్తిపరుణ్ణో వరించిందంటే ఓ పేరూ, ప్రతిష్ఠాను. కాని వెంకటయ్యని తన అక్క మగడనుకోడంలో ప్రతిష్ఠేమిటి ?

సూరమ్మ ఈ సంభాషణను ప్రారంభించడంలో దురుద్దేశం ఏమీలేదు. కాని, తీరా అది మగనిలో కలిగించిన వ్యతిరేకతను చూసేసరికి భయ పడింది. మాట తప్పించడానికీ, సాచెయ్యడానికీ చాల ప్రయత్నించింది. కాని సాధ్యం కాలేదు.

ప్రపంచానుభవం అంతగాలేని తన భార్య, ఏదో చుట్టపుచూపుగా వచ్చిన రెండోరోజున ఈ రహస్యాన్ని పసిగట్టిందే, ఎప్పుడూ ఇంట్లో

వున్న తల్లికి తెలియదా ? ఏ మాత్రం అనుమానం వున్నా వూరుకుంటుందా ?

ఆ కథాభాగాన్ని కూడా సూరమ్మ వినిపించింది. తప్పలేదు.

"వెంకటయ్యను ఆమె పంపెయ్యమన్నారట: కాని, వదినె వొప్పుకోలేదట. ఏమీ చెయ్యలేక వూరుకొన్నారట."

సూరమ్మకు ఈ విషయాలు చెప్పిన చెలికత్తెల మాటల్ని మొదట రంగయ్య నమ్మలేదు. కాని తర్వాత తల్లి ఆ మాటలు నిజమేనని చెప్పింది. అక్కమీదికోపం, తల్లిమీద జాలితో రంగయ్య మనస్సు కుతకుతమని పోయింది.

వెంకటయ్యకు ఆడపిల్లల వెంటబడే అవలక్షణం ఒకటున్నా, మనిషి చాల మంచివాడనీ, చురుకైనవాడనీ, తెలివిగలవాడనీ రంగయ్యకు మంచి అభిప్రాయమే వుండేది. తన అక్కగారు ఆతనిని పెళ్ళి చేసుకొనదలచిందన్నమాట వచ్చేకగాని ఆడపిల్లల వెంటబడడం వెంకటయ్య అవలక్షణమని అతని కెప్పుడూ అనిపించలేదు. తానున్న సమాజం అటువంటిది. ఊళ్ళోకి కొత్తకోడలు ఎవరన్నా వచ్చిందంటే. ఆమెను పక్కలోకి తెచ్చుకొనే మార్గాలకోసం దొరలు ఎంతో శ్రమపడతారు. నయం, భయం, డబ్బు, డాబు, అన్నీ వుపయోగంలో పెడతారు. పెద్దవాళ్ళ అలవాట్లే మిగిలినవాళ్ళూ అనుకరిస్తారు. ఆ సంఘంలో ఆడదాని విలువ పక్కవరకే. అందుచేత గతంలో వెంకటయ్య విజయాలు కుర్రకారందరికీ వినోదకరంగా మాత్రమే వుండేవి.

ఆతడు తన అక్కగారిని కూడా లొంగదీసుకొన్నాడనిపించి రంగయ్య మండిపడ్డాడు. ఆడపిల్లల్ని అల్లరిపెట్టేవాళ్ళకి, తమ యింటి ఆడవాళ్ళు అందని ఎత్తుల్లో వుండాలని ఆశలెక్కువ.

రెండో వేపున వెంకటయ్య ఆర్థికస్థితి,

ఇవి రెండూ రంగయ్య వ్యతిరేకతకి ప్రధానాలంబనాలుగా కనబడ సాగేయి. అక్క పెళ్ళిచేసుకోడం తనకిష్టమేననీ, ఈ రెండు అభ్యంతరాల మూలంగా తాను అంగీకరించలేకున్నాననీ ఆతడు అనుకొన్నాడు.

కాలేజీలో చదువుకొనే రోజులనుంచీ నూతన పరిసరాలు, చదివే పుస్తకాలు, నూతనములయిన తాత్విక ధోరణులు ఆతని అభిప్రాయాలలో ఎన్నో మార్పుల్ని కలిగించాయి. కులభేదాలు కల్పితాలన్నాడు. వితంతువులకు పెళ్ళి చేయడం ఒక అత్యవసర సంస్కరణగా స్వీకరించేడు. అనేక మాట్లు తనకు మంచివాళ్ళూ, తెలివిగలవాళ్ళూ అనిపించిన లెక్చరర్లూ, విద్యార్థులూ వివాహితులేమో తెలుసుకొన్నాడు. కాకపోతే వాళ్ళ తాత్విక ధోరణులేలాంటివో తెలుసుకొనేటందుకు చర్చల్లోకి తెచ్చేడు. వాళ్ళని తన అక్క పెళ్ళిచేసుకొంటే బాగుంటుందనీ అనుకొన్నాడు.

కాని, వెంకటయ్య విషయంలో ఆ ఆలోచన ఆతనికెన్నడూ తట్టనూ లేదు. తీరా ఆ పరిస్థితిని ఎదుర్కొనవలసి వచ్చేసరికి తట్టుగొనూ లేక పోయాడు.

ఆ వారం పదిరోజుల్లో భర్తను శాంతింప చేయడానికి సూరమ్మ చాల మాట్లు ప్రయత్నించింది. భర్తలాగ ఆమె వెంకటయ్యమీద ఇదివరలో ఏర్పడిన సద్భావాన్ని క్షణంలో కోల్పోలేకపోయింది.

ఆతనిని గురించి భర్త చాల చెప్పేవాడు. ఇదివరలో అత్తవారింటికి వచ్చిన ఒకటి రెండు పర్యాయాలూ తాను ఆతనిని చూసింది. వెంకటయ్యను ఆ యింట్లో ఎవరూ - ఒక్క అత్తగారు తప్ప-పాలేరులా చూడ లేదు. ఆమె కూడా అంతే. ఇప్పుడు ఇంత రభస చేస్తున్న తన మగడు ఆతనివద్ద హనుమంతుడిలా వుండేవాడు.

సూరమ్మ తన ప్రయత్నాలు విఫలమైనా మళ్ళా, మళ్ళా ప్రయత్నించింది. సత్తెమ్మ మొదటి మగడిని జ్ఞాపకంచేసి వెంకటయ్య విషయంలో చూపే అభ్యంతరాలను తొలగించడానికి కూడా ప్రయత్నించింది.

"వదిన మగణ్ణి ఎరుగుదురా? ఆతని ఆఖరు రోజులు మీరెరగరు. నే నెరుగుదును."

ఆమె కప్పటికి పదేళ్ళో, పదకొండేళ్ళో వుండేవి. తమ వీధిలోనే సత్తెమ్మ అత్తగారిల్లు కూడా వుండేది. అందుచేత ఆమెకు బాగాగుర్తు.

రంగయ్యకు అక్క మగడు గుర్తులేడు. ఎప్పుడో పెళ్ళిలో మాత్రం చూసినగుర్తు. ఆ గుర్తులు ఆయన ఆకారాన్ని వూహించుకోడానికూడా చాలలేదు. కనక భార్య వర్ణనకు చెవినొగ్గేడు.

"ఆయనకు చదువూ సంధ్యాలేదు. సంతకం కూడా పెట్టలేడు. మనిషెల్లా వుండేవాడో తెలుసా?"

సూరమ్మ చిటికెన వ్రేలు చూపింది.

"ఎముకలపోగు. నానా రోగాలూ తగుల్చుకొన్నాడుట. కాళ్ళడి పోయేయి."

ఆ ఆకారాన్ని తలుచుకొని వెలపరించుకొంది. ఆయనగా రిప్పటికీ బ్రతికివుంటే మీ బావ అని చెప్పుకొనేటందుకు సిగ్గుపడేవారేనాయని నిల దీసింది. ఆతనికీ, వెంకటయ్యకూ వున్న తేడాల్ని ఎదుట పెట్టింది.

కాని....

రంగయ్య ఆ విధంగా సమాధానపరుచుకొని వూరుకోలేకపోయేడు. బయట తల్లివద్దా, ఇతరులవద్దా ఏమన్నా, భార్యవద్ద మాత్రం తన అక్క పెళ్ళి చేసుకోనే కూడదని అనలేదు. ఆమె పెళ్ళి చేసుకోవచ్చు. కాని, వెంకటయ్య పనికిరాడు. ఆతనితోవున్న సంబంధం తెంపెయ్యాలి.

ఆతని అహంకారానికి భార్య విస్తుపోయింది. ఇంకేం అనలేక పోయింది.

రంగయ్య పట్టుదల నెరవేరింది. కాని, దానివలన ఆతని మనస్సుకి మాత్రం శాంతి కలగలేదు. తను తెచ్చిన రభసకు పర్యవసానంగా

వచ్చిన పరిణామాన్ని గమనించేక ఆతని వుత్సాహం సడలింది. తాను చేసిన పని మంచిదేనా అని ఆలోచనలో పడ్డాడు.

ఆ మధ్య తోటలో పండ్ల చెట్లమీద అలుముకొని అణగ తొక్కే స్తూందని నవనవలాడుతున్న జూకామల్లిని మొదలు కోసేసేడు. రెండు గంటల్లో తీగంతా వాడిలిపోయింది. అందాకా ఎంతో అందంగా కని పించిన తోట కళావిహీనంగా కనబడింది. తర్వాత విచారించేడు. ఎంత సౌందర్యాన్ని నేలగలిపేననుకున్నాడు. ఆనాడు మనస్సుకి కలిగిన క్లేశం, దుఃఖం ఇప్పుడు అక్కను చూసినా కలుగుతూంది.

ఆమెను మరిపించడానికీ, బాధాకరంగా కనిపించే ఈ పరిసరాలనుంచి దూరంగా తీసుకుపోవడానికీ, ఆమెను తనతోపాటు తాను ప్రాక్టీసు పెట్ట బోయే చోటికి రమ్మన్నాడు.

"ఆలా చేస్తే ముందు వెంకటయ్యను మరచిపోయేటట్లు చెయ్యొచ్చు. తర్వాత యోగ్యుడయిన వరుణ్ణిచూసి, ఆతనిమీదకు మనస్సు తిప్ప వచ్చును."

సూరమ్మ ఆ అభిప్రాయాన్ని బలపరచింది.

కాని, సత్తెమ్మ స్పష్టంగా 'రాను' అని చెప్పింది. ఆ మాటలలో అను మానం లేశంకూడా లేదు.

అంతవరకూ కూతురు వూరొదిలిపోతే ఆస్తీ, వ్యవసాయం చెదిరి పోతుందంటున్న వీరమ్మ ఆమె వెళ్ళడానికి నిరాకరించిన మాట వినగానే మండిపడింది.

"వూరొదిలిపోతే ఈ మారాముళ్ళన్నీ సాగవు."

ఆ మాటనే కూతురు వద్ద అనగల ధైర్యం ఆమెకులేదు. చాటుగనే రుంజుకొంది.

—०००—

# ఎనిమిదో ప్రకరణం

నాలుగు దూడకన్నెతాళ్లు కట్టకట్టి భుజానవేసుకొని, సరయ్యా ఆ యింటిముందు ఆగేడు. వీరమ్మకీ, కొడుక్కీ, కోడలికీ తాళ్లు కావాలో, తంపరకావాలో తెలీదు. సత్తెమ్మ అన్నీ చూసుకొనేది. ఆమె ఇప్పుడేమీ వినిపించుకోదు. పట్టించుకోదు. ఎవరూ ఏమీ చెప్పకపోయినా సరయ్యా కదలలేదు. వాకిట్లో పంచవార, పలుపుల కట్ట ముడ్డిక్రింద వేసుకూర్చు న్నాడు. నీరసంగా 'అమ్మ' అనుకొన్నాడు.

వీరమ్మ విసుక్కున్నా అతడు కదలలేదు.

"ఆ మధ్య అమ్మయ్య కావాలన్నారు".

సత్తెమ లోపలినుంచి అన్నీ వింటూనేవుంది. మొదట ఆమె కదల లేదు. తల్లీవాళ్లూ విసుక్కోడం. వీధిలో మనిషి తాను పురమాయించినట్లు చెప్పడం వినబడి, వీధిలోకి వచ్చింది. ఆమెను చూడగనే సరయ్యా దండం పెట్టేడు. అతనిని చూడగానే ఆమెకు వెంకటయ్య మాటలు గుర్తువచ్చేయి. ఇంతవరకు ఆమెకు సరయ్యమాటే గుర్తులేదు.

"నువ్వు వెనక పునాసమామిడి మొక్కలు తెచ్చేవుకదూ ?"

సరయ్యా వాకిట్లో కూర్చుని పలుపులు ఎదుట పడేసేడు. తా నెప్పుడో అడిగిన మాట గుర్తుంచుకొని పలుపులు తెచ్చినందుకు కూడు పెట్టించింది. ఈ మధ్య కనపడ్డం లేదేమంది.

"జబ్బు పడ్డా తల్లీ. అంచేతే ఇన్నాళ్ళదాక తేలేకపోయా".

అతడు భోజనం చేస్తూంటే ఆమె ఎదురుగా కూర్చుని క్షేమ సమా చారా లడిగింది. భార్యాబిడ్డల్ని గురించి అడిగినప్పుడు అతడు ముద్ద మింగ

లేక పోయేడు. దుఃఖంతో జేరగిలబడిపోయి. ఆకులోనే చేయి వదిలిపెట్టి చాలసేపు కూర్చుండి పోయేడు.

"లేరు తల్లీ! ఇంకెవ్వరూ మిగలలేను."

ఆతని సంసారం విచ్ఛిన్నమై పోయిన కథ చెప్తూవుంటే. సత్తెమ్మ కళ్ళల్లో నీళ్ళు తిరిగేయి.

సరయ్యకి ఒక్కడే కొడుకు. పిఠాపుర సంస్థానాధీశుడిచ్చిన ఆర్థిక సహాయంతో చదువుకొన్న హరిజన యువకుల్లో అతడొకడు. ఆతడెంత వరకు చదువుకొన్నాడో చెప్పలేక పోయేడు. కాని. రెండేళ్ళు చదివితే తాశీల్దారు అయిపోయేవాడే నన్నాడు.

ఆతడోమాటు సెలవులకి ఇంటికి వచ్చేడు. అప్పుడు గ్రామంలో పనివాళ్ళంతా సమ్మె చేస్తున్నారు. కూలిగింజలు కొలపడమా, డబ్బు ఇవ్వ డమా అనే పెద్దపేచీ వచ్చింది. ధాన్యం చవకగావుంటే కుంచెడు గింజలు కొలవడం, ప్రియమయ్యేసరికి ఓ పావలాడబ్బులు చేతిలో పెట్టడంగా వుండేది. అప్పటి రోజుల్లో ధాన్యం చవక అయింది. డబ్బులివ్వడం మాని గింజలు కొలుస్తామంటారు రైతులు. డబ్బులే ఇమ్మన్నారు కూలీలు. తగాదా వచ్చింది. సమ్మె చేసేరు. సరయ్య కొడుకు సమ్మెకు నాయకత్వం వహించేడు. గ్రామంలోని భూస్వాముల్ని ఎదిరించినందుకు కక్షతో, ఆతనిని రౌడీలచేత కొట్టించి చంపించేరు.

ఆ కొడుకు పోయేక తల్లి మళ్ళీ మంచం దిగలేదు. ఆమె చచ్చి పోయేక సరయ్య వూరొదిలేసేడు. దూరంపోయి నూజివీడు ప్రాంతాల్లో ఆపనీ, ఈపనీ చేసుకొని కొన్నాళ్లు గడిపేడు. అక్కడినుంచి నిజాము లోకి వచ్చేడు. ఒక్కపొట్ట. ఎంతకావాలి? ఏదేదో పనులు చేస్తూంటాడు. ఆతడు పలుపులు బాగా వేస్తాడు. ఆతనికి చుట్టుపక్కల గ్రామాల్లో మంచి పేరు వుంది. ఏదోరోజు గడిపేస్తున్నాడు.

ఆతని కష్టాలకు సత్తెమ్మ విచారం తెలిపింది. తమ పొలానికి ఆహ్వానించింది.

"నీకూ ఎవరూ లేరంటున్నావు. ఎవరివద్దా పనిలోనూ లేనంటున్నావు. పోనీ మా బోళ్ళపొలంలో వుండరాదా ?"

మొక్కా, మొటికా పెంచడం చిన్నపనేం కాదు. అతడూ పెద్దవాడయిపోయేడు. బరువు పనులు చెయ్యగలడా ?

సరయ్య అనేక అభ్యంతరాలు చూపేడు. అసమర్థతా, అయిష్టం ప్రకటించేడు. అవన్నీ విన్నాక, ఆనాడు వెంకటయ్య చెప్పినప్పుడు తాను పడ్డ అనుమానం సరియైనది కాదనుకొంది.

తమ తోటలో ఆతడు చేయవలసిన పెద్దపను లేవీ వుండవని చెప్పింది. తోటను కనిపెట్టుకు వుండాలి. దూడాదుడికీ పడి పాడుచెయ్యకుండా చూస్తుండాలి. మోటనీరు నారుమళ్ళకి మళ్ళించడం కూడా బరువుపనా ?

సరయ్య చాలసేపు ఆలోచించేడు. అంగీకరించేడు.

"సరే తల్లీ !"

సత్తెమ్మకు ఆతని అంగీకారం చాల సంతృప్తి కలిగించింది. వెంకటయ్మ అడిగినందుకు ఆ మాత్రమేనా చెయ్యగలిగే ననుకొంది.

ఆ సాయంకాలమే సరయ్య తన కాపురాన్నంతనీ ఓ చిన్నగంపలో పెట్టుకొని బోళ్ళపొలం చేరుకొన్నాడు.

మర్నాడుదయమే సత్తెమ్మ పొలం బయలుదేరింది. గత దినం నుంచీ అక్కగారిలో వస్తున్న మార్పును గమనించి రంగయ్య ఒక్కటూర్పు తీసుకొన్నాడు. వట్టినే కూర్చుని, అనేక ఆలోచనలతో కుంగిపోతూన్న అక్క ఏదో పనిపెట్టుకొంటే తప్ప తేరుకోలేదని ఆతడు గ్రహించేడు. ఆమె మనస్సుని మళ్ళించడానికి మార్గం వెతుకుతున్నాడు.

కాని, ఏమీ తోచడంలేదు. ఈ దశలో పొలంపనుల్లో ఆమె తిన్న ఆమెయే కలగచేసుకోడంతో ఒక పెద్ద బరువు దిగిపోయినట్లే సంతోషించేడు.

కూతురు పూనుకొంటే తప్ప ఈ ఏడాది వ్యవసాయం చెడుతుందని భయపడుతున్న తల్లికూడా ఈ పరిణామానికి తృప్తిపడింది.

కాని, ఆ సంతోషం, తృప్తీ రెండు రోజులుకూడ మిగలలేదు.

సత్తెమ్మ రెండురోజులు పొలం వెళ్ళింది. ఏ మొక్కకి ఎటువంటి సంరక్షణ కావాలో సరయ్య చెప్తూంటే వింటూ వెంట వెంట తిరిగింది. ఆ నెలరోజుల్లోనూ చేసేవాళ్ళూ, అదిలించేవాళ్ళూ లేక కట్టవలో దార్లు ఏర్పడ్డాయి. వాటిని జాగ్రత్తగా మూసెయ్యమంది.

అన్నీ చూసి, చెప్పి, విని సరయ్య విచారపడ్డాడు.

"పడుచువాళ్ళకిగాని అలవుగాని పని".

ఆ మాట ఎందుకన్నాడో అర్థం కాలేదు. ఈ రెండు రోజుల్లోనూ ఆత డొక్కమాటుకూడ వెంకటయ్యపేరు ఎత్తకపోవడం చూసి, తమ యింట్లో వచ్చిన గంద్రగోళం తెలుసుకాబోలు ననుకొంది.

వెంకటయ్య రాత్రీ పగలూ విసువులేకుండా ప్రతిమొక్కనీ ఎంత శ్రద్ధతో చూసేవాడో గుర్తువచ్చి ఒక్క నిట్టూర్పు విడిచింది.

ఇంక పొలంవైపు వెళ్ళలేకపోయింది. రోజూ ఏదోవేళ సరయ్యే వచ్చి పొలంలో కబుర్లు చెప్పిపోతున్నాడు.



## ఒకటో ప్రకరణం

సరయ్య కంచెలో మేస్తున్న ఎడ్లని తోలితెచ్చి తుమ్మచెట్టు క్రింద కట్టేసేడు. పోయి ప్రొద్దుటే వండుకొన్నదే ఇంతకూడు గంజిపోసుకు తిని, బొచ్చెకడిగి, పంచన వ్రేలాడుతున్న వుట్టిమీద పెడుతూంటే, పొలం వెలుపల గుట్టల్లో ఎక్కడో ఒక గూబ గుబగుబలాడింది. ఒక్క నిముషం శ్రద్ధగా ఆలకించేడు. చూరులోగుచ్చిన చేతికర్రమీదవేసిన పై పంచతీసి తలకు చుట్టేడు. కర్ర నేలని తాటిస్తూ బయలుదేరేడు.

కటిక చీకటి. నిర్మలంగావున్న ఆకాశపు టంచుల్లో, చెట్టు పుట్టల ఆకారాలు కాటుకకుప్పలు పోసినట్లున్నాయి. పొలంచుట్టునావున్న కోరడిలోని నల్లతుమ్మలమీద వేలూలక్షలూగా మిణుగురులు మిలమిలలాడుతూ ఆకాశానికి అద్దంపట్టినట్లు కనబడుతున్నాయి.

కాపలాకుక్క అడుగులో అడుగువేసుకొంటూ వెంటవస్తూంటే, సరయ్య కోరడిగుమ్మానికి ఎదురుగా, బయటనున్న ఒక పెద్దబండప్రక్కన నిలబడ్డాడు. నక్షత్రాల వెలుతురు సంజచీకటిలా గనిపిస్తున్నా, పదిగజాల దూరానవున్న మనిషిని గుర్తుపట్టడం కూడా సాధ్యంకావడంలేదు.

కొద్దిసేపటికి గుమ్మంలో పడుకొన్న కుక్క గుర్రుమంది. ఎరిగున్న వాళ్ళెవరో వస్తూండాలి, లేకపోతే అది అంతతో వూరుకోదు. సరయ్య బాటవేపు కళ్ళు గుచ్చిచూసేడు. రెండు నల్లనినీడలు దగ్గిరికి వచ్చేయి.

"పాగ చుడితివే. గల్లంత దూరానికి తెల్లంగ కనిపిస్తుందవు."

సరయ్య వెంటనే పాగా తీసేసేడు. వెంకటయ్య వచ్చి ప్రక్కనే కూర్చున్నాడు. రెండో నీడ తోటలోకి వెళ్ళింది. కాపలా కుక్కలేచి, కొంతదూరం సాగనంపి మళ్ళీ వచ్చి పడుక్కుంది.

"మనోళ్లరాలా ?"

సరయ్య తోటమకాంలో చేరినప్పటినుంచీ వెంకటయ్యా, అతని మిత్రులూ రాత్రులు బోళ్ళపొలంవస్తూ, పోతుండేటందుకు వీలుచిక్కింది.

సంగంలో చేరినందుకు దెబ్బలుతిని, జైళ్ళకు పోయివచ్చిన ఇద్దరు ముగ్గురితో గత సంవత్సరం ప్రారంభమైన ఈ సమావేశాలకు ఇప్పుడు పదిమందిదాకా వస్తున్నారు. వెంకటయ్య చేతిలో పొలంవున్న రోజుల్లో ప్రారంభమైన చదువుల తరగతి, సరయ్య వచ్చేక మళ్ళీ ప్రారంభ మయ్యింది. నలుగురూ చేరి కష్టసుఖాలు చెప్పుకోడంతో ప్రారంభమైన సమావేశాలు "పెద్దల పాఠాలు" నేర్చుకొనేటందుకు మారేయి. క్రమంగా 'ప్రజాశక్తి' తేవడంకూడా ప్రారంభించేరు. అప్పటికే ప్రజాశక్తిమీద నిజాం ప్రభుత్వం నిషేధాజ్ఞలు తెచ్చింది. పత్రిక తేవడం, పంచడం, చదవడం అన్నీ రహస్యంగా జరగవలసిందే. దినం దినం పత్రిక తెలంగాణంలోకి వెళ్ళేటందుకు అవకాశాలు లేక కేవలం తెలంగాణా వార్తల్ని వారం వారం ఒక ప్రత్యేక అనుబంధంగా ప్రజాశక్తి వేస్తూంది. అదికూడా తీసుకు రావడం, పంచడం అంత సులభమేంకాదు. ఈ వారం పత్రిక గ్రామాలకి చేరేసరికి రెండేసి, మూడేసి వారాలు కూడా పట్టేది. ఒక్కొక్కప్పుడు రెండుమూడు వారాల పత్రికలు ఒక్కమాటే కలిసివచ్చేవి. అయినా జనం ఎంతో శ్రద్ధా, ఆప్యాయంతో వాటిని చదివేవారు. చదివించుకొనేవారు. ప్రజాశక్తి వచ్చినప్పుడల్లా బోళ్ళపొలంలో సమావేశాలు రెండు మూడు రోజులు నిండుగ సాగుతుంటాయి.

లంబాడీ పూర్ణయ్య, మేదర మల్లయ్య, చాకలి నారాయుడు, కుమ్మరి గురవయ్య, ఆసాగలి వెంకటాచారి ఒక్కొక్కరే తలోవైపునుంచీ వచ్చేరు. రావలసిన వారంతా వచ్చేసేరనుకొన్నాక సరయ్య రాతిమీదినుంచి లేచి,

ముడ్డిక్రింద వేసుకొన్న తలగుడ్డ దులిపి భుజానవేసుకొని కదిలేడు. కోరడి గుమ్మానికున్న తడకదగ్గరగాలాగి, గొలుసుదూర్చి తాళం పెట్టేడు.

అంతా పాకలోకిచేరి దీపం ముట్టించేరు. వెంకటయ్య నలుగురి ముఖాలూ పరకాయించి చూసేడు.

"గొల్లాయన రాలేదు. ఇంక రాడనుకొంటా."

సరయ్య ప్రశ్న వెంకయ్యకే. బోళ్ళపొలంనుంచి వెళ్ళిపోయేక అతడు గొల్ల భాగయ్య ఇంటిపంచన వుంటున్నాడు. వాళ్ళిద్దరూ స్నేహితులు.

భాగయ్య ప్రసంగం రాంగనే అతడు అసంతృప్తి తెలిపేడు.

భాగయ్య కుటుంబ వ్యవహారాలు ఏమీ బాగాలేవు. దినం ఆలుమగల మధ్య రగడే. మధ్యన తీర్పుచెప్పలేకా, సర్దలేకా వెంకటయ్య ప్రాణం చాలొస్తూంది. ఆవేళ కావేళ ఉదయంనుంచీ ఇద్దరూ కోడిపుంజుల్లా వున్నారు. ఎవరిని పూరుకోమన్నా వూరుకోరు. సాయంకాలం గడీనుంచి వచ్చి అతడు భార్యను గొడ్డును బాదినట్లు బాదేడు. ఆమె కూడువండ కుండా ముసుగుపెట్టింది.

ఆ కథంతా చెప్తూంటే నలుగురూ జాలీపడ్డారు: విచారమూ పొందేరు : అసంతృప్తీ వెలిబుచ్చేరు.

గత వారం పదిరోజులనుంచీ ఆ కుటుంబంలో కలహాలు మరీ రగుల్కొన్నాయి.

పదిరోజుల క్రితం అమీన్ వూళ్ళోకి దొరావచ్చేడు. ఆయనకూ, ఆయనతోవచ్చిన పరివారానికీ కావలసిన పాలూ, వేట జీవాల్నీ ఇవ్వడం గొల్లలవంతు. పోలీసాయన వచ్చేడు. భాగయ్య ఇంట్లోలేడు. పెళ్ళాంవుంది. ఆమె పాలు దూడ కుడుచుకొన్నదని చెప్పింది. నిజానికి ఆ బర్రెదూడ బతికీలేదు. కుడుచుకు పోవనూలేదు.

బర్రె ఇచ్చేపాలే అంతంతగా వున్నాయి. ఓ పూట ఇచ్చి. ఓ పూట ఎగవేపీ ఏడిపిస్తూంది. తనకూ తన పిల్లలకూ మజ్జిగనీళ్ళైనా లేకపోతే మానె. ఆ ఇచ్చినకాసిన్నీ పోలీసువానికి పోసేస్తే వాడికవాళ్ళకేం చెప్తుంది? అందుకోసం అబద్ధం ఆడింది. పోలీసువాడు తిట్టిపోయేడు.

కాని, అదక్కడితో ఆగలేదు. ఓ గంటపోయేక వీధినే వస్తున్న భాగయ్యని పట్టుకొని ఆతడు అమీన్ ముందు పెట్టేడు. పాలు పంపనందుకు ఆయన శిక్ష వినిపించేడు. యమభటుల్లాగ పోలీసులు దానిని వెంటనే అమలు జరిపేసేరు.

భాగయ్య చేతులు రెండూ వెనక్కి విరిచికట్టేసేరు. ఓ వరస కొట్టడం పూర్తిఅయ్యేక నిప్పుల్లో కాల్చిన ఓ గుండ్రాయి ఆతని వీపున పెట్టేరు. విరిచికట్టిన చేతుల పట్టులో రాయి క్రిందపడదు. దులుపుకొని వదలించుకోడానికి సాధ్యంకాదు. సహజంగానే వేడి చల్లారేసరికి వీపూ, చేతులూ కాలి, కమిలి, బొబ్బ లెక్కిపోయేయి.

ఆ బాధతో ఇంటికి ఎల్లాగో చేరుకొన్నాడు. చూరునున్న పొసికొయ్య తీసి పెళ్ళాన్ని బాదడం మొదలెట్టేడు. వెంకటయ్య అడ్డంవచ్చి, మరో ప్రమాదం, మరో ప్రమాదం జరక్కుండా చేసేడు. కాని వాళ్ళ కలహం చల్లారలేదు.

ఆ నా కొడుకులికి ఆపాలేవో తగలేస్తే నా కీ దెబ్బలు తగిలేవా అంటాడు భాగయ్య.

మగడి గాయాలుచూసీ, తనకి తగిలిన దెబ్బల ననుభవించీ రంగమ్మ ఏడ్చింది. కాలిన బొబ్బలకింత పసరుపూసీ, కదుములు కట్టిన కర్రదెబ్బలకు ఆముదంరాసీ పరిచర్యలు చేస్తూనే తన్ను అంతలేసి దెబ్బలు కొట్టినందుకామె మగణ్ణి తిట్టిపోసింది. ఆతని చేతులు పడిపోవాలనీ, ఆతణ్ణి మారెమ్మ వేసుకుపోవాలనీ గొంతెత్తి శపించింది.

ఆమె వాదం కూడా అంత తీసిపారెయ్యవలసిందేం కాదు.

"ఇంట్లోకి కానివ్వడు. ఆ పాలే, ఆ మజ్జిగే అమ్మి కూడు తినాలి. బర్రె ఎండిపోతూంది. వున్న కాసిన్నీ ఆళ్ళు ఎదానెడితే ఏం తినేది ? పాల కోసం ఇల్లా కొడతారనుకున్నానా ?" - అంటుంది.

విన్నవాళ్ళకి ఏంజెప్పాలో తెలియదు. ఆ విషయంలో ఏంచేసివుండాలి సుందో ఈ నాటికీ జనంమధ్య ఏకాభిప్రాయం లేదు.

సాతాని నారయ్య ఈ కష్టాలన్నింటికీ సంగం కారణం అన్నాడు.

"దీనమ్మ ! ఈ ఆడముండలకి నోరిచ్చింది సంగంకాదా ? ఎప్పుడన్నా దొరబు పాలుకావాలంటే ఎవర్తన్నా కాదండంవుందా ?"

లేనిమాట నిజమే. కాని, ఆ వాదాన్ని అందరూ సమర్థించలేదు. చాకలి నారాయుడు భాగయ్య పెళ్ళాం రంగమ్మ వకాల్తా తీసుకున్నాడు.

"ఆమెమాత్రం ఏంచేస్తుంది ? నెలా చాకిరీచేస్తే భాగయ్యకిచ్చేది మూడు బుడ్ల ధాన్యం. దానిమీద ఇద్దరు చిన్నాళ్ళూ, ఇద్దరు పెద్దాళ్ళూ బ్రతకాలి. ఎల్లా ?"....అని ఆతనివాదం.

ఈ వారం పదిరోజులూ వీధులో జరుగుతూవచ్చిన చర్చలే నేడు పొలంలోనూ వచ్చేయి. కాని, బయట వినబడని కొత్తవాదం ఒకటి ఇక్కడ వచ్చింది. ఉభయపక్షాలవాదనలూ విన్నాక నరయ్య చల్లగా అందించేడు.

"మూడుబుడ్లు చాలకపోతే ఎక్కువ ఇమ్మనాలి. తప్ప, తాలూ దొర లిస్తే ఇంటికొచ్చి పెళ్ళాన్ని తన్నడం మగసిరా ?"

నాలుగువేపులనుంచీ మొదట గట్టిగానూ, తరువాత నెమ్మదిగానూ సందేహవాచకాలు వినిపించేయి.

"మనం అడక్కుంటేనేనా మూడుబుడ్లు ఇవ్వడం ?"

చర్చ పాలేర్ల, కూలీల కూలిసమస్యమీదికి మళ్ళింది. కూలాడు, పాలేరు బిగువుగావుంటే ఈ దొరలేం చెయ్యలేరనే అభిప్రాయాన్ని అంతా

ఏకగ్రీవంగా అంగీకరించేరు. ప్రజాశక్తిలో వచ్చిన సూర్యాపేట పాలేర్ల విజయవార్త దానిని సమర్థించింది.

"గొడ్లదగ్గిర పేడతియ్యాలి. వాటిని చూసుకోవాలి. ఈ దొరలూ, దొరసానులూ మంచాలు దిగుతారా?"

సరయ్య తన కొడుకు ప్రాణాల్ని హరించిన సమ్మె పోరాటాన్ని వివరించేడు.

మేము ఇల్లాగే కాట్లాడుకొనేవాళ్ళం. మావోడు కాకినాడ నుంచొచ్చేడు. సంఘం పెట్టుకొని కట్టుకట్టమన్నాడు. అక్కడ పీచుపని చేసేవాళ్ళు ఇల్లాగే సంఘంపెట్టుకొని. పెద్ద సమ్మెచేసేరంట. వింటే బాగనే అనిపించింది. అదేదో పుస్తకంతెచ్చేడు. కాని చీటీలు కోసేడు సంఘం పెట్టేశాం. సమ్మె చేశాం. అన్నిపనులూ బంద్. చివరకి మావూరి పెద్దరైతింట్లో బర్రె చస్తే తియ్యడానికి మాదిగలుకూడా పోలేదు. అప్పుడాయన దిగొచ్చేడు. అంతవరకూ మిగిలిన రైతాంగం మేం అడిగినట్లు కూలివ్వడానికి ఒప్పుకొన్నా ఆయన పట్టుదలమీదనే ఆగేరు".

వెనకటి గాథలన్నీ ఉక్కిరిబిక్కిరి చేసేస్తూంటే సరయ్య ఒక్క నిముషం పూరుకొన్నాడు. కన్నీరు వొత్తుకుంటూ ఆ సమ్మె ఫలితంగా తన యింటికివచ్చిన ఆపదను రెండుమాటల్లో తేల్చేసేడు.

"వారంనాడు కుర్రడు ఏటిగట్టంట వస్తుంటే మునసబంపిన యెదవలు కొట్టేసేరు".

ప్రాణాలుకూడా ఒడ్డవలసిన సంఘం కథుర్లతో వాళ్ళు చాలసేపు గడిపేరు. ఆఖరున లంబాడీ పూర్ణయ్య అంతవరకూ మనస్సులో మెదులుతున్న ప్రశ్నను బయట పడేసేడు.

కమ్యూనిస్టంటే ఎవళ్లు? సంగం వాళ్ళూ వాళ్ళూ ఒక్కటేనా? వేరా? ఇల్లాంటివే ఆతని ప్రశ్నలు.

సరయ్య తన కొడుకు కమ్యూనిస్టనీ. కమ్యూనిస్టులే కూలిసంఘాలు పెట్టారనీ చెప్పేడు. ఆంధ్రమహాసభ. కమ్యూనిస్టుపార్టీ ఒకటి కాదనేంత వరకే అతడెరుగును. రెండూ వేరు. సరే. తేడా ఎక్కడుంది? అతడు చెప్పలేక పోయేడు. కాని. ఒక్క కొత్తసంగతి జతచేర్చేడు.

కమ్యూనిస్టులు కూలాడికి రాజ్యం కావాలంటారు.

ఆంధ్రమహాసభ ఏమంటుందో వాళ్ళెరగరు. కాని, ఎరిగినంతవరకే చర్చలో పడింది.

కూలాడికి రాజ్యం ఏమిటి? అక్షరం గుర్తుతెలియనివాడు రాజ్యం ఏం ఏలుతాడు? ఈ పోలీసాళ్ళూ. పటేళ్ళూ. గిర్దావర్లూ. దొరలూ ఏమౌతారు? వాళ్లు ఒప్పుకుంటారా? ఒప్పుకోకపోతే బతకగలమా?

కూర్చున్నవాళ్ళందరికీ ఇవీ. ఇల్లాంటివీ కొన్నివందల సందేహాలు. వాళ్ళు తలొకవేపునుంచీ ప్రశ్నలు వేస్తూంటే సరయ్య ఉక్కిరి బిక్కిరి యైపోయేడు. ఆత డొక్కదారి చూపించేడు.

"కూలోడిది రాజ్యం అయితే ఈ దొరల్నీ. గిరల్నీ తన్ని తగిలెయ్యడూ?"

అందరూకూడ అది అసంభవం అని తేల్చేసేరు. ఓనమాల పుస్తకం తెచ్చుకోవాలని ఎన్నాళ్ళనుంచో వాళ్ళ ఆశ. కాని ఎవరన్నా చూస్తారేమో. ఎవరన్నా పటేల్ చెవినేస్తే? పోలీసాళ్ళదాకా ఎందుకు? - ఆయనే నర్రుచ్చుకొంటాడు. "మళ్ళీ చదువు మొదలెట్టేరంట్రా" యని మక్కెలిరగ కొట్టిస్తాడు. ఈ భయంతోటే ఇంతవరకు పుస్తకం తెచ్చుకోలేదు. నిరుడు కొట్టినదెబ్బల్లో ఎక్కువభాగం రాత్రిపాఠశాలకు పోయినవాళ్ళకే తగిలేయి. సంగం ఏర్పడ్డాక రాత్రి పాఠశాల మొట్టమొదటి మారుగా వచ్చింది. నడిచిందిమాత్రం ఎన్నాళ్ళు? అంతాచేసి పదిరోజులు. ఆ పదిరోజుల్లోనే చాల మంది అక్షరాలు దిద్దేరు. కొంచరు పేర్ల పుస్తకాలు పట్టేరు.

పోలీసులు వస్తూనే స్కూలు పాకమీదపడి దాన్ని పీకేసేరు. ఉస్తాదుకి రెండేళ్లశిక్ష తగిలించి జైల్లో పెట్టేసేరు. ఇళ్ళన్నీ సోదాచేసి పలకలు చితక్కొట్టి పుస్తకాలు మంటేసేరు. ఆ మంటల్లో పడకుండా ఎక్కడో దాచిపెట్టిన రెండుమూడు పుస్తకాలే ఇప్పుడిక్కడ సాగుతున్న చదువుకు మొదలు.

అల్లాంటప్పుడు వాళ్ళందర్నీ తరిమెయ్యగలమంటే నమ్మేదెల్లాగ? నమ్మకంలేదు. కాని సరయ్య వదలలేదు.

నిరుడు సంగం పెట్టుకొని బేగారీచెయ్యడంలేదంటే ఏంచేసిరేం?"

"పోలీసోళ్ళొచ్చి చెయ్యలేదా?"

కాని. పోలీసులు. మిలిటరీ తుపాకులువస్తేతప్ప దొరలు తమరినేమీ చెయ్యలేక పోయేరనే సంగతిని అంతా గుర్తుచేసుకొన్నారు.

"రెడ్డిసేరీదారు కిష్టయ్య అదేవురికిండు."

పోలీసులువచ్చి కొట్టిపోయేక కూడా గిర్దావరూ, అమీనూ వూళ్ళోకి వచ్చేరు; కాని వెట్టికోసం వెనకటల్లే బాధపెట్టడంలేదు. ఆ సంగతీ గుర్తు వచ్చింది.

"మనం సంగం పెట్టుకున్నాం. వాళ్లు వురికిన్రు. వాళ్ళ సంగం పెద్దది. బందూకు లుండాయి. వచ్చారు. మనం ఏం చెయ్యలేకపోయేం? మన సంగం పెరిగి. మనకీ బదూకులుంటే...."

ఉంటే ఏంచేసివుండేవారో?....ఆలోచించుకొంటూ అందరూ వొక్క నిముషం వూరుకున్నారు. ఆఖరున లంబాడీ పూర్ణయ్య ఒక్క నిట్టూర్పు విడిచేడు.

"ఏం చేయడానికీ మనకేంతెలుసు? రాజ్యంవస్తే ఏం చెయ్యాలో దేహాత్‌వాళ్ళం మనకేం తెలుస్తుంది. మళ్ళీ వాళ్ళనే పిలవాలి."

ఇంతవరకూ చర్చలన్నీ వింటూ, నిశ్శబ్దంగా కూర్చున్న సత్తిరెడ్డి ముందుకు వచ్చేడు.

"రాజ్యం నీదేననుకో: ఏంచేస్తావో చెప్పు."

అనుకోవడం ఎల్లాగ ? పూర్ణయ్యా కొంతసేపు రాజ్యం తనదికాదని మొరాయించేడు. కాని, చివరకి అదో ఆటయి, నలుగురూ తమ తమ అభిప్రాయాల్ని చెప్తూంటే వాళ్ళతో తానూ కలిసేడు.

"అనసూయమ్మ లాక్కున్న నా భూమిని పుచ్చేసుకోకపోయేనా ? ఒక్క గడియ వూరుకుందునా ?"

అనసూయమ్మది అక్కడికో మైలులోవున్న పకీర్రావుపేట. నాలుగైదు వందల ఎకరాల ఆసామీ. పూర్ణయ్య కుటుంబంవాళ్ళు రెండు మూడు తరాలుగా చేసుకొంటున్న భూమి తన పట్టాలోనిదంటూ ఆమె దానిని రెండేళ్ళక్రితం స్వాధీనం చేసుకొంది.

వెంకటయ్య వంతొచ్చింది. ఏడాదిక్రితం తగిలిన దెబ్బలకి వీపు ఇంకా చిమచిమ లాడుతూనే వుందనిపించింది.

"పోలీసోళ్ళనీ, దొరల్నీ పిట్లల్ని వేటాడినట్లు వేటాడుతా."

అతడు మంచి గురికాడు. వడిసెలా, భర్మారూ అతని చేతిలో గురి తప్పవు. అతని అభిప్రాయానికి నలుగురూ సెభాషన్నారు.

అంతా తాముతాము అతిముఖ్యం అనుకొన్న పనులన్నింటినీ ఏకరువు పెట్టేరు. అవేవీ వూరి సరిహద్దుల్నీ, వారి నిత్యావసరాల్నీ మించిపోలేదు.

అవన్నీ వింటూంటే సత్తిరెడ్డికి తాను చదువుకొంటున్న రోజులు గుర్తువచ్చేయి.

కాలేజీలో ఓమారు డిబేట్లు జరిగేయి. "నేనే ముఖ్యమంత్రినైతే" అనేది చర్చనీయాంశం. ఆనాడు ఆ చర్చల్లో పాల్గొన్నవారంతా పెద్ద జాగీర్దార్ల, పుద్యోగస్థుల బిడ్డలు. వాళ్ళ ఆలోచనలు ఇప్పటల్లా చిన్న సమస్యల మీద లేనేలేవు.

ఒకడు రాష్ట్రంఅంతా పరిశ్రమలు పెరిగేటందుకు ప్రోత్సాహం ఇస్తానన్నాడు.

ఒకడు రాష్ట్రప్రభుత్వాదాయం పెంచేటందుకు ఏ యే పన్నులు వెయ్య డమో చెప్పేడు.

మరొకాతడు సర్కార్లలో మాదిరిగా జిల్లా జిల్లాకీ కాలేజీలూ, వూరూరుకీ బళ్లూ పెట్టిస్తానన్నాడు.

ఇంకొకడు వ్యవసాయంలోకి ట్రాక్టర్లూ, యంత్రాలూ తెస్తేతప్ప లాభం లేదన్నాడు.

చివరివిషయం గుర్తురాగానే ఆ కుర్రవాని పేరుకూడా గుర్తువచ్చింది. ఆతని వూరేదో మరిచిపోయేడు. కాని, ఈ ప్రాంతంవాడే. ఏవూరో?

వాళ్లుఅంతా ఈ రోజున ఇక్కడుంటే, ఇవన్నీవింటే ఏమనుకొంటారో అనిపించింది.

చాకలి నారాయడు ఒకటో తరగతి పుస్తకాలు వూరంతా పంచి పెట్టిస్తాడు.

కుమ్మరి గురవయ్య కోరికమాత్రం అందరికీ అసంభవం. పెద్ద ఎత్తు అనిపించింది.

"మనూళ్ళో పురుళ్ళాసుపత్రి పెట్టిస్తా."

ఆతనిభార్య రెండేళ్ళక్రితం ప్రసవించలేక చచ్చిపోయింది. అక్కడికి ఆసుపత్రి ముప్పయి, నలభయి మైళ్ళల్లోవుంది. ఆ వూరికోదారీ డొంకాలేమ. కొంతదూరం బండిమీదా, కొంతదూరం బస్సుమీదా వెళ్ళాలి. కావాలన్నప్పుడు బస్సుకలవదు. కలిసినా చోటుదొరకడం సులభమూకాదు. ఎంతోడబ్బు అవుతుంది. గురవయ్యకు అదేమీ సాధ్యంకాలేమ. ఆస్పత్రి వూళ్ళోనేవుంటే ఆమె బ్రతికేదేనని ఆతడెన్నోమాట్లు అన్నాడు. ఇప్పుడూ అదేమాట.

సత్తిరెడ్డి ప్రశ్నలువేస్తూ సమాధానాలు చెప్పిస్తూ కూలివాడికి రాజ్యం వస్తే ఇవన్నీ జరుగుతాయని వాళ్ళచేత వొప్పించేడు.

అయితే అందరికీ ఒకే సందేహం.

"ఎల్లాగ ?"

"దొరలు రానిస్తారా ?"

"నవాబుసేన ఉన్నాయి."

సత్తిరెడ్డి వోపికగా మళ్ళీ మొదటినుంచీ ప్రారంభించవలసివచ్చింది.

వెట్టి చేయరాదని ఎన్నో ఏళ్ళనుంచి ఎందరో ఎదురు తిరుగుతూండ లేదూ ? ఎదురు తిరిగేరు. అలాగ ఎదురుతిరిగి ఏదోరోజున దెబ్బలుతినని మనిషీ, ఏదోవిధంగా నష్టపడివుండని యిల్లూ ఆవూళ్ళో లేనేలేదని చెప్పాలి. ఏవో పది పెద్దకుటుంబాలవాళ్ళకి ఆ తాకిడి లేకపోయినా అదేం పెద్ద లెక్క కాదు. వాళ్లు అయినా వెట్టిరూపంలో కాకపోతే నజరానాలరూపంలో ఇచ్చు కోలేక ఎదురుతిరిగి మరోవిధంగానేనా నష్టపడ్డవాళ్ళే.

ఒక్క నిరుడుమాత్రం పదిహేను రోజులపాటు ఆ పీడ వదలింది. ఆ తరవాతయినా దొరలూ, అధికార్లూ వెనకటిమాదిరిగా కాకుండా చూసీ చూడనట్లు వూరుకుంటున్నారు - అనిపిస్తూంది.

అయితే ఎందుచేత ?

అందరూ ఏక కంఠంతో తమ అభిప్రాయం తెలిపారు.

"సంగం చేసింది."

కాని సంగం ఏమిటి ? అదేవిధంగా చేసింది ? వివరించడానికై వారు దీర్ఘాతి దీర్ఘంగా ఆలోచించేరు. సూక్ష్మాతి సూక్ష్మంగా సమాధానం ఇచ్చేరు.

సంగం అన్నది ఒక మనిషేంకాదు. వూళ్ళోవాళ్ళంతా దాంట్లో చేరేరు. వాళ్ళు చేరకపూర్వం ఆ వూళ్ళో సంగంలేదు. పొరుగూరాయనొచ్చి సంగం చెప్పి వెళ్ళిపోయేడు. కాని సంగం వెళ్ళిపోలేదు.

పొరుగూరాయన వెట్టి చెయ్యనక్కర్లేదన్నాడు. తామంతా మానేసేరు. ఆయన వెళ్ళిపోయేకనూ చెయ్యలేదు. సంగం పెట్టుకొన్నాం మేం చెయ్యం అనేసేరు.

మిలిటరీ వచ్చింది. పద్దాలుని కాల్చేసింది. అందర్నీ కొట్టారు. కొందర్ని జైళ్ళల్లో వేసేరు. సంగం లేదన్నారు. మళ్ళీతెస్తే చంపేస్తామని కూడా చెప్పేరు. తాము సంగాన్ని తేలేదు. మళ్ళీ వెట్టికి పోనేపోయేరు.

సంగం రానూవచ్చింది. పోనూపోయింది. కాని, మళ్ళీ వస్తుందేమో ననే భయంమాత్రం దొరలకి పోలేదు.

సంగంలో చేరినారన్న తామంతా వూళ్ళోనేవున్నారాయె. సంగం ఎక్కడికి పోయింది ?....

సంగం అన్నది పైనుంచిరాలేదు. మరెక్కడికీ పోనూలేదు. ఈ మాట నందరూ వొప్పుకొన్నారు. కాని, అదేమిటో మాత్రం ఎవరికీ అంతు చిక్కలేదు.

రాత్రి పొద్దుపోయింది. తెల్లారేక అంతా మళ్ళీ పనుల్లోకి వెళ్ళవల సినవాళ్ళే. చర్చ నిలిపేరు. ఈ మాటు మరోరోజున దానిసంగతి తేల్చుకోవా లనుకొన్నారు. ఒక్కొక్కళ్ళే వెళ్ళిపోయేరు. వెంకటయ్య ఒక్కడే వెనక్కి దిగబడ్డాడు.

సత్తిరెడ్డి ముందు అనుకొన్న కార్యక్రమాన్ని మార్చుకొంటున్నా నన్నాడు. మళ్ళా సంగాన్ని ఏర్పాటుచెయ్యడం అవసరమని ఆతడు కొద్ది రోజులుగా ఆలోచిస్తున్నాడు. నేడు జరిగిన చర్చలు ఆలోచనను కార్య రూపంలో పెట్టవలసిన అవసరం వచ్చినట్లు సూచిస్తున్నాయి.

"రేపురాత్రి మళ్ళీ అందర్నీ పిలు. పగలు మరోచోటు చూడగలవా ? ఇక్కడే వుండడం మంచిదా ?"

వెంకటయ్య ఆలోచించేడు. ఆనాడు వచ్చినవారంతా నమ్మకం అయినవాళ్ళే. కాని, ఏ పొరపాటునో నోరుజారితే ? ఆతనిపేరు సత్తిరెడ్డి అని తెలియకపోవచ్చు. కాని రహస్య కార్యకర్త వచ్చేడని నోరుజారేరా ప్రమాదం. కనక ఆయన్ని మరోచోటవుంచడం అవసరం. తాను ఎరిగి వున్న ఇళ్ళన్నీ నెమరువేసుకొన్నాడు.

"నేనిదివరకెన్నడూ చెప్పలేదు. కాని నాకు నమ్మకం వుంది. చాకలి మంగమ్మ యింట్లో వుందురుగాని...."

మంగమ్మ చచ్చిపోయిన పద్దాలుభార్య. ఇప్పుడు వూరిచివర ఎవరి దొడ్డిలోనో పాకవేసుకొని రైతుల యిళ్ళల్లో పనిచేసుకొని బ్రతుకుతూంది.

అత్తవారివాళ్లు కొడుకుపోయేక కోడల్ని ఇంట్లోకి రానివ్వడాని కూడా నిరాకరించేరు. వెంకటయ్యే ఆమెకు సాయంచేస్తూ మంచీచెడ్డా కనుక్కుంటున్నాడు. ఆమె ఆలోచనల ధోరణిని అతడెరుగును. అనేక మార్లు ఇద్దరూ తమ మనస్సులోని కసిని కలబోసి, ప్రతీకారం ఎల్లాగ చెయ్యాలని ఆలోచించేరు.

కనకనే సత్తిరెడ్డిని ఆమెయింట్లో వుంచడం సాధ్యమే ననిపించింది.

సత్తిరెడ్డికూడా చాలా ప్రశ్నలువేసి, ఆమె యింటివద్ద వుండొచ్చు ననుకొన్నాడు.

తెల్లవారేముందు ఇద్దరూ మంగమ్మ గుడిసె తలుపు కొట్టేరు.



# రెండో ప్రకరణం

చిన్న గుడిసె. ఒంటి నిట్రాటిది. దానికి ముందు ఓ వాకిలీ, వెనక ఓ పెరడూ. ఓ ఆవరణా అంటూ ఏమీలేదు. మదుగుగా వున్నచోటల్లా మట్టిపెట్టి మెత్తిన తడివికంప నడులలోపలున్న ఎనిమిది పది చదరపు గజాలమేర మాత్రమే. అక్కడే ఓ మూల మంగమ్మ వొండుకుంటుంది. మరోమూల పడుకుంటుంది. సత్తిరెడ్డికి ఆశ్రయం ఆ ఇల్లు.

ఆ గుడిసెలో పైన సగభాగంలో చిన్న అటక కట్టేరు. దానిమీద ఇన్ని పిడకలు ఒక మూల గూడుపేర్చి వున్నాయి. ఓ చిన్న కుండలో ఇన్ని జొన్నలుపోసి వేరేమూల వున్నాయి. అక్కడే ఎల్లాగో సర్ది ఒక గోనెగుడ్డ పరిచేరు. దానిమీద సత్తిరెడ్డి పడక వేసేడు.

అంతా కటికి చీకటి. బయట ఫెళ్ళున ఎండకాస్తున్నా అంతే. ఏమీ కనబడదు. కాలక్షేపంకోసం తలక్రింది సంచిలోంచి సత్తిరెడ్డి ఓ పుస్తకం తీసేడు. ఆ గుడ్డి వెలుతుర్లోనే చదువుకొనేటందుకు ప్రయత్నించేడు. కాని నడవలేదు. కళ్ళు పీకేయి. మూసి తలక్రింద పెట్టేడు.

నిద్ర పోవాలంటే వెంటనే పట్టనేలేదు. అదీగాక ఎంతసేపని నిద్ర పోతాడు? కళ్ళుతెరుచుకొనే చూస్తూ పడుకున్నాడు. చూడ్డానికి ఏం వుంది? వెల్లకిలాపడుకుని ఓ గజంమూరంలోవున్న కప్పువేపు చూడాలి. లేకపోతే క్రిందివేపు తిరిగి ఇంటివెంట నిశ్శబ్దంగా తిరుగుతూ పనిచేసుకుంటున్న మంగమ్మని చూస్తూండాలి.

మంగమ్మ అందవికారం మనిషికాదు. స్ఫోటకం మచ్చలతో ముఖం వులాడించినట్లున్నా కన్నూ, ముక్కూ తీరైనవి. వయస్సూ, ఆరో

గ్యంతో మిసమిసలాడుడున్న పొంకమైన శరీరం. విరియపూచిన పొన్న చెట్టులావుంది. సర్కిలినస్పెక్టరు రమణారెడ్డి ఆమెకోసం పడే తాపత్రయం అప్పుడర్థం అయిందనిపించింది సత్తిరెడ్డికి.

మొఎట ఆమెపై పే చూస్తూ పడుకోడం భావ్యంలా తోచలేదు. కాని, కప్పులో పరుగెత్తిన ఎలకలమూలంగా కంట్లో నకలలు పడ్డాక ఆతడు ముఖం తిప్పుకోక తప్పిందికాదు. తిప్పినప్పుడు మంగమ్మ కనిపించక మాననూలేదు. ఆమెనుచూస్తూ. ఆమె జీవిత పరిస్థితుల్ని వూహించుకుంటూ కాలం గడిసేడు.

ఆ పగలంతా మంగమ్మ ఒక్కమాట ఆడలేదు. ఏదేదో ఆలోచనలతో కొట్టుమిట్టాడిపోతూ ఇంటివెంట కలలో తిరిగినట్లు తిరుగుతూంది.

ఇన్ని జొన్నలు దంచుకొచ్చింది. సంకటింత వుడకపెట్టింది. మూకుట్లో పెట్టి ఇంతకారంవేసి అటకమీద సత్తిరెడ్డి కందించింది.

ఉతుకుబట్టలు తెచ్చింది. రేవుకెళ్ళింది. వచ్చింది. రేవులో వున్నంత సేపూ ఆమె మనస్సు గుడిసెమీదనేవుంది.

ఆ గుడిసెకి ఓ గుమ్మం. ఓ తలుపూ అంటూలేవు. తడక ఓ తలుపు. తాడో గొళ్లెం. జారుముడి ఓ తాళమూను. ఇంట్లో పోయేవేమీ లేవు. కనక ఆమెకెప్పుడూ దొంగభయంలేదు. వున్నదేమన్నావుంటే దొరలదేభయం వాళ్ళకి ఆ యింట్లో ఆశకొలిపే వస్తువులేం లేవు. ఎక్కడున్నని అక్కడే వుండేవి. ఎవరన్నా ఎరిగివున్న అమ్మలక్కలు తాను లేనప్పుడు వచ్చినా ఓ నిముషం కూర్చునిపోయేవారు.

కాని, ఈ వేళ తనింటి కెవరన్నా వస్తారేమోననే ఆమెప్రాణం కొట్టుకొంటూంది. అటకమీది మనిషి ఆ వచ్చినవాళ్ళ కంటబడితే? ఆయనతో తనకు రంకుకడతారని భయంలేదు. ఆయన ఎవరో. ఎందుకు దాచాలో వెంకటయ్య చెప్పేడు. అయనకు ఏ అపాయం రాకుండా చూడాలన్నాడు. తన యింటికి వచ్చేవాళ్లు ఆయన్ని చూసి గప్‌చిప్‌గా వెళ్ళిపోయి

వాళ్ళతోనూ. వీళ్ళతోనూ చెప్పొచ్చు. లేదా నిర్జనంగావుందని బేవరాకత్తుగా వున్నచోట పరాయిమగాడెవ్వరో దాగుకొని వుండడం చూసి కంగారు పడి కేకలు పెట్టొచ్చు. ఎల్లాగైనా కష్టమే.

త్వర త్వరగా పనిముగించుకొంది. ఇంటికి పరుగెత్తివచ్చింది. దారిలో పుల్లలు ఏరుకొనేందుకు వచ్చిన ముత్తమ్మ పలకరించింది. పొద్దు తిరిగేకగాని ఇంటికి వెళ్ళనిమనిషి అంత పెందరాళే తిరిగిరావడం చూస్తే ఆమె కాశ్చర్యం కలిగింది.

"ఏం వోవిడా! అప్పుడే పనయిపోయిందా?"

ముత్తమ్మ పుల్లలేరుకోవడం మాని బాతాఖానీకి తన వెంటబడుతుందేమోనని మంగమ్మ భయపడింది. తలనొస్తూందని కణతలు నొక్కుకుంది. ఓ గడియ పడుకోవాలంది.

ముత్తమ్మ ఏమీ అనలేదు. వెళ్ళిపోయింది. ఆవిడకాపూట కూర్చునే తీరికలేదు. ఆమెకాకపోతే ఇతర స్నేహితురాళ్ళెవరేనా రావచ్చు. ఏపుల్ల లేరుకొందుకోవచ్చి. ఎండవేళ ఓ అరగడియ కూర్చుని పోతూండడం వాళ్ళకో అలవాటు. వాళ్ళువస్తే ఏంచెయ్యాలో? ఆలోచిస్తూనే ఇంటికి పరుగెత్తింది.

ఇంటికి వచ్చేసరికి ఎక్కడివక్కడే వున్నాయి. ఏవిధమైన గంద్రగోళమూ జరగలేదు. "అమ్మయ్య" అని ఒక్కవూర్పు తీసుకొంది.

"ఎవరూ రాలేదుగందా?" అది మనస్సంతృప్తికి వేసిన ప్రశ్న. ఆమె తడక తోయగానే నిద్రనుంచి మేల్కొన్న సత్తిరెడ్డి ఆ ప్రశ్నలో ఇమిడివున్న ఆదుర్దాను గుర్తించేడు. కాని, ఏమీ అనలేదు. తాను ఊ అనో, ఉహూ అనో ఏకమాటలో సమాధానం ఇచ్చినా, ఆమెతో ఇంట్లోకి అడుగు పెడుతున్నవాళ్లెవరన్నా వింటే? మంగమ్మకూడా తన ప్రశ్నకి సమాధానం కోరలేదు. నిశ్శబ్దంగా గుమ్మంలోనే పీటవేసుకొని కాపలా కూర్చుంది.

తీరుబడిగాకూర్చుంటే మనస్సులో అనేక ఆలోచనలు తుపాను రేపేయి. అవన్నీ సంగంవచ్చేక తన జీవితంలోవచ్చిన కష్టాలమీదనే సాగేయి.

ఒకవేపున సంగం మూలంగానే తన కుటుంబజీవితం ధ్వంసమైపో యిందనిపిస్తూంది. రెండోవేపున ఆసంగాన్నే తన అటకమీదదాచి కాపలా కాస్తూంది. ఎందుకు? తన కష్టాలలో ఈసంగం తన్నాదుకుందా? పైగా పోలీసులు తన మగణ్ణి కాల్చేస్తే ఆ నాయకులంతా పోలీసులనుంచి తప్పిం చుకొని తలదాచుకుంటున్నారు. వీళ్ళు దాంకోడం ఎందుకు? అంతమగసిరి వుంటే తన మగడిలాగేచస్తే చచ్చామని ఎందుకు ఎదుట నిల్చోరు? వాళ్ళని తానెందుకు దాచాలి? ఇల్లాదాగి వీళ్ళుచేస్తున్న ఘనకార్యం ఏమిటి?

అనేక ప్రశ్నలు. అనేక అనుమానాలు, వాటికి ఆమెవద్ద సమాధా నాలూలేవు. వెంకటయ్యమీదున్న అభిమానంకొద్దీ ఆ ప్రశ్నలకి సమాధానం తెలుసుకోలేక పోయింది.

అయినా సంగంయొక్క ప్రత్యక్షమూర్తిలాగ ఎదురుగా సత్తిరెడ్డి కనిపిస్తూంటే ఆ ప్రశ్నలు మనస్సులో పుట్టకుండా వుండడంలేదు.

తన మగడు, సంసారం, మీటింగు, పోలీసులు, మగనిశవం, తనను పోలీసులుపెట్టిన బాధలూ తెరమీది బొమ్మల్లా ఒకదాన్నొకటి తరుము కుంటూ మనస్సులో మెదిలేయి. ఆకష్టాలకూ, బాధలకూ కారణం ఈసత్తి రెడ్డే ననిపించింది. నిజానికి ఆ రోజున మీటింగుచెప్పిందీ సత్తిరెడ్డికాడు. ఈయన్ని ఆ రోజుల్లో తాను చూడనూలేదు. కాని, తన కష్టాలన్నింటికీ మూలం అనిపించిన సంగానికి ఆయన ప్రతినిధి.

తన కుటుంబ జీవితాన్ని మంటబెట్టింది నిజాంప్రభుత్వమూ, జాగీ ర్దార్లూ, దొరలూను. అవిషయం అంతా వెంకటయ్య చెప్పేడు. తన మగణ్ణి వాళ్ళే కాల్చిచంపేరు, తనచేత వెట్టిగా చాకిరీ చేయించుకొన్నారు. అవ మానం చేసేరు.

తాను పెద్దమనిషి కాకపూర్వమే దొరకొడుకు రమణారెడ్డి తన్ను చెరిచేడు. ఆ రమణారెడ్డే సర్కీలయ్యేడు. చిన్నప్పుడు భయానికో. బలానికో తాను లొంగిపోయింది. నోరుకూడా విప్పలేకపోయింది. కాని పెద్దదయ్యాక రమణారెడ్డిని తనమీద చెయ్యి వెయ్యనివ్వలేదు. ఆ కోపంతోనే అతడు తన మగణ్ణి కాల్చిచంపేడని ఆమె అభిప్రాయం.

మగణ్ణి చంపేసేక. తనని పోలీసుస్టేషనులో చాకిరీకి పెట్టేరు. నానాచాకిరీ చేయించారు. సర్కీలు పక్కలోకి వెళ్ళాలన్నారు. నిరాకరిస్తే కుళ్ళపొడిచేరు. కాని తాను లొంగలేదు. చెప్పినచాకిరీ అంతా చేసింది. మీద చెయ్యివెయ్యబోయేరా గుర్రుమంది. పిల్లిలా పీకింది. ఆరడుగుల బలిష్ఠమైన ఆమె విగ్రహంచూసి పోలీసులుకూడా అంతకంటె ఎక్కువ సాహసం చెయ్యలేకపోయేరు.

సర్కీలు వూళ్ళోకి దొరావచ్చినప్పుడల్లా తన్ను రప్పిస్తూనే వున్నాడు. కొడుతూనేవున్నాడు. తన్ను లొంగతీసుకొనే యావలో ఆతని కుటుంబ జీవితంకూడా భగ్నం అయింది. కాని. ఆతడు మానలేదు.

ఒకరోజున దొరావచ్చిన రమణారెడ్డి తెగత్రాగి తనమీద దౌర్జన్యం చేయబోయేడు. తాను లొంగలేదు. కొట్టేడు. తిట్టేడు.

తాగి వొళ్ళుతెలియని స్థితిలో ఆతణ్ణి బంట్రోతులు గఢీలో మేడమీది గదికి తీసుకెడుతున్నారు. ఆతడు గిజాయించుకొని బూతులు తిడుతున్నాడు. ఆ వొళ్ళుతెలియని స్థితిలో ఆతడు జీవితానికి సరిపడా దుఃఖాన్ని మూటకట్టుకొన్నాడు. ఆతని సంసారంలోవచ్చిన కల్లోలానికి మంగమ్మ ప్రతీకారానందాన్ని అనుభవించింది.

రమణారెడ్డిని బంట్రోతులు ఆతని గదిలోకి తీసుకుపోతున్నప్పుడు ఎదుటనున్న గదిగుమ్మంలో భార్య కనబడింది. తాగివున్న రెడ్డి ఆమెలో మంగమ్మనే చూసేడు. బంట్రోతులకు అజ్ఞాపించాడు— "ఆ లంజని జుట్టు పట్టుకు లాక్కురాండిరా."

ఆ మాటలకు బంట్రోతులు హడలిపోయేరు. రమణారెడ్డి భార్యను ఇంక సర్దుబాటుచెయ్యడం ఎవ్వరితరమూ కాలేదు. ఆమె భర్తను గుర్తించ డానికూ్కడా నిరాకరించింది.

అతని కుటుంబజీవితంలో కల్లోలానికి పరోక్షంగా తాను కొంతకారణం అయినందుకు మంగమ్మ సంతోషించింది. కాని, ఆమె మనస్సులోని కసి తీరలేదు. సర్కారునాశనం అయితేతప్ప పీడవదలదని వెంకటయ్య చెప్పేడు. ఆ శుభముహూర్తంకోసం ఆమె ఎదురుచూస్తోంది. ఆసర్కారు కోపానికి గురిఅయిన సంగంమీద అభిమానం పెంచుకొంది.

కాని, సత్తిరెడ్డి ఎదురుగా కనిపిస్తుంటే, చితికిపోయిన తన సంసారమే గుర్తువచ్చింది. సంగంమీది అభిమానం, సర్కారుమీది కసి కన్న బాధలభయం నిరుత్సాహ పరచింది. సాయంకాలం ఆమాట తేల్చేసింది కూడా.

"ఇదివరకటి వాటికే చచ్చిపోతున్నా. కొత్తవి తెచ్చిపెట్టకండి."

ఆ మాటలంటూనే చెట్టంతమనిషి కూలబడి వెక్కివెక్కి ఏడ్చింది.

ఇల్లంతా చీకటిగావుంది. దీపంపెడితే కొత్తమనిషి బయటివాళ్ళకి కనిపించిపోతాడేమోనని కందిలి ముట్టించలేదు. సత్తిరెడ్డి అటకదిగి గుమ్మంలో నిలబడ్డాడు. ఏడుస్తున్నధ్వని తన మనస్సుని కలచివేసింది. ఓదార్చేడు.

"ఎందుకల్లా దుఃఖపడతావు? ఎంతఏడ్చినా పోయినవాడు తిరిగి రాడు. అతనికేం - వీరుడిచావు వచ్చింది."

ప్రొద్దుటినుంచీ. ఇంటివెంట తిరుగుతున్నా. గుమ్మంలో కూర్చున్నా శోకదేవతలాగ కనిపిస్తున్న మంగమ్మని పలకరించి ధైర్యం చెప్పాలనీ, ఓదార్చి దుఃఖంఉపశమింప చేయాలనీ సత్తిరెడ్డి చాలమాట్లు అనుకొన్నాడు. దానికోసం తాను ఏలా మాటలు ప్రారంభించాలో, ఆమె ఏమిసమాధానం ఇస్తే తాను ఏమనాలో ఒకటికి పదిమాట్లు ఒద్దికలు వేసుకొన్నాడు. కాని,

తీరా సమయం వచ్చేసరికి తాననుకొన్నదేదీజరగలేదు. సిగ్గూ,బిడియమూతో చెప్దామనుకొన్నవి చెప్పలేకపోయేడు. ఏడుస్తున్న మంగమ్మని చూసేక కొ॰త్తమాటలేం తోచలేదు. ఏదో అనేసేడు. అన్నాక ఆమాటలు అందరూ అనేవేనని గ్రహించేడు.

మంగమ్మ ఒక్కనిముషం ఏడ్చి సర్దుకొంది.

"పుట్టింటివాళ్ళెవ్వరూ లేరా?"

"అదెప్పుడో బుగ్గి అయిపోయింది."

తల్లీ, తండ్రీ చచ్చిపోయేక తనను దొరలయింట పెంచేరంది. ఆ పెంచేరన్న మాటలో అభిమానస్వరం వినబడలేదు. విపరీతమైన ద్వేషం వినిపించింది. సత్తిరెడ్డి మళ్ళీ ప్రశ్నించేడు.

" పోనీ ఇంకేబంధువులూ లేరూ? ఈ నిప్పుకి దూరంగా మరో వూళ్ళో........"

ఆమె యిచ్చిన సమాధానం సత్తిరెడ్డికే సిగ్గు కలిగింది.

"ఏ వూరెడితే మాత్రం? అక్కడోళ్ళింతకన్న మంచివాళ్ళా?"

నిజమే. ఎక్కడికెడితే మాత్రం? రక్షణేం వుంది? ఉన్నచోటనే వుండి రక్షణకల్పించుకోవాలి గాని........

సత్తిరెడ్డికి సమాధానం తోచలేదు. ఒక్క నిట్టూర్పు విడిచేడు.

అతని కంఠంలోని సానుభూతినీ. మాటలలోని అనునయాన్నీ విన్నాక మంగమ్మ కూడా తన మొదటిధోరణిని మరచిపోయింది. కొత్త కష్టాలు తేవద్దంటూ నిష్ఠురంగా అన్నమాటల్ని మరచిపోమ్మంది.

"ఏదో కష్టంమీదన్నా."

సత్తిరెడ్డి మాట తప్పించేడు. మాటల్లోపెట్టి ఆమె జీవితం ఏలా గడుస్తూందో ఏమిటో యోగక్షేమాలు ఒక్కొక్కటే ప్రశ్నించేడు. ఆమె

తనను పోలీసులు పెట్టిన బాధలూ, పెడుతున్న బాధలూ చెప్తూంటే అతని కెంతో బాధకలిగింది. మనస్సు ద్రవించింది.

కాని, ఏమని ఊరట చెప్పగలదు, ఈ దుర్మార్గాలన్నింటికీ దేశం ప్రతీకారం చేయకమానదన్నమాట కేవలం మనస్సంతృప్తికి మాత్రమే. ప్రతీకారం ఎప్పుడు చేస్తుంది? ఎవరినని చేస్తుంది? ఎల్లా చేస్తుంది? ఇల్లాంటి ప్రశ్నలకి సమాధానా లేమీలేవు. ఆ రోజున పద్దాలుని చంపిన సిపాయిని శిక్షిస్తారా? ఉహుఁ. అమీను, సర్కిలూ, అంతగావస్తే వాళ్లు పారిపోతారు. నిజాము? అసలీ దౌర్జన్యాలన్నిటికీ వెనకబలం నిజాము పరిపాలన. కాని, ఆయనకు బ్రిటిష్ సర్కారు హామీవుంది. ఇప్పుడు నడుస్తున్న రాజకీయాలధోరణి చూస్తే ఇన్నిహత్యలు, హింసలు నడిపిన నిజాము రక్షణకు కాంగ్రెసుచేత హామీ నిప్పిస్తూంది. ఈ ఆటంకాల నధిగమించగల ప్రజావుద్యమం తలఎత్తి, పీడకుల్నీ, హంతకుల్నీ బోనెక్కించే రోజుకి ఈ ఉస్మాన్ బ్రతికివుంటాడా?

కాని మంగమ్మ క్షుభిత మనస్సుకి ఈ ప్రశ్నలేం తోచలేదు. ప్రతీకారం జరుగుతుందనే దొక్కటే ఆమె కనంత సంతృప్తిని కలిగించింది.



# మూ డో ప్ర క ర ణ ం

భార్య సుమిత్రతో కలిసి తోటలో అడుగుపెడుతున్న రాజిరెడ్డిని చూసేసరికి రంగయ్య ఎంతో బిడియపడ్డాడు. ఆ దంపతులు వూళ్ళోకి వచ్చినప్పుడు తప్పకుండా తోటవైపు షికారురావడం, చెట్ల నీడల్లోనూ, మోటబోదె నీళ్ళతోనూ ఆటలాడుకోవడం, చీకటి పడేవరకూ కూర్చుని కబుర్లు చెప్పుకొని ఇంటికి పోవడం ఓ అలవాటే. ఎంతపెద్దరెడ్డి అల్లుడూ, కూతురూ అయినా దంపతులిద్దరూ పట్టపగలు కబుర్లు చెప్పుకోవడం, నవ్వుతూ తుళ్ళుతూ వీధివెంటా, పొలాలమీదా షికార్లుపోవడం వూళ్ళో వాళ్ళందరికీ వింతగానే వుండేది. ఎదురుగా చూడనట్లు నటించినా, చాటుగా బుగ్గలు నొక్కుకొనేవారు. కొత్తజంతువుల్ని చూచినట్లు విరగబడి చూసేవారు. అవన్నీ గమనిస్తూన్నా ఎరగనట్లే నటించేవారు ఆ దంపతులు. వూళ్ళోవున్న రోజుల్లో వీలు చిక్కినప్పుడల్లా వచ్చి, బోళ్ళపొలంలో ఒక్క గంటయినా గడిపేవారు. అందుచేత ఆ రోజున వారు రావడంలో ప్రత్యేకత ఏమీ లేకపోయినా రంగయ్య వారిని మామూలుగా ఆహ్వానించలేకపోయేడు.

ఈ మధ్య ఇంట్లో వచ్చిన గంద్రగోళాల అనంతరం వారక్కడికి రావడం అదే ప్రథమం. ఆ గొడవలు వాళ్ళచెవిని పడకుండా వుంటాయా? మామూలుగా వచ్చినప్పుడల్లా కనిపిస్తూ వచ్చిన ఇద్దరూ నేడు లేకపోవడాన్ని గమనించలేరా? తప్పకుండా చూస్తారు; ఏమీ ఎరగనట్లు సత్తెమ్మ కనపడదేం?- వెంకటయ్య ఏడీ? అని వాళ్ళిద్దరూ అడిగితే నేనేంచెప్పాలి? వాళ్ళిద్దరూ పెళ్ళి చేసుకొంటామన్నారనీ, తమకిష్టంలేకపోయిందనీ, వారిని దూరం చేయడానికి ఎంతో బ్రహ్మప్రళయం చెయ్యవలసివచ్చిందనీ తాను

చెప్పగలడా? అందులోనూ రాజిరెడ్డితో. ఇద్దరూ చాలా సన్నిహితమిత్రులు. సంఘ సంస్కరణలు, సమాజాభివృద్ధి మొదలయిన అనేక సమస్యలమీద ఇద్దరూ ఇదివరకు, ఎంతో చర్చించినవాళ్ళే. తన అభిప్రాయాల్ని ఎరిగిన రాజిరెడ్డి ముందర తానుచేసినపనికి సిగ్గుపడవలసివస్తూందనిపించి రంగయ్య ఎంతో చిరాకుపడుతున్నాడు. ఏం ప్రశ్నలు వస్తాయోనని ముళ్ళమీదున్నట్లున్నాడు.

చివరకు ఏదో సంచుచూచుకొని రాజిరెడ్డి అడగనే అడిగేడు. అయితే ఆ ప్రశ్న అంతవరకు రంగయ్య వూహించుకొంటున్న విధంగాలేదు.

"నే నన్నీ విన్నాను. నువ్వు చేసిందేం మంచిపనికాదు."

విన్నదేమిటో, మంచిపని కానిదేమిటో రాజిరెడ్డి చెప్పకపోయినా అర్థం అయింది. అక్క అవస్థ చూసేక తానుచేసిన గొడవ మంచికా, చెడ్డకాయనే అనుమానం రంగయ్యకే ఎన్నోమాట్లు కలిగించింది. కాని, ఎదటి మనిషి అది మంచిదికాదనేసరికి అభిమానంవేసింది, కోపంవచ్చింది. తన పనిని సమర్థించుకోవాలనే అహంకారమూ కలిగించి.

"మా బతుక్కి తగునుకదాయనా? ఇదే నీ యింట్లో కథయితే, నాకు చేసిన హితబోధ నీకు గుర్తుండేదేనా?"

ఎంత స్నేహితుడైనా ఇదే నీ యింట్లో జరిగితే-ననడం రాజిరెడ్డికి కష్టమే అనిపించింది. ఎందుకీ ప్రసంగం తెచ్చేనా అనుకొన్నాడు. చింత పడ్డాడు. కాని, సమాధానం ఇవ్వకుండా కోపగించుకోడం మంచిదికాదనుకొన్నాడు.

"కోపం వద్దురంగా! మనకున్న చనువునుపట్టీ, గతంలో ఇల్లాంటి సమస్యల్ని గురించి మనం తరుచుగా సాగిస్తూవచ్చిన చర్చల దృష్ట్యానూ అన్నాను. కాని...."

ఒకమారు మిత్రుణ్ణి నొప్పించేక రంగయ్య అరరే అనుకొన్నాడు. కాని రాజిరెడ్డి తమ గత చర్చలకథ జ్ఞాపకం చేసేక తన మాటను సర్దు

కొన్నేటంమకు ప్రయత్నించడం కూడా అభిమానంగా తోచింది. మళ్ళీ అదేమాట రెట్టించేడు.

"కోపం ఎందుకనుకొంటావు? ఒక విషయం - మంచిచెడ్డల్ని ఆలోచించేటప్పుడు ఎవరికివారు దానిని తమకు వర్తింపచేసుకొని ఆలోచన ప్రారంభిస్తే సమస్య సులువుగా పరిష్కారం అవుతుంది."

ఈ ఘట్టంలో మనమేవుంటే ఏంచేసివుండేవాళ్ళం అనేది ఆలోచించడం అవసరం. దానితో అనేక సమస్యలకి పరిష్కారం సులభంగా దొరుకుతుంది. అదేం కొత్తసిద్ధాంతమూ కాదు.

దానినే మరోదృక్కోణంలోంచి ఆంధ్ర భారతకారుడు వివరిస్తూ పరమధర్మ పథాలలోకెల్లా పరమోత్కృష్టమన్నాడు.

కాని అదే పరాయణం కాదు. మనుష్యుడి మనస్సు. ఆలోచనలు ఆతడు పెరిగిన వాతావరణాన్నే చాలవరకు ప్రతిబింబిస్తుంటాయి. ఆతడు చదివిన చదువూ, ఆతని విజ్ఞానమూ, అలవాట్లూ, ఆచారాలూ, ఆలోచనల్ని ముందుకి గెంటుతూ, వెనక్కిలాగుతూ మహా సంఘర్షణను కల్పిస్తూంటాయి.

రాజిరెడ్డి ఓర్పుతో మానవుని ఆలోచనలమీద ఏవేవి ఎల్లాంటి ప్రభావం కలిగిస్తూంటాయో చెప్పుకువచ్చేడు.

"ఏ విషయంమీదయినా మనకుతోచే మంచిచెడ్డ అభిప్రాయాలు సర్వస్వతంత్రంగా వుండవు."

ఆ తాత్విక విశ్లేషణకు రంగయ్య సమాధానం ఏమీ ఇవ్వలేదు. ఆ చర్చకూడా పాతదే. ఆ అభిప్రాయాల్ని గతంలో తానూ సమర్థించేడు. కాని, పైకి ఒప్పుకోలేకపోయేడు.

ఆ నాటి సాయంకాలం ఆ మిత్రులు ముభావంగానే విడిపోయేరు.

రాజిరెడ్డి ఇంటికి చేరుకున్నాక కూడా తోటలో వచ్చిన చర్చలను మరచిపోలేక పోయేడు.

పరధ్యానంగా, ఏదో కలలోవున్నట్లున్న భర్తను ప్రకృతిలోకి తేవడానికై సుమిత్ర అనేక ప్రయత్నాలు చేసింది. కాని, అతడిచ్చిన సమాధానాన్నిపట్టి తన ప్రయత్నాలు సఫలమైనట్టా, విఫలమైనట్లా, అనేది ఆమెకే అర్థంకాలేదు.

రాజిరెడ్డి ఒక్క నిట్టూర్పు విడిచేడు, కుర్చీ చేతిమీద అనుకొని కూర్చుని, ఆమె యాతని భుజంమీద చెయ్యివేసి ఏదో ప్రశ్నిస్తాంది, ఆ చేతిని తనచేతిలోకి తీసుకుని, బుగ్గనానించి నొక్కుతూ అతడు మరల ఏదో ఆలోచనలో పడ్డాడు.

"మనుష్యుడు బ్రతికేది ప్రేమించడానికా? బాధించడానికా? ఒకళ్ళ సుఖంచూసి సంతోషించ డెందుకు? ఆ సుఖం తాను ప్రతిష్ఠగా భావించిన దేనికో నష్టకరం అని ఎందుకనుకోవాలి? ఆ సుఖాన్ని నాశనంచేసినా ప్రతిష్ఠ నిలబడేదీలేదు; దానిలో ఆనందమూలేదు. కాని, ఆతని ఆలోచనలు అటే నడుస్తాయి. బహూశా దుఃఖం, బాధ మనుష్యుణ్ణి ఆకర్షిస్తాయోఏమో?"



# నాలుగో ప్రకరణం

రంగయ్య ముసుగు తియ్యకుండానే భార్యను పిలిచేడు.

"సీతు"

భార్య పేరు సీతుకాదు. కాని, తనకు వెంటనే కావలసిన పదార్థం భార్యకి పర్యాయపదంగా మారిపోయింది. సరిగ్గా అదేపద్ధతి సూరమ్మకు అయిష్టం. తనకు తనపేరేతప్ప మరొకటిలేదని ఆమె దృఢాభిప్రాయం. 'ఉరపు'లు, 'అనే'లు ఆమెకు అయిష్టం.

భార్యను పేరుపెట్టి పిలవడం ఆతనికి అలవాటే కాని తానున్న పల్లెటూళ్ళో ఆ అలవాటులేదు. పైగా వింతజంతువును చూసినట్లు విరగబడి చూస్తారు. నవ్వుతారు. యద్దేవాచేస్తారు. అందుచేతనే వూళ్ళోకి వచ్చినప్పు డల్లా ఆతడామె పేరు మరచిపోయి వూరుకుంటాడు.

సూరమ్మ అతని భయాన్నీ, సిగ్గునూ గణనలోకి తీసుకోదు. తనకి తల్లిదండ్రులు పెట్టిన పేరొకటున్నదనీ, ఒసే, ఏమేలు దానికి పర్యాయ పదాలు కావనీ ఒకటికి పదిమాట్లు చెప్పింది. అతడూ దాన్ని అంగీక రిస్తాడు. కాని వూళ్ళోవాళ్ళ మాటేమిటి? వాళ్ల అసంగతిని వొప్పుకోరుగా? దొర అల్లుడు రాజిరెడ్డి తనభార్యను ఆమె పుట్టింట్లో అందరూ పిలిచేలాగ 'చిట్టీ' అంటాడని బుగ్గలు నొక్కుకొని, కనుబొమ్మలెగరేసే అమ్మల క్కలు తన్ను బ్రతకనిస్తారా? మొహంమీదే తాటాకులు కట్టెయ్యరూ?

కాని, సూరమ్మ వొప్పుకోదు. వాళ్ళ అక్కను మగడు పేరుపెట్టే పిలుస్తాడు. మొదట తమ యింట్లోవాళ్ళందరికీ అది విడ్డూరంగానే అనిపిం చింది. తానూ అప్పట్లో అక్కను వేళాకోళం పట్టించినదే. కాని, తనదాకా

వచ్చేసరికి ఆలాగ పిలవడమే బాగుందనిపించింది. తనవాళ్ళంతా మొహ మొహాలు చూసుకొంటూంటే తన అక్కకూడా మొదట్లో మగడితో తన్ను పేరుపెట్టి పిలవద్దని బ్రతిమలాడుకొన్నదట. కాని, ఆతనితో ఓ ఏడాది పాటు ఏలూరులో కాపురంవుండివచ్చేక తన అభిప్రాయాన్ని మార్చుకొంది.

"ఆవేపున అది అలవాటేనమ్మా! ఎవరో ముసిలాళ్ళు, చాద స్తులూతప్ప చిన్నకారంతా పెళ్ళాల్ని పేరెట్టే పిలుస్తున్నారు. ఏమోనమ్మా, అదేబాగుంది నామట్టుకి. ఊళ్ళోవాళ్ళందర్నీ పేరెట్టి పిలవడానికి తప్పులేదు. కాని. భార్యని ఏదో దాసీదాన్ని పిలిచినట్లు 'ఒసే, ఉసే' ఏమిటి? అస య్యంగా!"

పెద్దకూతురు అభిప్రాయాన్ని తల్లి అంగీకరించింది. కాని, తాము ఇల్లాంటిదెప్పుడూ చూడలేదని చెప్పడంమాత్రం మానలేదు.

తర్వాత తన అన్నకు పెళ్ళయింది. అక్క మగణ్ణిచూసి, ఆతడూ ఆపద్ధతినే అవలంబించేడు. సూరమ్మ మొదటిరోజుల్లో తనను మగడు ముద్దుగా 'సూర్యం' అని పిలిచినప్పుడు ఎవరినా అన్నట్లు వినగబడి చూసినా తన్నే అని గ్రహించేక కొండెక్కింది. తన అక్కమగడు బెజ వాడ వైపువాడు. అక్కడివాళ్ళు కొన్ని అలవాట్లు చేసుకొన్నారు. అదితనకు నచ్చుతేమాత్రం? మగడికి కొత్తేకాదూ? అక్కడ అలవాట్లప్రకారం, తన అక్క అన్నట్లు ఏదాసీదాన్నో పిలిచినట్లు 'ఒసే, ఉసే' అంటాడేమోనని భయపడింది. కాని, రంగయ్య అత్తవారింటి అలవాట్లు చూసేడు. అనుక రించేడు.

అయినా తన వూళ్ళోని అలవాట్లు కనబడని చట్టాలు. అవి మన స్సుని పట్టిపోయివున్నాయి. నాలుకకూడా ఆ అడ్డుగోడల్ని దాటలేక పోయింది.

స్వగ్రామంలో అయినాసరే మగనిచేత పేరునే పిలిపించుకోవాలని ఆమె అభిప్రాయం.

అందుచేత రంగయ్య నీళ్ళని పిలిచినప్పుడు ప్రక్కనున్న వసారాలో ఒక చెంబులోంచి మరొకచెంబులోకి వురుకుతూ నీళ్లు తామక్కడే వున్నామని తెలియపరిచేయి.

ఆతడు ఆలకించేడు, తనపిలుపున కది సమాధానం. నవ్వుకున్నాడు. ఈమారు పేరు మార్చేడు.

"చెంబు!"

వెంటనే వసారాలో చెంబు ఖంగున గొంతెత్తి పలికింది. తాను చెంబును పిలిచేడు. దానికి స్వయంగా పలికేశక్తిలేదు. కనక సూరమ్మ ఒక పుల్లసహాయంతో దానిని పలికించింది.

రంగయ్య దుప్పటి తన్నేసిలేచేడు. భార్యను ఆటపట్టించాలనే మహోత్సాహంతో తలుపుతెరిచేడు. స్లూయిసు లెత్తినప్పుడు వురకలెత్తివస్తున్న నీటిప్రవాహంలాగ సూర్యకిరణాలు గదిలోకి తరుముకొచ్చేయి. బాగా ఎండ వచ్చేసింది. హఠాత్తుగా వెలుతురు చూడలేక కళ్లుమూసుకొని నిలబడ్డాడు. అంత పొద్దెక్కినవిషయం తాను గమనించనేలేదే అనుకొన్నాడు. అప్పటి మట్టుకి భార్యను అల్లరిపట్టించాలనే సంకల్పాన్ని పక్కనపెట్టి గోడమీదున్న పుల్ల అందుకున్నాడు. తానింకా మొగమేనా కడగలేదనే విషయాన్ని తల్లి గాని, అక్కగాని చూస్తున్నారేమోననే సంకోచంతో అటూ ఇటూ తొంగి చూసేడు. ఆతని భయాన్ని చూసి సూరమ్మ నవ్వుకుంది. చూపుడు వేలాడిస్తూ, కనుబొమ్మలెగరేసి బెదిరించింది.

పట్నవాసం చదువుతో రంగయ్యకు అక్కడి అలవాట్లుకొన్ని పట్టుబడ్డాయి. తనవూళ్ళోనైతే సూర్యుడు పొడిచేసరికి మంచంమీద వుండడానికి వీల్లేదు. అసలు వూళ్ళల్లో ఆవేళప్పటిదాకా నిద్రపోడానికి వీలేవుండదు, గొరకొయ్యలు అంతదూరానికి ఎక్కరాగానే కొందరూ, తొలికోడి కూయగానే కొందరూ, చుక్కపొడవగానే కొందరూ వాళ్ళవాళ్ళ పొలం పనులు స్వభావాన్నిపట్టి లేచేస్తారు. వెళ్ళిపోతారు.

కాలేజీకి వెళ్ళకపూర్వం రంగయ్యవీ అవే అలవాట్లు. కాని, కొత్త పరిసరాలలోకి వెళ్ళేక వాటిఅవసరం కనపడ్డంలేదు. మొదట అలవాటుకొద్దీ కొద్దిరోజులు తెల్లవారగట్లనే లేచినా తర్వాత మానుకొన్నాడు. ఓరాత్రివేళ లేచిచేసేదేమిటి? ఇంటిదగ్గిరైతే కంచెలకెళ్ళాలి. కాడిగట్టేముందుగా ఎడ్లని మేపాలి. ఇక్కడాపని వుండదు. ఇంక చదువుకోవాలి. కొంచెం తెలివిగల వాళ్ళందరికీమల్లేనే. ఆతడికి పుస్తకాలంటే పెద్ద శ్రద్ధలేదు. పరీక్షల్లో తప్ప కుండా మార్కులు తెచ్చుకోదానికి తగుపాటి చదువు చాలుననేది ఆతని అభిప్రాయం. అలాగే చదివేవాడు. మిగిలిన కాలాన్ని నిజాము పరిపాలనలో హిందువులకు జరుగుతున్న అన్యాయాల్నిగురించీ, మాతృభాష నణచివేయడానికై చేస్తున్న అన్యాయాల్నిగురించీ చర్చలకు వినియోగిం చేడు. హిందువుల మత రక్షణకోసం అర్యసమాజంచేస్తున్న కార్యకలా పాల్ని అభినందించాడు. ఆంధ్రభాష అభివృద్ధికోసం జరిగే ప్రయత్నాలకు తోడ్పడేవాడు. కృష్ణదేవరాయాంధ్ర భాషానిలయం కాలేజీ లేనిరోజుల్లో ఆతనికి ఒకస్థావరం. నిజాంరాష్ట్ర ఆంధ్రసారస్వత పరిషత్తు ఏర్పడ్డాక వారి సభలకు తప్పనిసరిహాజరు. విద్యార్థుల్లో విప్లవవాదిగా సి. ఐ. డీ. ల లిస్టుల కెక్కినాడనే చాలమంది అభిప్రాయం.

చదువు. ఇతర వ్యాపకాలవిషయంలో ఆతనికున్న అభిప్రాయాల మాట ఏలావున్నా ఇంటిదగ్గర వున్నన్నాళ్ళు పనున్నా లేకపోయినా తెల్ల వారకుండా లేవవలసిందే. అక్కలేస్తుంది. ఇంటెడుపనీ చేసుకొని బావి కడకు బయలుదేరుతుంది.....తల్లీ లేస్తుంది. పెద్దదయిపోయి ఏపనీ చెయ్య గలస్థితిలో లేకపోయినా కనీసం తనవయస్సువాళ్ళతో గప్పాలకైనా సిద్ధంగా వుంటుంది. వెళ్ళేవాళ్ళు తమదారిన తాముపోతే బాగుండును కాని, పడుకో కుండా తనని నిద్రలేపుతారు. తెల్లవారినాక నిద్రపోవడం దరిద్రచిహ్నమని వాళ్ళ అభిప్రాయం. నమ్మకమూను. ఎప్పుడోవచ్చి నాలుగురోజులుండి పొయ్యేవాడిని పొలంతోలడం ఎందుకులేయని వదిలేస్తారు. కాని, నిద్రలేచే విషయంలో వాళ్ళకి మహాపట్టుదల.

కానీ, ఈనెలా, రెండునెలల గంద్రగోళాలు ఆతని అలవాట్లకి కొంత స్వాతంత్ర్యాన్నిచ్చేయి. ఆతడు వానిని పూర్తిగా వుపయోగించుకొంటు న్నాడు. గదమాయించే అక్కగారు ఇప్పుడింట్లో ఏది ఏమయిపోయినా మాట్లాడ్డంలేదు. తల్లివద్ద ఆతనికెప్పుడూ భయంలేదు. అందుచేత మానవ స్వాతంత్ర్యాల పట్టికలో నిద్రాస్వాతంత్రాన్నికూడా జమకట్టి, దానిని అమలు జరిపేస్తున్నాడు. అయినా దానినింకా సాగలాగేధైర్యం కలగలేదు. అందు చేత భార్యను ఆటపట్టించే సంకల్పాన్ని తాత్కాలికంగా వాయిదావేసి తక్షణ కర్తవ్యం ఎత్తుకొన్నాడు.

ఇంకా పుల్లనమలడం పూర్తికాకుండానే వీధిలో పిలుపు వినబడింది. ఎవరా యని తేల్చుకొనేలోపునే సేతుసిందీ గోవిందు నిలువు పొడవు బాణాకర్రతో గుమ్మంలో హాజరయ్యాడు.

చిన్ననాటి మిత్రులిద్దరూ కుశలప్రశ్నాదికం పూర్తిచేశాక గోవిందు తానువచ్చిన పనిచెప్పేడు.

"దొర యాదు చేస్తున్నాడు."

గోవిందు తొందరపెట్టకుండేటందుకై ఆతడికింత 'చా' ఇచ్చినా, అది తాగేసి చొక్కా వేసుక్కొనేలోపునే పదిమాట్లు హెచ్చరించేడు.

"జరా జల్దీరా."

రంగయ్య ఆదరాబాదరా చొక్కా వేసుకొంటూంటే గోవిందు దొరల మర్యాదలు గుర్తుచేసేడు.

"జరాపనికి చొక్కాఎందుకు. పై తుండుచాలదా ?

టీ త్రాగిన విశ్వాసాన్నీ, చిన్ననాటి స్నేహాన్నీ కనబరుస్తూ గోవిందు నెమ్మదిగానే దొరవద్దకు వెళ్ళేటప్పుడు అవలంబించవలసిన మర్యాదల్ని గుర్తుచేసేడు. రైతులకుచెల్లే నిబంధనలు చదువుకొన్నవాళ్లు పాటించనక్క ర్లేదని ఆతడెరుగును. కాని, రంగయ్య ఎంత చదువుకున్నా వూళ్ళోరైతుల బిడ్డేకా ?

పల్లెటూళ్ళలో దొరలది మకుటంలేని రాజరికం. చట్టంఎరగని శాసనాధికారమూను. ఒక్క కులపెద్దరికంవలన లభించిన పెత్తనంమాత్రమే కాదు. డబ్బు, భూమి, కులం, దర్పం, ధాష్టీకం-వీటన్నింటి మిశ్రణం ఆ దొరతనం. ఒకడు పెద్దఇల్లు కట్టుకోడాన్ని అది సహించదు. చొక్కా వేసుకోడానికి ఒప్పుకోదు. ఎండ మాడుస్తున్నా, హోరున వర్షంకురుస్తున్నా వారి ఎదటనేకాదు, వారి ఇంటిముందుకూడా గొడుగు చంకన పెట్టవలసిందే. కాలిజోడు చేతికి తీసుకోవలసిందే. చుట్ట దాచవలసిందే. తల దింపాలిసిందే. ప్రతీమాటలో తన బానిసతనాన్నీ, దొరల పెద్దరికాన్నీ, గుర్తుచేసుకొంటూ, గుర్తుచేస్తూ మాట్లాడవలసిందే. అదంతా చట్టాల కెక్కని శాసనం.

రంగయ్య చిన్నప్పుడా వాతావరణంలో పెరిగినవాడే. చిన్నచిన్న తప్పిదాలకు కఠోరశిక్ష ననుభవించి ఆ అలిఖిత ధర్మశాస్త్రాన్ని ఆకళింపు చేసుకొన్నవాడే.

ఎప్పుడో చిన్ననాటిమాట. ఓ రోజున రంగయ్య వాకిట్లో మంచం మీద పడుకుని వున్నాడు. ఆదారిన ఆసమయంలో దొరవెళ్ళేడు. రంగయ్య లేవలేదు. దొరకు దండంపెట్టలేదు. ఆ రెండుపనులూ అత్యవసరాలని అతనికి తెలియదు. కాని, తండ్రిదండన తప్పలేదు. ఆనాడు పెయ్యకన్నెతాడుతో తగిలించిన దెబ్బల్ని ఆతడు జీవితంలో మరిచిపోలేదు.

తండ్రికొట్టిన దెబ్బలవలన ఆతనికి దొరలమీద భయభక్తులు కలిగించడానికి బదులు ద్వేషం, క్రోధం కలిగించేయి. ఆక్రోధంతో చిన్ననాడు స్నేహితులవద్ద చాటుమాటున దొరల్ని నిందించి వాళ్ళమెప్పు, గౌరవం పొందేవాడు. పెద్దవాడయి చదువుకొన్నాక ఆ పెద్దకుటుంబాలవారే తన్ను గౌరవిస్తూంటే ఆద్వేషం మరిచిపోయేడు. ఇప్పుడాకోపం దొరలంటే భయభక్తులుచూపే అమాయికులమీదికి మళ్ళింది. "నీబాంచని." "నీ కాల్మొక్కుతా" నంటూ బానిసబుద్ధిచూపించక, నిలబడితే దొరలేంచేస్తారేం" యని

ఆతనివాదం. కాని. వాళ్ళ కాతనిమాటల్లో విశ్వాసంలేదు. ఆత్మవిశ్వాసమూ లేదు. ఆదిచూస్తే రంగయ్యకు కోపం. అందుచేతనే నేడుకూడా గోవిందు మీద చర్రుమన్నాడు చొక్కా ఎందుకంటే?

ఎందుకు వేసుకోకూడదు? వాళ్ళ గొప్పేమిటి? తనకులం తనకు గొప్ప. తనంతవాడుతాను. డబ్బుకా? తాము ఎవర్నీ అడుక్కుతినడం లేదు. తాను దొరలకేం బాకీలేడు. కొద్దో గొప్పో చదువుకొన్నాడు. ఇంకెందులో వాళ్ళగొప్ప? తానువంగి సలాములెందుకు పెట్టాలి?

ఆ వాదనలో చిన్ననాటి రంగయ్యనే గోవిందు కళ్ళచూసేడు. ఏమీ అనలేదు. సంసారంలోపడి ఆ మూడురూపాయల వుద్యోగంలోచేరేక అతడు రంగయ్యమాటల్లో చిన్ననాడు పొందిన ఆనందాన్ని పొందలేక పోయేడు. ఊరుకున్నాడు.

కాని, రంగయ్య వూరుకోలేదు. మైలు, మైలున్నర దూరంలోవున్న దొరయింటికి చేరేలోపున ఆత్మగౌరవంయొక్క ఔన్నత్యాన్నీ, దానికోసం నిలబడవలసిన ఆవశ్యకతనీ చెప్పడం ప్రారంభించేడు. నిరుడు తాను సర్కార్లలో చూసిన ఒక ఘటననుచెప్పి, గొర్రెల్లాకాకుండా, సాభిమానంతో బ్రతకవలసిన అవసరాన్ని వివరించేడు.

రంగయ్య, ఆతని మిత్రులు కొందరూ వినోదయాత్రకి సర్కార్ల లోకి వెళ్ళేరు. తూర్పు గోదావరిజిల్లా ర్యాలిలోని జగన్మోహినీ విగ్రహం చూడవలసినదని ఎవరో చెప్పేరు. రాజమండ్రివద్ద స్టీమరులో గోదావరి దాటి డెల్టాలో ప్రవేశించారు. బస్ ఎక్కేరు. అప్పుడా ప్రయాణంలో జరిగిన సంఘటన అది.

బస్సు ఓ వూరుదగ్గర ఆగింది. ఓ పెద్దింటి ముత్తైదువ ఎక్కాలి. ఆమె బండిలోకి ఎక్కేముందు తాను కూర్చోవలసిన సీటులోని జనం ఎవరాయని వాకబు ప్రారంభించింది. కండక్టరు మర్యాదగానే చెప్పేడు.

"బస్సులో అందరూ ఎక్కాలిసిందేనమ్మా! ఇంకోళ్ళు వుండకూడదనుకొనేవాళ్లుస్వంతానికి కారు పెట్టుకోడం మంచిది....."

"ఇంక స్వంతానికి కారు పెట్టుకోలేక, మరొకరితో కలిసి కూర్చోలేనివారు ప్రయాణాలు మానుకోడం మంచిది"- అని చెప్పేడు.

కాని. ముసలమ్మ తృప్తిపడలేదు. వచ్చే డబ్బు వదులుకోవడం బస్సువాని కిష్టంలేదు. అందుచేత కండక్టరు ఒక రాజీదారి చూపించేడు. ఆ సీటులోవున్న హరిజన స్త్రీని మరోసీటులోకి జరగమన్నాడు. కాని, ఆమె నిరాకరించింది. కావలిస్తే అవిడ్నే అక్కడ కూర్చోపెట్టమంది."

ఒక క్రింది జాతి ఆడమనిషి చూపించిన ధైర్యగాథ గోవిందును ఆకర్షించింది. తర్వాతేమయిందని ప్రశ్నించేడు.

తాను చెప్పినఘటన పూర్తిఫలితం ఆతని మనస్సుకి పట్టించాలనే ఆలోచనతో అబద్ధం ఆడేడు రంగయ్య.

"ముసలమ్మ తమరందరి కుల గోత్రాలూ ఎందుకడగాలనే కోపంతో బస్సులో వాళ్ళంతా ఆ హరిజన అమ్మాయిమాట సబబుగా వుందన్నారు. కండక్టరు నోరుమూసుకొన్నాడు. ఆ ముసలమ్మ ఆ హరిజన అమ్మాయి ప్రక్కనే కూర్చోవలసి వచ్చింది."

గోవిందు హరిజన అమ్మాయి ధైర్యంకన్నా ఆమెను బలపరచిన జనాన్నందర్నీ అభినందిస్తూంటే రంగయ్య నాలుక కరుచుకొన్నాడు.

నిజానికా రోజున బస్సులో వాళ్ళంతా కండక్టరు రాజీపద్ధతికి సెభాష్ అన్నారు. హరిజన అమ్మాయి పెంకితనాన్ని దుయ్యపట్టి, తక్కువ కులాలవాళ్ళని కొర్రెక్కించేడని గాంధీని తిట్టేరు.

ఆ బస్సులోనేవున్న తాము అంతా ఆ అమ్మాయిని సమర్థించేరు. ఇల్లాంటి పనులవల్లనే తక్కువకులాలన్నీ తురకల్లోనూ, కిరస్తానీల్లోనూ

కలిసిపోతున్నారన్నారు. ఆర్యసమాజ సభల్లోవిన్న వాదనలన్నీ అక్కడ వల్లించేరు.

కాని, వాళ్లు నవ్వేసేరు. తమ మాటల్లోని యాసా, ఉర్దూ పదాల మిశ్రణం మూలంగా తమవాదన పూర్తిగా వాళ్ళకర్థం కాలేదు. ఇంక హాస్యం పట్టించేరు. వాళ్ళల్లా నవ్వుతూంటే సర్కారువాళ్ళ దురహంకారానికి తాను పళ్ళుకొరికేడు కూడా.

వాళ్ళనే ఇప్పుడు గోవిందు అభినందిస్తున్నాడు. ఆ హరిజనపడుచు ప్రతిఘటనను గురించి తానింత చెప్పినా బాగుందని ఒక్కమాట అనలేదు. పైగా ఇది.

ఆరేడు నెలల క్రితం బందరునుంచి ముగ్గురు యువకులు తెలంగాణాలోకివచ్చి ఎర్రపాడుకోటలో హింసలకు గురిఅయిన వార్తను గుర్తు చేసుకొని బీదాళ్ళంటే సర్కార్లలో అభిమానం కాబోలని కూడా నిర్ణయం చేసేసేడు.

1946 వెట్టి వ్యతిరేక వుద్యమం తెలంగాణా పల్లెల్లో కారుచిచ్చులా వ్యాపించింది. దానిని అణచివేయడానికై నిజామ్ శాహీ మిలిటరీని కూడా వుపయోగించి ఎన్నో ఘోరాలు సాగించేడు. ఆ దురంతాలను వ్యతిరేకిస్తూ కోస్తా తెలుగుజిల్లా లన్నింటా బ్రహ్మాండమైన ఆందోళన జరిగింది. అనేక చోట్ల తెలంగాణా సహాయక సంఘాలు ఏర్పడ్డాయి. బందరులో ఏర్పడిన కమిటీ తెలంగాణా పరిస్థితుల్ని స్వయంగా పరిశీలించి రావడానికై ముగ్గురితో కూడిన ఒక కమిటీని పంపించింది. *వారు 1946 డిసెంబరు 10 వ తేదీన మధిర వెళ్ళారు. అక్కడినుంచి మూడురోజులపాటు 10, 12 గ్రామాలు పర్యటించారు. 12వ తేదీన వీరిని జన్నారెడ్డి ప్రతాపరెడ్డి అనే

---

*ఈ కమిటీ సభ్యులలో ఒకరైన శ్రీ భోగాదుల రామారావుగారిని కాంగ్రెసు ప్రభుత్వం 1950 డిసెంబరు 5 న కాల్చివేసింది:— రచయిత.

జమీందారు పట్టించి 'ఎర్రపాడు' కోటలో నిర్బంధించి చాల ఘోరంగా హింసించేడు. తరువాత వారిని నల్లగొండ పోలీసులకి వప్పచెప్పేడు.

దానిమీద సర్కార్లలో బ్రహ్మాండమైన ఆందోళన జరిగింది. ఫలితంగా నిజాం ప్రభుత్వం వారిని విడుదలచేయక తప్పిందికాదు.

గోవిందు ఆ కథనే నెమరువేస్తున్నాడు.

తాను కళ్ళతో చూసిన విషయాన్నీ. తెలంగాణా ప్రజలకు అండగా నిలబడి పెద్ద అందోళనచేసిన ప్రజల్నీ సరిప్రక్కల పెట్టిచూస్తే సర్కారు ప్రజలకి బీదలంటే అభిమానం వుందనాలో, లేదనాలో అర్థంకాలేదు రంగయ్యకు. మంచీ చెడ్డా అన్నిచోట్లా వున్నాయి. అమాటే గోవిందుతో అన్నాడు.

"ఎక్కడా ఒక్కటే నమూనా. బెదిరేవాళ్ళంటే గొర్రెకూడా కరుస్తుంది."

గోవిందు అంగీకరించేడు.

రంగయ్య పదిరోజుల క్రితం రైలులో ప్రయాణం చేస్తున్నప్పుడు తన కంటబడిన ఒక సంగతిని వివరించేడు.

ఆత డెక్కిన రైలు భువనగిరి దాటింది. పెట్టె అంతా కిటకిటలాడి పోతూంది. ఓ పది పదిహేనేళ్ళ ముస్లిం కుర్రాడు బండిలోకొచ్చేడు. వానిని చూస్తేనే పరమ అసహ్యంగా వున్నాడు. చోటుకోసం అటూ యిటూ చూసేడు. బల్లమీద చొక్కాలు తొడుక్కున్న వాళ్ళమధ్య ఒక రైతు చెవిలో పచ్చాకుచుట్టా, భుజాన కంబళీతో కూర్చుని కనిపించేడు. ఆ ముస్లిం కుర్రాడు ఆతనివద్దకువెళ్ళి మాటామంతీ లేకుండా చేయిపట్టుకు లాగేసేడు. వానిస్థానంలో తాను ఇరికేడు. అంతవరకూ రైతు సగ్గా

కూర్చోడానికూడా చోటు ఇవ్వని ఆ ప్రయాణీకులు సర్దుకొని, గొలు కంపు కొడుతున్న వాడికి చోటు యిచ్చేసేరు. వాడు అడుక్కుతినేవా డయితేనేం, నవాబూ, వాడూ ఒక మతంవాళ్ళు. అందుచేత వానిది రాజ వంశం.

నిజానికి అ రైతు తలుచుకుంటే వానిని సున్నితంగా కిటికీలోంచి క్రిందికి జారవిడిచెయ్యగలడు. కాని, ఆపని చెయ్యలేడు. గిడగిడలాడుతూ దండంపెట్టి, బెంచీలమధ్య అందరి కాళ్ళక్రిందా కూర్చున్నాడు. గొలుకంపు కొడుతున్న ముస్లిం కుర్రవాడికి చోటు ఇవ్వవలసివచ్చిన దురవస్థకు బల్ల మీద వారు తమ కాళ్ళవద్ద కూర్చున్న రైతుమీద కసి తీర్చుకొనసాగేరు. ఆతన్ని తన్నేరు, తిట్టేరు. తగులుతున్నాడని మోకాళ్ళతో పొడిచేరు.

ఆ అమాయకుడు నీ బాంచని. కాల్మొక్కుతానని పేరు పేరు వరసన బ్రతిమలాడుతూంటే నవ్వి ఎకసక్కెం ఆడేరు. ఆ సమయంలో అక్కడేవున్న రంగయ్య అన్నీ చూస్తూ ఎంతో బాధపడ్డాడు. కాని, వాని తరపున నిలబడి ఒక్కమాట కూడా ఆడలేకపోయాడు. అడ్డుపడాలనీ, రైతును బాధిస్తున్న వాళ్ళని గదమాయించాలనీ అతనికెంతో ఆవేశంవుంది. కాని ఏమీ చెయ్యలేకపోయేడు.

అయినా, ఆరోజున తాను అనాలనుకొన్న మాటల్నీ. అనివుండాలి సిందని తర్వాత బాధపడినమాటల్నీ నిజంగా తాను అన్నట్లుగానేచెప్పేడు. ఆతని మంచితనాన్ని గోవిందు అభినందించేడు.

ఈమారు రంగయ్య ధైర్యంగా గోవిందు భయస్వభావాన్ని వేలు పెట్టి చూపించేడు.

"దొరలు ఏమంటారో, అనరో....కాని, ఏదో అంటారని మన భయం. ఆభయాన్ని చూసే వాళ్లు మనల్ని చొక్కాకూడా తొడుక్కోనివ్వ డంలేదు. ఆ భయం పోవాలి, అప్పుడే మనం తలెత్తుకోగలం."

అదెల్లాగన్నట్లు గోవిందు ప్రశ్నార్థకంగా అతని ముఖంవంక చూసేడు.

అతనికేకాదు ప్రజానీకానికంతకూ అదొక ప్రశ్నే. యుగయుగాలు కళ్లకుట్టేసేరు. నాలుకను అంగుడికి తాపడం చేసేసేరు. ఇప్పుడు కళ్లుతెరవమంటేనూ, మాట్లాడమంటేనూ సాధ్యమా ? మాట్లాడవేమని నెపం పెడితే ? ఆకుట్లు విప్పెయ్యాలి. నాలికకు స్వేచ్ఛ నివ్వాలి. అప్పుడయినా ఆ స్వేచ్ఛాస్వాతంత్ర్యాలకు అలవాటు పడేసరికి కొంతకాలం పడుతుంది.

"చొక్కా నా వొంటినుంటే ఆ దొర మర్యాదగా కమీ అవుతుందా ?"

గోవిందు ఏమీ మాట్లాడలేదు.



## అయిదో ప్రకరణం

రంగయ్య వచ్చేడని వింటూనే శివరామిరెడ్డి రమ్మన్నట్లు తల విసిరేడు. గోవిందు పక్కకు తప్పుకొన్నాడు. రంగయ్య చావడిలో అడుగు పెడుతూ రెండుచేతులూ జోడించి సలాం అన్నాడు. రెడ్డి బుగ్గమీసాల సందునుంచి చిరునవ్వు కనబడింది. ప్రతి నమస్కారంగా రెండుమార్లు కుడిచేయి నుదుటివేపు ఎత్తేడు.

రంగయ్య వస్తూనే తాను పిలవనంపితే వచ్చేనన్నసంగతి విన్నవించేడు.

"తమరు ఎందుకో యాదిచేశారట."

శివరామిరెడ్డి కూర్చోమనకుండానే పలకరించేడు. ఏదీ ప్రత్యేకమైన పని ఏమీలేదనీ, ఓమారు పరిచయం చేసుకోవాలనిపించి తీసుకరమ్మన్నాననీ చెప్పేడు.

"మా అల్లుడుగారు తరుచు నిన్నుగురించి చెప్తుంటారు. బాగా చదువుకుంటున్నావనీ, ఈఏడాదే వకాలితు పెట్టబోతున్నావనీ చెప్పారు. సంతోషం. మీ తాతా తండ్రీ చాలమంచివాళ్ళు."

ఆతని తెలివితేటల్నిగురించి తన అల్లుడు ఏమేం చెప్పేడో, ఆతని కుటుంబం మంచినిగురించి తానేమేం యెరుగునో శివరామిరెడ్డి చెప్పుకుపోతూంటే రంగయ్య వినయం కనబరుస్తూ నిలబడిపోయేడు. అంత మంచి కుటుంబంలోపుట్టిన, తనంత బుద్ధిమంతుణ్ణి రెడ్డి మాటవరసకయినా కూర్చోమనలేదనీ, తనతోపాటు ఆయనకూడా నిలబడేవున్నాడనీ గమనించి రంగయ్య ఆలోచనలోపడ్డాడు.

శివరామిరెడ్డి ఇంకా చెప్పుకుపోతున్నాడు.

"వాళ్ళు తమ జీవితాల్ని మన్నుకి అంకితం చేసేసేరు. అంతవాళ్లు లేరనిపించుకొన్నారు."

శివరామిరెడ్డి తాటాకులు కడుతున్నాడో, నిజంగా పొగుడుతున్నాడో, అర్థంకాలేదు. తన కుటుంబంవాళ్లు మన్నుపిసుక్కు బ్రతికిన సాధారణ కుటుంబమేసుమా యని రెడ్డి గుర్తుచేస్తున్న ట్లనిపించింది. చదువుకొని బిల్లకట్టబోతున్నా మాకంటె తక్కువవాడివే యని జ్ఞాపకం చేయడమా దీనికర్థం? మొగంవేపు చూసేడు. అక్కడ అటువంటిభావమేం కనబడలేదు. కాని, ఆయన తన్ను కూర్చోమనేనా అనలేదు. రాజిరెడ్డి తమ పెద్దకుటుంబాలలో కనబరిచే అహంకారాలూ, వ్యర్థప్రతిష్ఠలూ గురించి చెప్తూ తన మామగారికథలు బోలెడు చెప్పేడు. తాను గౌరవంచేయడానికి సాహసించలేని, గౌరవించడానికి ఇష్టంలేనివారికి శివరామిరెడ్డి 'దర్శనం' ఇచ్చే విధానాన్ని ఆతడే చెప్పేడు. అవన్నీ గుర్తువచ్చేయి. ఆతడు చెప్పిన చావిడి ఇదే అయివుంటుంది. అక్కడున్న పరికరాల్ని చూసేక తానున్న చావిడి అటువంటి దర్శనాల నివ్వడంకోసమే ఏర్పడినదయి వుండాలని భావించేడు.

"నీకు అక్కడ కూర్చునేటందుకు ఏమీ వుండదు. పైగా ఆయన అటూ ఇటూ పచారుచేస్తూ, నీమొహంవేపన్నా చూడకుండా మాట్లాడుతూ పోతూంటే, వ్యవహారంమీద వచ్చినవాడివి నిల్చుండ కేంచేస్తావు?"

సరిగ్గా రాజిరెడ్డి వర్ణించినట్లేవుంది. గోడని ఎదురుగా నిజాంనవాబు జూబిలీ హాలులో కొలువుతీర్చినచిత్రం ఒకటి, పెద్దసైజుదివుంది. గోడల పొడుగునా స్టేట్‌లోని వివిధజిల్లాలలోని అందమైన ప్రకృతి దృశ్యాల పెద్ద సైజు ఫొటోలు అలంకరించబడి వున్నాయి. గదిలో నేలని మెత్తని తివాసీలు పరిచివున్నాయి. ఎక్కడా కుర్చీలుగాని, తఖ్తాలుగానిలేవు.

ఈ చావడిని గురించి వర్ణించినప్పుడు తానో ప్రశ్న వేసేడు.

"ఆ వచ్చినవాడు పెంకెఘటంఅయి. హోదాగలవాడైతే?"

వట్టి పెంకెఘటమే అయితేమాత్రం ఎక్కడ కూర్చుంటాడు? మొండితనానికి కూర్చుంటే సరిగా ఆయన కాళ్ళవద్ద మోకరిలబడినట్లే వుంటుంది. శివరామిరెడ్డి ఆరడుగులపై చిల్లరవిగ్రహం. అంతమనిషీ నిల్చుని మాట్లాడుతూంటే, వచ్చినవాడు ఆయన ముఖంచూస్తూ కూర్చున్నాడా· మోకరిలబడి ఏదో ప్రార్థిస్తున్నట్లే వుంటుంది. మనల్ని గౌరవం చేయడానికి ఆయనే ఇష్టపడనప్పుడు మనల్ని మనమే హీనపరుచుకుంటామా?

ఆనాడు రాజిరెడ్డి మాటలు ఆతనికి అర్థంకాలేదు. కాని, నేడు నిజమేననుకొన్నాడు. కూర్చునేటందుకు పరుపువేసి కూర్చోమన్నా అతడు కూర్చోడు. ఎంత దొర అయితేమాత్రం కాళ్ళవద్ద కూర్చుంటాడా?

హోదాగలవాళ్ళకి దర్శనం ఇవ్వవలసివస్తే ప్రక్కనేవున్న అందమైన చిన్నపూలతోటలో తిప్పుతాడు. తాను నిల్చున్నచోటికి ఆపూలతోటలో కొంతభాగం కనిపిస్తూనేవుంది.

అసలు వచ్చినవానితో కూర్చోడం ఇష్టంలేక అలా తిప్పుతున్నాడని తోచనిస్తాడా? అలా అయితే అందం ఏంవుంది?

తానూ వింటున్నాడు మీ తాత తండ్రులు తమ జీవితాన్ని మన్నుకు అంకితం చేసేరని అభినందించడంలో తమ పూర్వస్థితిని గుర్తుచేస్తున్నట్లనిపించినా, ఆ మాటలెంత పొందిగ్గావున్నాయి? ఆ మాటల్లో, స్వరంలో ముఖంలో ఎంత అభిమానాదరాలు ఒలుకుతున్నాయి!

రంగయ్య మనస్సులో శివరామరెడ్డి సంభాషణ పొడూగునా గచ్చ ద్వ్యాఖ్య సాగుతూనేవుంది. మధ్యమధ్య సమయోచితంగా రాజిరెడ్డికి, శివరామిరెడ్డికీ తమ కుటుంబంమీదగల సదభిప్రాయానికి అభినందన వాక్యాలు తెలుపుతూనే వున్నాడు.

శివరామిరెడ్డి ప్రశ్నలువేసి, ఆతడెక్కడ వకాలతు పెట్టబోయ్యేదీ, ఏం చెయ్యబోయేదీ తెలుసుకొని సంతోషం తెలిపేడు.

"నవాబుగిరీ అనుకో. చూడు సంగారెడ్డి ? అన్ని జిల్లాలలోనూ ఎస్టేట్లకి ఎస్టేట్లు సంపాదించేడు. పోనీయంటే ఇంగ్లీషూరాదు. తెలుగు తిన్నగా రెండునిమషాలు మాట్లాడలేడు. కాని, మంచివకీలుగా పేరుసంపాదించేడు. ఆయన సంపాదన-ఏపాటి ఆస్తివున్నా సాధ్యమా ?"

సంగారెడ్డి మంచి పేరుగల వకీలు. రాజకీయాలలో కాంగ్రెసు, స్టేట్ కాంగ్రెసు నాయకుల్లో వొకడు. ధాన్యపు రవాణా నిబంధనల నతిక్రమించిన బ్లాక్ మార్కెటు కేసుల్లో అయితేనేం, ఆస్తి పరుల మరణానంతరం నిజాముకు చెందిపోయిన జాగీర్లు, ఇనాములు మొదలయినవాటిని వారసులకిప్పించేటందుకు పైరవీ నడపడంలోనైతేనేం ఆయనసిద్ధహస్తుడు. హైకోర్టు జడ్జీలనుసహా ఆయన సంతృప్తి పరుస్తాడని ప్రతీతి. ఆయన కేసులన్నీ ఆస్థిలో వాటాల పద్ధతిమీదనే. అందుచేతనే స్టేట్ లోని అన్ని జిల్లాలలో ఆయనకు బోలెడన్ని ఆస్తులు దఖలు పడ్డాయి. లక్షలు సంపాదించేడు.

సంగారెడ్డి సంపాదనా శక్తిమీద ఎంతో గట్టివాడురా యనేభావం రంగయ్యలోవున్నా ఆస్థితో పోటీపెట్టడంచేత అంగీకరించడానికి ఒప్పుదల కలగలేదు. అలాగని శివరామిరెడ్డి మాటలను ప్రత్యాఖ్యానంచేసి వాదన పెట్టుకోగల ధైర్యమూలేదు. కనక వ్యవసాయం కిట్టుబాటు కాకపోవడానికి దేశంలోని ఆర్థికపరిస్థితి కారణం అని చెప్పేడు. వెట్టిచాకిరీలు, భూస్వాములు రైతులకున్నదల్లా వూడ్చుకుపోవడంవలన పనిచేసేవానికి రక్షణా, విశ్వాసమూ, తాహతూలేకుండా పోతూందని చెప్పాలనివుంది. కాని పెద్ద రెడ్డి ముందర ఆమాటలు చెప్పడానికీ సాహసం కలగలేదు. కనక చిన్న చిన్న కమతాలూ, వేదయుగంనాటి పనిముట్లూగురించి ఎత్తుకొన్నాడు. వాటినిగురించి ఎంతసేపుచెప్పినా తనకూ, సంగానికీ ముడిపెట్టి ఇబ్బంది కలిగించడం ఎవరికీ సాధ్యంకాదు.

మొట్టమొదట్లో, ఏదో వొకటి చెప్పాలిగనకా, పెద్దరెడ్డికి కోపం కలగకుండా, తనకు నష్టంకలగకుండా వుండేందుకని చిన్నకమతాలూ, పాత పనిముట్లూ సంగతిని ఎత్తుకున్నా క్రమంగా ఆ ఆవేశంలో పడిపోయేడు. ఉదాహరణకు అమెరికాలో వ్యవసాయ పరిస్థితులనుగురించి తాను చదివినవీ, విన్నవీ గుర్తువచ్చేయి. అక్కడ పెద్దపెద్ద బ్యాంకులూ, కంపెనీలూ లక్షలకొలది ఎకరాల కమతాలను నడిపిస్తున్నాయి. ఏపైరువేసినా వేల ఎకరాలలెక్కనే. కనక వాటిని దున్నాలన్నా, పైర్లు కోయాలన్నా ఏం చెయ్యాలన్నా అనేకరకాల యంత్రాల నుపయోగిస్తున్నారు. అవి ఎంతెంతో ఖర్చును ఆదాచేస్తున్నాయి.

చిట్టచివర మన దేశంలోకూడా వ్యవసాయంలో యంత్రాలను ప్రవేశ పెడితేతప్ప లాభంలేదన్నాడు. యంత్రాలను తేవాలంటే సెంటూ, కుంటా వ్యవసాయాన్ని కొనసాగించడం ఎల్లాగ?

శివరామిరెడ్డి నిశ్శబ్దంగా పచారుచేస్తూ, శ్రద్ధగా అతడు చెప్పినవన్నీ విన్నాడు. ఆఖరున ఏదో ధ్యానసముద్రంలోంచి మేలుకొన్న వాడిలాగ చూసేడు; ఆశ్చర్యం ప్రకటించేడు, ఒకనిట్టూర్పుతో.

"ఈ రోజుల్లో పడుచువాళ్ళందరివీ ఒకటేపద్ధతి. మా రఘుకూడా ఇదే.... సరిగ్గా ఇంతే...."

రఘునందనుడు శివరామిరెడ్డి రెండోకొడుకు. చదువుల్లోనూ, వ్యవహార విషయాలలోనూ చాలా తెలివిగలవాడని పేరువుంది. కొద్దిరోజులు ప్రభుత్వోద్యోగంచేసి, మనస్తత్వానికీ ఉద్యోగపద్ధతులకీ సరిపడక రాజీనామా పెట్టేడు. స్వంతసేరీ పెట్టేడు. ఇంజన్లూ, ట్రాక్టర్లూ తెప్పించేడు. ఆధునిక పద్ధతులపై వ్యవసాయం చేయిస్తాడంటున్నారు.

మంచి తెలివిగలవాడుగా పేరున్న రఘునందనుండి అభిప్రాయాలతో తన అభిప్రాయాలు కలుస్తున్నాయన్నది విని రంగయ్య బ్రహ్మానంద పడ్డాడు.

రఘునందనుడు కానైతే కొంచెం తేడాలో తనవయస్సువాడే. అయినా ఆతనితో రంగయ్యకు పరిచయంలేదు. అయినా, తనను పెద్దగా అభినందించిన దొరను సంతోష పెట్టడానికై ఆయన కొడుకును పొగిడేడు.

"అటువంటివారే దేశానికి ఆదర్శం చూపగలరు. వారికి ఆ అవకాశం, ఆసక్తీ వుండడం దేశం అదృష్టం...."

శివరామిరెడ్డి మీసాలు సవరించుకొంటూ విన్నాడు. అన్నీ విన్నాక రంగయ్య ఆదర్శపద్ధతి యని పొగిడిన కార్యవిధానాన్ని అమలు జరపడానికి సంసిద్ధత ప్రకటించేడు.

దొర కొడుకు పెద్దఎత్తున వ్యవసాయంసాగించే ఏర్పాట్లలో వున్నాడు. ట్రాక్టర్లూ, మోటార్లూ, నీటి పంపులూ తెప్పించేడు. చెదురు చెదురుగా చిల్లరగా రైతుల చేతుల్లోవున్న భూముల్ని రెండేళ్లుగా నెమ్మది నెమ్మదిగా చేతిలోకి తెచ్చుకొంటున్నాడు. ఆ మహాయజ్ఞంలో బోళ్ళపొలం కూడా స్వాహాకావలసిన అవసరం వచ్చింది.

శివరామిరెడ్డి మాటలతో రంగయ్య నెత్తిన పిడుగుపడ్డట్లయింది. గూబకి బెత్తెడుచూసి, సాగదీసి కొట్టినట్లయి బిత్తరపోయేడు.

---

# ఆరో ప్రకరణం

బోళ్ళపొలమూ. ఆ చుట్టుప్రక్కలనున్న భూములూ అన్నీ రెడ్డివే. ఎప్పుడో ఏభయ్యేరవయ్యేళ్ళనాడు రంగయ్య తాత వూళ్ళోకి పెళ్ళాన్నీ పదేళ్ళకొడుకునీ వెంటబెట్టుకొని వచ్చేడు. చాల బీదవాడు. శివరామిరెడ్డి తండ్రి ఊరుప్రక్కన గట్టువెనకాలవున్న ఆ పదెకరాలభూమీ చూపించేడు. అప్పటికి తాను బాగా చిన్నవాడు. తర్వాత జ్ఞానంవచ్చేక తండ్రి తననోమారు పిలిచి భూమినిచ్చినసంగతినిచెప్పి ఒక్కమాట అన్నాడు, అదిప్పటీజ్ఞాపకం.

"వీళ్ళు చాలా ఓర్పుగలవాళ్ళు. మనమిస్తున్న భూమిమొదలయి, వీళ్లు సెభాష్ అనిపించుకోగలరు...."

ఆ భవిష్యత్కథనం నేడు యధార్థంగా కనిపిస్తూందంటూ శివరామిరెడ్డి పితృస్మరణకు చెమ్మగిల్లినకళ్లు ఆకాశంవంకతిప్పి. ఒక్కనిట్టూర్పు విడిచేడు.

"మహాపురుషులు!"

ఒక్కనిముషం గదిఅంతా నిశ్శబ్దంగావుంది. రెడ్డి తన తండ్రిగారి ఆశీర్వచనం ఏలా ఫలించిందో నాలుగుమాటల్లో చెప్పేడు. ఆ కుటుంబం ఆ చిన్న ఆసరాతో నిలదొక్కుకుంది. అభివృద్ధిలోకి వచ్చింది. ఆ ముసలి రంగయ్య మనమడు వకాలతు చదివేడు. ప్రాక్టీసు పెట్టబోతున్నాడు. అంతకన్న- తమరిచ్చిన మొదలు వేయింతలయి మూడు పువ్వులూ, ఆరుకాయలూగా వృద్ధిపొందడంకన్న కావలసిందేమిటి? అంతకన్న సంతోషం ఏముంది?

ఆ పదెకరాల గోద్రాళ్ళదిబ్బా. ఆయన ఆశీర్వచనమూ మాత్రమేనా తమకుటుంబం కాలు నిలదొక్కుకోడానికి కారణం? తమకష్టం. చాకిరీ వీటికి విలువేలేదా? తనచేయి తననెత్తినే పెట్టించేవిధంగా రెడ్డి మాట్లాడుతూంటే రంగయ్యనోరు వెతకలెయ్యడంతప్ప ఏమీ అనలేకపోయాడు.

చివరకు రెడ్డి తన అభిప్రాయం మరో మరోలా వున్నా కేవలం దేశాభివృద్ధిని దృష్టిలో పెట్టుకొని రంగయ్యచెప్పినట్లే చిన్నచిన్న ఖండాలుగావున్న భూమిని ఏకంచేయవలసి వస్తూందన్నాడు.

"మీ అయ్య ఓ ఏభయ్యెకరాలు కొన్నాడు. నువ్వా చదువుకొని పైకివచ్చేవు. మా నాయనగారి ఆశీస్సు ఫలించింది. ఇంక దేశం అభివృద్ధి కోసం ఆ మొదలు మళ్ళీ తీసుకోవలసివస్తూంది. నీ అభిప్రాయంకూడా అంతేకావడంతో ఒక పెద్దసమస్య తీరిపోతూంది."

పైకి ఎంతో సున్నితంగా, అరచేతిలో అరటిపండొలచి పెట్టినట్లు కనిపించే వ్యవసాయ సంస్కరణల వెనకనున్న చిక్కులు ఆక్షణంలో అర్థం అయినట్లు రంగయ్యకు మరెప్పుడూ కనబడలేను. తన తాతకు రెడ్డి తండ్రి ఆ భూమి ఇచ్చినమాట నిజం.

కాని....

ఆ ఇచ్చినభూమి ఎటువంటిది? అది లెక్కలేదా? అంతా రాళ్ళురప్పలతో, నీటిజాళ్ళకి నిలువుదేసి గోతులతో, గాళ్ళతో తల్లక్రిందులుగా వుండేది. ఆ కుటుంబంవాళ్లు రెండుతరాలవాళ్లు తమ రక్తమాంసాలతో పూడ్చినా, ఈనాటికీ ఆ భూమిలో గజం, అరగజంఎత్తు తేడాలో చెలకలు పక్కపక్కన కనిపిస్తున్నాయే, మొదట ఎల్లావుండేదో? ..

రంగయ్యకూడా మొదట్లో ఆ చేను ఎల్లావుండేదని కానీ, దానికోసం ఎంతశ్రమపడ్డారో యనిగాని ఆలోచించడంలేదు. ఆ భూమి తమది. తమ కుటుంబం మనుగడకూ, ప్రతిష్ఠకూ ఒక ప్రత్యక్ష చిహ్నం. అదికాస్తాపోతే గతంతోటీ, భూమితోటీ తమకు సంబంధం ఏం మిగులుతుంది?

ఇప్పుడు పెద్దరెడ్డిముందు తానుతెచ్చిన వాదనలనే కొద్ది నెలలక్రితం రాజిరెడ్డీ తానూ పొలంలోకూర్చుని మాట్లాడుకొన్నారు. తమ వాదనలకి వెంకటయ్య అభ్యంతరం చెప్పేడు.

"చిన్నకమతాలయితే మునిగిపోయిందేమిటి? కొద్దో గొప్పో నాది అనుకొనే భూమి లేకపోతేనేగద బీదవాళ్ళకి ఈ చిక్కులు."

ఇల్లూ, వాకిలీ, పనీ, పాటా, తిండీ, బట్టా మొదలయిన నిత్యజీవితావసరాలన్నింటికీ బీదప్రజపడే చిక్కులన్నీ సెంటు భూమికూడా వాళ్ళ చేతిలో లేకపోవడమేనని వెంకటయ్య అభ్యంతరం.

దేశం అభివృద్ధిని దృష్టిలో పెట్టుకోవాలని తామిద్దరూ వాదించేరు.

మనిషిమాటేమిటని అతడు అడ్డుతగిలేడు. ఆచర్చలన్నీ గుర్తువచ్చేయి. తనవాదంలోవున్న ప్రమాదాన్ని చూపించినది వెంకటయ్యే కావడం రంగయ్యకు కష్టం అనిపించిది. అంతచికాకులోనూ.

ఆరోజున సత్తెమ్మే అందికూడా.

"ఇది నాది అనుకొని వుండకపోతే మాతాతయ్య, అయ్య, నేను దీని కోసం ఇంతకష్టపడి వుండేవాళ్ళమేనా?

ఆరోజున అది కేవలం స్వార్ధదృక్పధం అనిపించింది.

ఆ భూమికోసం తమ కుటుంబం ఎంత శ్రమపడిందో లోకులనుంచి విన్నవన్నీ సత్తెమ్మ ఏకరువేసింది. తమయింట్లో ఏభయ్యేళ్ళపాటు ఏది ఎంతవుంటే అదేఅంతే తిన్నారు. వున్నదాంట్లో కానీ, అర్ధణా మిగిల్చేరు. ఆ ఏభయ్యేళ్ళలో ముగ్గురు పెద్దవాళ్ళూ, నలుగురు అజాత శిశువుల్లూ ఆ అగత్తలకు బలి అయ్యేరు. తమ తల్లికి కలిగిన ఆరు గర్భాలలో తామిద్దరు మాత్రమే బ్రతికేరు. మిగిలిన వాళ్ళంతా అధికశ్రమ ఫలితంగా గర్భస్రావాలలోనే మరణించేరు.

ఇన్ని ప్రాణాలు బలిపెడితే వారు పోగుచేసిందల్లా నూట ఏభయి రూపాయలు. అదిపెట్టి తమతండ్రి ఓ ఏభయ్యెకరాలు అడివిభూమి

కొన్నాడు. ముసలివాని జీవితంలో పెట్టుకొన్న ఆశయం, ఆతని కొడుకు ఆశ్వాసాంత ఘట్టాలనాటికి జతపడింది.

ఇంత ఏకాగ్రనిష్ఠ ఏమిటి ? దాని గమ్యం ఏమిటి ?....భూమి లేక పోతే ఈప్రపంచంతో తమకున్న బంధంఏమిటి ? ఆభూమిని కొనుక్కో-రాదు. అమ్మరాదు అనంటే కోట్లమందిని తాడూ, బొంగరం లేకుండా చెయ్యడమే కాదా ?

ఆరోజున తాను ఆ ప్రశ్నకు సమాధానం ఇవ్వలేకపోయేడు. అది రైతువర్గం దిగపీకుడు స్వభావాన్ని ప్రతిబింబిస్తూందని రాజిరెడ్డి కొట్టి పారేసేడు.

ఆరోజున వెంకటయ్యే మరో మాటమీదకూడా ఆటంకం చెప్పేడు ఆతని కెందుకుతోచిందో. దానిమీద తమరు చెప్పగల సమాధానంకూడా లేకపోయింది.

దున్నలేనివాడికి భూమి ఎందుకని తానోవాదం తెచ్చేడు. ఓ ఎద్దుండదు. గిత్త వుండదు. ఓ నాగలీ, గుద్దలీ వుండదు. చేతిలో కానీ వుండదు. వాడి చేతిలో భూమివుండి లాభం ఏమిటి ? దేశానికి మీదు మిక్కిలి నష్టం గాని....

వెంకటయ్య దాని కభ్యంతరంగా చెప్పినమాటలు తన కప్పుడు అర్థం కాలేదు.

భూమి ఎవరుదున్నితే వానిదా ? అయితే రోజూ ఓ వంద ఎకరాలు దున్నుతుందట. దొర యంత్రం తెప్పించేడు. వరసపెట్టి కావాలంటే మరో నాలుగు తెప్పిస్తాడు. గట్లూ, కాలవలూ లేకుండా వరసపెట్టి దున్నేస్తాయవి. అభూమంతా దొరదే అవుతుందన్నమాట. మరి వూళ్ళో రైతాంగం, కూలీ, నాలీ జనం మాటేమిటి ?

ఆ ప్రశ్నకి రాజిరెడ్డి వద్దకూడా సమాధానం లేకపోయింది. పోయి మార్క్స్-ఏంగిల్సులు ఏం వ్రాసేరో చూసుకొన్నాడు. రెండు రోజులు

వెతికి ఏమిటో చెప్పేడు. జమీందారీయుగపు భూస్వామ్య విధానానికి విరుగుడుగా దున్నేవారికే భూమి అన్నారుట. దానిని తీసుకెళ్ళి యంత్రాలతో వ్యవసాయం చేసేస్తామనే జమీందార్లని సమర్థించడాని కుపయోగించబో వడం తప్పేనన్నాడు.

రాజిరెడ్డిది అదోగొడవ. ఏమన్నావస్తే మార్క్సు ఏం వ్రాసేడని పుస్తకాలు తిరగెయ్యడం మొదలెడతాడు. దానిని తామందరూ వేళాకోళం చేస్తారు. కాని ఆయనే సరిగ్గా అన్నాడనిపించిందిప్పుడు. ఆరోజున తానో చిట్కా చెప్పేడు. '

"దేశ క్షేమంకోసం బలవంతంగానైనా పూనుకోవలసిందే."

ఆ రోజున తానుచెప్పిన చిట్కానే ఇప్పుడు రెడ్డి అమలు జరప బోతున్నాడు. కాని. అది తనకే ఎసరుకాబోతూంది. మింగుడుపడ్డంలేదు.

"ఈ పొలాన్ని ఏభయ్యేళ్ళనుంచి మేం చేసుకొంటున్నాం."

రెడ్డి మీసాలు దువ్వుకొంటూ ఆకాశంవేపు చూసేడు.

"అందుకే ముఖ్యంగా విశ్వాసంచూపడం మరీ అవసరం. ఏదోకష్టంలో వున్నప్పుడు ఆసరాయిచ్చాం. ఏభయ్యేళ్ళపాటు ఏం ఇచ్చారో ఏంలేదో. అదంతా భగవంతుడికే ఎరిక. మీరూ నిలదొక్కుకున్నారు. ఇంక దానిని వదలండి. ఈ ఏడాది నార్లు అక్కడే పోయిస్తా."

ఎంతో మెత్తగా. విచారపడుతున్నట్లూ. వాదించి వొప్పించడానికి ప్రయత్నిస్తున్నట్లూ కనిపిస్తున్నా రెడ్డి ఆఖరువాక్యం సుగ్రీవాజ్ఞ. దానికి సమాధానంలేదు. ఆయన కోరనూలేదు.

రంగయ్య దిగులుగా ఇంటిమొగం పట్టేడు.



# ఏడో ప్రకరణం

రంగయ్య నిద్రలో నడుస్తున్నట్లు తూలితూలిపోతూ వచ్చేడు. మనసు లోని బాధఅంతా మొగాన్నేవుంది. ఆ ఆకారం చూసేసరికే ఏదో కష్టం వచ్చిందని భార్య నిశ్చేష్టురాలయింది. తల్లి పలకరింపులో ఏడ్పు ప్రతిధ్వనించింది. దారినేపోతున్న రైతు ఆతని నంతదూరానే చూసి ఏదో కష్టం కలిగిందనిపించి నిలబడ్డాడు. భుజానవున్న సామాను వాకిట్లో పడేసి లోనికి వచ్చేడు.

భార్య తెచ్చియిచ్చిన మంచినీళ్ళతో గొంతు తడుపుకొంటూ రంగయ్య దొరమాట లొక్క-టొక్క-టే చెప్పలేక చెప్పేడు. దొర బోళ్ళ పొలం వొదలమన్నా డనేసరికి తల్లి గోలు గోలున ఏడ్పు మొదలెట్టింది. ఏడుస్తూనే తామూ చెలకభూమిని సరిచేయడానికీ, సాగుచేయడానికీ పడిన కష్టాల్నీ, పోగొట్టుకున ప్రాణాల్నీ వివరించింది. వర్ణన సుదీర్ఘం. ఇది వరకు దాని నంతా పేర్వేరు రూపాల్లో విన్నాడు. అయినా ఇప్పుడూ విన్నారు. విని ఓదార్చేరు.

వాళ్ళచేతుల్లోకి వచ్చినప్పుడు అది పొలమూకాదు, కనీసం చెలకయినా కాదు. రాళ్లు రప్పలు, బండలు, బోళ్లు, ముళ్లు, తుప్పలతో వుంది. ఒక చిన్న గుట్టవంచన వాలులో వున్నదేమో వర్షపునీటికి జాళ్ళుపడి, ఇంతింతేసి లోతున పర్రెలుపడి వుండేది. వీరమ్మ మామా, అత్తా కౌస్త చదునుగానున్న నాలుగైదెకరాలలో జొన్నో, సజ్జో వేసేరు. తీరికయి నప్పుడల్లా రాళ్లుఏరి, జాళ్ళకి సప్పిళ్ళువేసేరు. గొప్పుకొట్టి పల్లాలుపూడ్చేరు.

ఒకరోజా, రెండురోజులా ? కొన్ని ఏళ్ళపాటు నిద్రాహారాల కవసర మయిన కనీసకాలంతప్ప మిగిలిన ప్రతిఘడియా పొలంలో గడిపేరు.

ఇదివరకు వాళ్ళనోటా వీళ్ళనోటా విన్న కధల్నే తల్లి చెప్తూంటే వింటూ ఆ భూమికోసం తన తండ్రి తాతలు పడినశ్రమకు విలవ కట్టడానికి రంగయ్య ప్రయత్నించేడు. కాని ఆతనికి అంతు చిక్కనేలేదు.

దొర తన తండ్రియిచ్చిన మొదలూ, ఆశీర్వాదమూగురించి మాట్లాడు తూంటే ఈ విషయమే తోచలేదు. తమకా భూమిమీదగల హక్కు కేవలం ఏభయ్యేరవయ్యేళ్ళ ఖబ్జావలన సంక్రమించింది మాత్రమేకాదు. ఆభూమిలో ప్రతి అంగుళంమేరా తనకుటుంబీకుల కష్టంతో ప్రస్తుతంవున్న రూపానికి వచ్చింది. ఏభయ్యేళ్ళు ఒక కుటుంబంవాళ్లు ఓడ్చిన శ్రమకి విలువేలేదా ?

దానికి విలువకట్టడానికి మామూలు కూలి-కూలిపని లెక్కలు సరిపడవు. రైతు తనపొలంలో చేసేపనికి లెక్కకట్టడం సాధ్యంకాదు. ప్రతిగంటలో కూలివాడు చేసే రెండుగంటలపని కుప్పి ప్రతిరోజూ ముగ్గురు కూలీలపెట్టు పనిచేస్తాడు. దానికంతకూ లెక్కకడితే దొర యిచ్చిన మొదలూ, ఆ ఆశీ ర్వచనమూ ఓలెక్క కొస్తాయా ?

దానికి లెక్కకట్టలేరు. రైతుచేసే కష్టం గంటలు, బుడ్లూ లెక్కకి అందదు. అదే మరోచోట కూలిపనికిపోతే, మరోవృత్తి ఏదన్నా చేసు కుంటే ?....నిజమే బోలెడు ఆదాయం వచ్చేదే. ఏమో ? కాని, వాళ్ళు చెయ్యలేదు. ఎందుకు ? ఆ రాళ్ళు, రప్పలు పెల్లగించడంలో, ఆ గోతులు నింపడంలో, అంగుళం, అంగుళం మేర చదునుచేయడంలో వాళ్ళు ఏ మాసించేరు ?

వరసగా ఆరడజనుమంది జ్ఞాత, అజ్ఞాత శిశువుల్ని పోగొట్టుకొన్నా తన తల్లి మళ్ళీ తమర్ని కననే కంది. భూమిమీద రైతు చూపే ఆప్యాయతకూడా అంతేకాబోలు.

మంచివాళ్ళో, చెడ్డవాళ్ళో తన సంతానం అంటూ వుండాలి. ఆ సంతానాశ భగ్నం అవుతున్నా మనుష్యుడు నిర్వికారంగా పునఃకల్పన చేస్తూనే వున్నాడు. పంట రాకున్నా, వచ్చినా భూమిమీదకూడా చాకిరీ అలాగే చేస్తున్నాడేమో. అందుకేనేమో భూమితో రైతుప్రాణం లంకెపడివుండడం?

పెద్ద వ్యవసాయాల్ని గురించి తానన్ని పెద్దకబుర్లు చెప్తున్నా, అజ్ఞాతంగా తన మనస్సును బిగించిపడుతున్న సూత్రా లవేనేమో, రంగయ్య మనస్సు అనేక ఆలోచనలతో ఉద్వేలితం అవుతూంది.

చేతులన్నీ కాయలయినాయి. పొలం బాగడింది. పిల్లలు సుఖపడతారని ఆ దేము డెంత మురిసినాడే-యని తల్లి దీర్ఘంతీసింది.

ఆమె తానెన్నడో కాపురానికి వచ్చిననాటినుంచీ పెట్టుకొన్న ఆశల్నీ పడ్డ భయాల్నీ జ్ఞప్తికి తెచ్చుకొని, తెచ్చుకొని ఏడుస్తూంది. ఆ జ్ఞాపకాల చుట్టూనే రంగయ్య ఆలోచనలు అలంగం తొక్కుతున్నాయి.

మనుష్యుడు పడే శ్రమ అంతా పిల్లలకోసమేనా? శివరామిరెడ్డి భూమిని దేశంకోసం, తన కొడుకు ఆలోచనలు కార్యరూపంలో పెట్టేటందుకోసం తీసుకొంటున్నా నన్నాడు. తన తల్లి బిడ్డలకోసం భూమిని బాగుచేశామంటూంది. అయితే తన అక్కగారు ఉన్ననగ లమ్మేసి వ్యవసాయానికి పెట్టుబడి పెట్టింది. ఆమె ఎవరికోసం చేసింది? ఆమెకు పిల్లలే లేరుగా? వెంకటయ్యను పెళ్ళిచేసుకొనే ఆలోచనతోనే ఆతణ్ణి పనిలోనికి పిలిచిందేమో,

తన అక్క వెంకటయ్యను పెళ్ళిచేసుకోడం ప్రయత్నం గుర్తు రాగానే ఆ సమస్యమీద వారంరోజులక్రితం రాజిరెడ్డితో జరిగిన వాగ్వాదం గుర్తువచ్చింది. ఆతనిని తాను నొప్పించేడు ఆరోజున. అయితే తానారోజున అన్నదానికీ, నేటి ఘటనకూ సంబంధంలేదుగదా యనిపించింది. తనను అవమానకరంగా మాట్లాడినవిషయం రాజిరెడ్డి మామగారితోగాని చెప్పేడేమో, ప్రతీకారంగా ఆయన ఆ భూమికే ఎసరుపెట్టి వుంటాడు.

ఒకర్ని అనుమానించడం అనేది కలగకనే పోవాలి గాని, ఒక్క-పాటు ఆ బీజం పడిందంటే దానిని మట్టుపెట్టడం కష్టం. తుంగనేనా కుళ్ళగించొచ్చు. కాని అనుమానాన్ని పెళ్ళగించలేము.

వీధిలోనున్న నలుగురూ వచ్చేరు. కథుర్లూ ఓదార్పులూ సాగుతున్నాయి. సానుభూతి తెలుపుతున్నారు. అందరికీ ఏదో ఒకటి, అరా మాటతో సమాధానం ఇస్తూనేవున్నాడు. కాని, ఆతని ఆలోచనలు రాజిరెడ్డి ఏం చెప్పివుంటాడా యనే....

"ఎంతచాకిరీ! మరో అయ్య పనికెళ్ళినా బోలెడు సంపాదించేవారు కాదా?"

"ఒక్క-రోజన్నా కడుపునిండ తిండివుందా?"

"ఏభయ్యేళ్ళనుంచి చేస్తున్న కొంద్ర."

"కాస్త పచ్చగావుంటే రెడ్లు కళ్ళల్లో నిప్పులోసుకుంటారు. ఎప్పుడూ అంతే."

"ఆ పదెకరాలే లోటొచ్చాయా? అంత దరిద్రంలో వున్నారా? వెయ్యెకరాలూ చాలలేదా?"

"ఏకాలానికేం వాస్తుందో ఎవరు చెప్పగలరు?"

"కర్మ కాకపోతే .."

ఆర్ధిక సూత్రాలూ, సమాజదాస్యం నుంచి అధ్యాత్మిక సందేహాల వరకూ గకరకాల కారణాలూ- సమాధానాలుగా గ్రామీణుల ఓదార్పుల్లో దొర్లిపోతున్నాయి. వీధిచివరి పెద్రమ్మ ఏదో సందుచూసుకొని, రెండో మనిషి చెవినిపడకుండా వీరమ్మచెవిలో ఒక నూతనకారణాన్ని పడేసింది.

"ఏదో తప్పు జరిగిపోయింది. కాయమని కాళ్ళమీద పడండి, అపరాధం ఇచ్చుకోండి."

చేసిన తప్పేమిటో, అపరాధం ఇచ్చుకోవడం ఏమిటో వీరమ్మకు మొదట అర్థంకాలేదు. తెరచిననోరు తెరచినట్లే వెర్రెమ్మవంక ప్రశ్నార్థకంగా చూసింది.

"అదేనే. అది."

అదేమిటో చెప్పకపోయినా సత్తెమ్మవున్న గదివైపు ఆమె చూసిన చూపూ, ఆమె చేసిన అభినయమూ 'అది' ఏమిటో చెప్పేయి. వీరమ్మకు కటికచీకట్లో దారి దొరికినట్లనిపించింది.

"అంతేనంటావా ?"

జనం అంతా వెళ్ళిపోయేక వీరమ్మ దుఃఖపుధూకుడంతా కూతురు మీదికి తిరిగింది.

"దీనిచలవే. అప్రతిష్ఠ ఆ మహారాజు చెవికంటా వెళ్ళింది. లేకుంటే ఇన్నేళ్ళనుంచి లేని భూమి ఆలోచన ఇప్పుడే ఎందుకురావాలి ?"

ఒక్కొక్కమాటే అంటున్నకొద్దీ ఆ విశ్వాసంకూడా బలపడుతూ వచ్చింది.

"ఆయన ధర్మరాజు. తండ్రిలాంటివాడు."

రంగయ్యకూడా ఔనేమోననిపించేటంత విస్తృతంగా శివరామిరెడ్డి యోగ్యతల్ని వీరమ్మ వర్ణించింది. ఇచ్చుకోలేమన్న రైతులకు ఆయన ఎన్నోమాట్లు శిస్తుమాఫ్‌చేసేడు. యుద్ధంరోజుల్లో ఎందరికో డబ్బు ఇప్పించేడు. రెండేళ్ళక్రితం ఎరువును చేలోకి తోలించేసి ఇంతవరకూ డబ్బుపుచ్చుకోలేదు.* ఇంట్లో ఎరువా ఏమన్నానా ? కంపెనీ ఎరువులు, పెద్దపులి

* రెండో ప్రపంచయుద్ధం రోజుల్లో అధికోత్పత్తి కార్యక్రమంలో నిజాం ప్రభుత్వం ఎరువుల వాడకాన్ని రైతుల్లో ప్రోత్సహించడానికి పూనుకుంది. నాలుగోవంతు ధరతగ్గించి దీర్ఘకాల వాయిదాలమీద చెల్లగట్టే సౌకర్యంతో తక్కావీ ఎరువులు సరఫరాచేసింది. కాని, అలవాటులేని రైతాంగం వాటిని తీసుకోలేదు. ప్రభుత్వోద్యోగులు కోటాప్రకారం ఎరువులు బస్తాలు తెచ్చి గ్రామ చావడుల్లో పడేసి. చేలల్లో చిమ్మివేసి అప్పులుమాత్రం రైతులపేర వ్రాసుకుపోయేరు. మొదటి నిర్ణయం ప్రకారం అయిదారేళ్ళవరకూ ప్రభుత్వం తక్కావీ ఎరువుల అప్పుసంగతి కదపలేదు. అది అప్పుఅనే సంగతే రైతులు మరచిపోయేరు.

పేరంటానికి పెట్టుకుందట. నిజాం సర్కారు అంత ఖర్చుచేసి ఎరువులు రైతుల కిచ్చేస్తుందా, దొర రైతుల లాభంకోసం తన చేతిడబ్బే ఇచ్చు కొన్నాడో, ఏదో చిట్కావేసి సర్కారుచేత ఇప్పించేడో. అంత మంచి వాడు తమభూమిని అడిగేదంటే వెనక్కాల రాజిరెడ్డి చాడీకోరుతనం ప్రోత్సాహం వుండకపోదనే రంగయ్యకు గట్టిగా అనిపించింది. అక్కగారి అపరాధాని కిది ప్రతీకారచర్య అంటున్న తల్లిమాటమీద విశ్వాసం లేక పోయినా, కలిస్తే అదీ ఒక కారణం అయితే అయివుండొచ్చు ననిపించింది.

తాను ఏమన్నా కూతురు నిశ్శబ్దంగా వూరుకోవడం చూసినకొద్దీ వీరమ్మకు ధైర్యం బలపడింది. తిట్టింది.

"దీనిపోత్రం బొగ్గులుగానూ...."

సత్తెమ్మ దానికీ ఏమీ అనలేదు.

తమ్ముడు దొరదగ్గిర జరిగిన సంభాషణను వివరిస్తుంటే వాకిట్లోకి వచ్చి స్తంభాన్ని జేరబడి నిల్చుంది. ఒక్కపలుకుకూడా ఆడకుండా అన్నీ వింది. ఆమె ఎవరినీ ఓదార్చలేదు. ఒకరి ఓదార్పుల్ని వినిపించుకోలేదు. వచ్చిన జనం తోట పెంచడానికై సత్తెమ్మపడిన కష్టాన్నిచెప్తూ ఆమె ముఖంకేసి చూచినప్పుడుకూడా ఆమె ఏమీ అనలేదు.

ఇప్పుడు తల్లి తిడుతున్నా ఆమె కదలలేదు. అత్తగారి మాటలు కోడలికే కష్టం అనిపించేయి. ఎదుటినుంచి తీసుకుపోదామని వచ్చి చేయి పట్టుకొంది.

"లోపలికి పోదాం రాండి."

సత్తెమ్మ మాట్లాడనూలేదు. కదలనూలేదు. పరధ్యానంగానే మరదలు చేయి విడిపించుకొంది.

"ఇంటా వంటా లేని పని చేస్తివే కూతరా! తింటూ తింటున్న కూట్లో మన్నోస్తివే తల్లీ! ఎటువంటికొంప కెటువంటి చిచ్చుతెస్తివే!"

కూతురు ఏమీ అనడంలేదనే ధైర్యం చిక్కినకొద్దీ వీరమ్మ ఆమెవైపు దేకుతూంది. అనేక కోణాలనుంచి అనేక కొత్త కొత్త మాటలతో తిడుతూంది.

తల్లి దగ్గరకు వచ్చినా సత్తెమ్మ కదలలేదు. చివర కామె కాళ్ళకు తగిలేటట్లు వచ్చింది.

"పాపం వూరికెనే పోతుందా?"

అది శాపమో, అనుతాపమో, సత్తెమ్మ నోట అప్రయత్నంగా వచ్చేసింది.

"పాపం చేసింది నేనూ, చుట్టుకునేది మిమ్మల్నినా?"

తల్లి అంటున్న మాటల్లో విశ్వాసం లేకపోయినా రంగయ్య అక్కగారి మాటలకు ఉక్రోషపడ్డాడు. ఈ ఉత్పాతం అంతా రాజిరెడ్డి చెప్పిన ఏదో మాటల ఫలితం అయి వుంటుందని అనిపిస్తూంది. కాని పైకి చెప్పలేడు. తనమాటే ఇంతతెచ్చిం దని నలుగురికీ తెలిసిపోవడంకన్న. నెపం వేరొకరిమీదికి పోవడంలో తృప్తి.

సత్తెమ్మ మాటలు ఆ తృప్తిమీద దెబ్బతీసేయి. కోపం వచ్చింది. కాని గట్టిగా ఏమీ అనలేకపోయేడు. గొణిగేడు.

"చేసింది చెప్తే ఉక్రోషం."

తల్లి అన్నితిట్టినా మాట్లాడని సత్తెమ్మ తమ్ముడు గొణుగుడికి మండి పడింది.

"ముండల్లే నామీద పడి ఏడవకపోతే అక్కడే అదేదో ఏడవక పోయావూ. వెధవచదువు వెలిగించేవు. ముసలిపీనుగుల వెనక్కాల తాళం వేయడానికి."

సత్తెమ్మ ఒక్కక్షణంకూడా అక్కడ నిలబడలేదు. వీరమ్మ నోరుతెరచి, కూతురు పోయినవైపే చూసింది.

* * *

కొడుకును వేరేపిలిచి తల్లి తన ప్రతిపాదనను ముందుపెట్టింది. కొడుకు దానికి వొప్పుకొంటాడనే ధైర్యం ఆమెకు లేదు. అయినా అంత కన్న ఏం చెయ్యగలుగుతారో ఆమెకు అర్థంకాలేదు.

రంగయ్య కాలేజీలో చేరినప్పటినుంచీ ఇటువంటివాటిని వ్యతిరేకిస్తు న్నాడు. చట్టంలో ఇల్లాంటివి పుచ్చుకోకూడదనీ, ఇవ్వకూడదనీ వుంద న్నాడు. కాని ఆ పొలాన్ని కాపాడుకొనేటందుకు చట్టంలో లేకపోయినా దానికి విరుద్ధంగా అయినాసరే దొరకి అపరాధం చెల్లించాలని ఆమె అభిప్రాయం.

సత్తెమ్మ తన శారీరకావసరాలకు లొంగిపోవడం ఒక అపరాధం. అందులో విధవరాలయివుండీ, ఆ తప్పు చేసినందుకు దొరకి అపరాధం చెల్లించుకోవాలి.

ఎవరింట్లోనైనా బిడ్డ పుట్టితే, పెళ్ళి జరిగితే, పిల్ల కాపురాని కెళ్ళినా, కోడలు ఇంటికివచ్చినా, చిన్న మాటా మాటా అనుకొన్నా పేచీపడి సఖ్య పడాలనుకొన్నా దొరకి ఆపరాధమో, బహుమానమో, నజరానాయో రూపం ఏదయితేనేం, పేరు ఏదయితేనేం కొంత రుసుం చెల్లించుకోవాలి.

దొర కూతురు పెళ్ళయితే గొల్లరత్తాలు మందకో గొర్రె నిచ్చేడు. మంగలివెంకాయి ఎవర్తెనో లేవదీసుకొచ్చినందుకు పాతికరూపాయలు అపరాధం దొర కిచ్చుకున్నాడు. ఇల్లాగే ప్రతి ఇల్లూ ఏదో రూపేణా, ఎంతో కొంత ఇస్తూనే వున్నారు.

అల్లా ఇవ్వకుంటే ఎన్నోచిక్కులు. ఏదో సమయంలో దెబ్బలు తగులుతాయి, పోలీసుస్టేషన్ల కీడుస్తారు. కేసులు వస్తాయి. బలాత్కారంగా వసూలుచేయడం ఎల్లాగూ మానరు. పైగా తిట్లూ, తన్నులూ కొసరు. అందుచేత పల్లెటూళ్ళలో ఎవ్వరూ ఈ అనువాయితీని తప్పించడానికి ప్రయత్నం చెయ్యరు.

దొరపెట్టించిన బడిలో కొడుకును చేర్పించినప్పుడు రంగయ్య తండ్రి స్వయంగా బుడ్డెడు వెన్నకాచిననెయ్యి ఇచ్చివచ్చేడు. కాలేజీలో చేరేముందు ఆతడే స్వయంగా ఇచ్చివచ్చేడు.

కాని కాలేజీలో చేరేక ఈ కట్నాలు చట్టవిరుద్ధమని రంగయ్య తెలుసుకొన్నాడు. వాటికి వ్యతిరేకంగా ఉపన్యాసాలు ఇచ్చేడు. వాటిని కాలేజీల్లోనే చాలమంది వ్యతిరేకించేవా రుండేవారు. అతన్ని బలపరిచేవారూ చాలమంది కనబడ్డారు. అనేకమంది దొరల బిడ్డలూ, జమీందార్ల సంతానమూ తాము వూళ్ళలోకి వెళ్ళేక ఈ దురన్యాయపు వసూళ్ళని కట్టిపెట్టించేస్తామన్నారు. ప్రమాణాలుకూడా చేసినవాళ్లున్నారు. కొంతరు ఈ ఆలోచనలను ఎగతాళీ చేసేరు. భూమి అమ్మితేనూ, కొంటేనూ స్టాంపుఫీజు ఇవ్వడంలాంటిదే దొరలకిచ్చే రుసుమూనంటారు వాళ్లు. స్కూలులోను, కాలేజీలోనూ కొత్తగా చేరేటప్పు డిచ్చుకొనే ఎంట్రన్సు ఫీజుమాటేమిటని నిలదీసేరు. కాని, వారయినా ఏ సంబంధంలేని దొరలకి రుసుం ఎందుకివ్వాలంటే చెప్పలేకపోయారు. ఆచారం! దానికి మారుసమాధానంలేదు. సమాజంలో ఆచారానికి చట్టాని కున్నదానికన్న బలం ఎక్కువ.

వీటిమీద తాము రోజులతరబడి చర్చలు జరిపేరు. వానికెన్నడూ తెగూతెంపూ వుండేదికాదు. ఇప్పుడవన్నీ గుర్తువచ్చేయి. ఆ జ్ఞాపకాలూ, తనవాదనలూ తరుముకువస్తూంటే రంగయ్య తల్లి ప్రతిపాదన నంగీకరించలేకపోయేడు. పైగా ఈ ఆపదకు తానూహిస్తున్న కారణంవేరు. తన అక్క చేసిన తప్పు దీనికి కారణం అనిపించడంలేదు. రాజిరెడ్డి ఏవోచాడీలు చెప్పేడు. అసలు కారణం వేరేవుండగా అక్క ఏదో పెళ్ళిచేసుకుంటానన్నదని అపరాధం చెల్లించబోతే ఏమౌతుంది?

కాని, తన మనస్సులోని ఆలోచనను బయట పెట్టలేదు. అపరాధం పేరు ఎత్తవద్దని తల్లిని మందలించేడు. ఆమె ఏడ్చింది.

"పొలం పోవలసిందేనా?"

'కోర్టులున్నాయిలే' యంటూ కొడుకు ఆమెకు ధైర్యం చెప్పబోయేడు. నిజానికి కోర్టులవలన పని ఏమన్నా జరుగుతుందంటే అతనికే నమ్మకం లేదు. కనీసం గట్టిగా ఎదుర్కొంటారనీ, భూమి ఓ పట్టాన స్వాధీనం కాదనీతోస్తే దొర వూరుకోవచ్చునని ఒకవేపున అనిపిస్తూంది. కొండెపు మాటలకు తన్ను బెదరించేదేమో, కాని, ఆలాగని వూరుకోలేడు. పోయి దీని అంతేదో చూడాలి.

"షికాయతుకు ఎంతో డబ్బుకావాలి. దొరలతో పేచీ. నెగ్గుతామనే ధైర్యం ఏమిటి? ఖర్చులకయ్యే డబ్బు అపరాధంగా చెల్లిస్తే? సఖ్యతా వుంటుంది. పొలమూ పోదు."

తల్లి సలహాను రంగయ్య లెక్కచెయ్యలేదు.

వెంటనే భార్య వడ్డించగా నాలుగు మెతుకులు ఆదరాబాదరా కొరికి నల్లగొండపోయి బస్సు నందుకోడానికి దండుబాటకి వెళ్ళేడు.

వీరమ్మ వంటింట్లో పాలదాలి సమీపంలో పాతిపెట్టిన పిడత పైకి తీసింది. అయిదు రూపాయలు కొంగున మూటకట్టుకొంది. దుఃఖభారంతో కాళ్లు ఈడ్చుకొంటూ కిష్టయ్య ఇంటికి బయల్దేరింది.

కిష్టయ్య రెడ్డిగారి శేరీదారు. రేపు పొలం స్వాధీనం చేసుకోడానికి రావలసిన మనిషి. దొరవద్ద పని జరగాలంటే అతనికి తాంబూలం ఇవ్వడం అవసరమని వీరమ్మకు అనుభవజ్ఞానం.

అయిదు రూపాయలూ రొంటినెట్టుకొని కిష్టయ్య మీసాలు సవరించుకొన్నాడు. నిరుడు తాను వూళ్ళోంచి పారిపోవలసి వచ్చిన స్థితిని గుర్తుచేసికొని, ఆనాటి తిరుగుబాటులో వెంకటయ్య ఎంత బాధ్యుడో జ్ఞాపకం చేసేడు.

వీరమ్మ లబలబ లాడింది.

ఇంటికి వచ్చేసరికి గుమ్మంలో కూతురు కనబడింది. అయిదు రూపాయలూ జ్ఞాపకంవచ్చి మండిపోయింది. ఎంతో కష్టపడి కూడబెట్టిన డబ్బు నీళ్ళల్లా ఖర్చు చేయవలసిన స్థితి కలిగించినందుకు తిట్టింది.

"మారెమ్మ !"

సత్తెమ్మ తల్లిని నమిలేసేలా చూసింది. అంతే. ఏమీ అనలేదు.



# ఎనిమిదో ప్రకరణం

చేతిలోని సిగరెట్టు చేతిలోనే నుసి అయిపోతూంటే ఆ ధ్యాసైనా లేకుండా రాజిరెడ్డి ఏవేవో ఆలోచనల్లో కొట్టుకుపోతూ అలాగే కూర్చుండి పోయేడు. సత్తెమ్మ ప్రశ్నకి సమాధానం ఏమిస్తాడు ?

నిజానికి చట్టంలో కౌలుదారులకి రక్షణఅనేది వున్నట్లు కనిపిస్తున్నా ఆచరణలోకి రాకుండా దానికెన్నో మినహాయింపులు. ఏభయ్యరవయ్యేళ్ళ పాటుకి ఏగాని నిలువనివ్వని ప్రభుత్వం. ఈ అరణ్య రోదనానికి ఆలనా పాలనా చూపేశక్తి ఎవరికుంది ?

కాని, ఆ సమస్య భయంకర స్వరూపాన్ని ఎరగని సుమిత్రా, ఎరిగి వున్నా ఏం చెయ్యాలో తెలియని సత్తెమ్మాకూడా ఆతని సమాధానంకోసం ఎదురు చూస్తున్నారు. ఎదుటవున్న కుర్చీ చేతిమీద అనుకొని కూర్చుని సుమిత్ర నిరీక్షిస్తూంది. తన ప్రశ్నకు సమాధానం వారి ముఖాలలో వెతుకు తున్నట్లు వారిని మార్చిమార్చి చూస్తూంది.

పెద్దదొర తమ భూమిని కావాలన్నారనీ, దానికి కారణం తాను పెళ్ళి చేసుకోవాలనుకోవడమేననీ తల్లీ, తమ్ముళ్ళ నోటవిన్నాక ఆమె కోపం పట్టలేకపోయింది. భూమిని అడిగేడన్న దానికన్న ఆ క్షణంలో దానికి చెప్పిన కారణంమీదనే ఆమె ఎంతో ఆవేశపడింది. పెళ్ళి చేసుకోవా లనుకోడంలో తప్పేమిటో, దాని కాయన కోపగించవలసిన పనేమిటో, ఆ కోపంతో తమ భూమిని ఏ హక్కుతో ఇమ్మంటున్నారో స్వయంగా పెద్ద రెడ్డిగారినే అడిగెయ్యాలని బయలుదేరింది. మరొకప్పుడైతే ఆ ప్రశ్నలు

అడగగలిగేదేకాదు. అందులో పెద్దరెడ్డిని స్వయముగా అడగడం. కాని ఇప్పు డామె కా భయమూలేదు. సంకోచమూలేదు. రెడ్డి ఇంట్లో లేక పోయాడుగాని ఆమె అడిగివుండేదే. ఆయన లేకపోవడంచేత ఆయన కూతుర్ని అడిగింది. సుమిత్రతోనూ, ఆమె భర్తతోనూ తనకున్న పరిచయాన్నిపట్టి కొంచెం దురుసుగానే అడిగింది. ఆ దంపతులతోడి సంభాషణలో దొరకు ఆ భూమిమీద కన్ను పడడానికిగల కారణం తాను పెళ్ళి చేసుకోవాలనుకోడం ఎంతమాత్రం కాదని తెలిసిపోయింది. అంతవరకూ ఆమె మనస్సులో అడుగున పడివున్న భూమిపై తమకుగల హక్కు సమస్య ఇప్పుడు అగ్రస్థానానికి వచ్చింది. దానిలో తమ కుటుంబం ఎంత చాకిరీ చేసిందో! తాము ఎంత పెట్టుబడి పెట్టేరో! తమ జీవితంలో ఒకభాగం అయిపోయిన ఆ భూమిని అడిగేహక్కు దొర కెక్కడిది,

రెండు తరాలనుంచి తమరాభూమి పండించుకు తింటున్నారు. పన్నులు కట్టుకొంటున్నారు. అది తమదే ననుకొంటున్నారు. తమ రొక్కరేకాదు. ఊరందరిదీ అదే అభిప్రాయం.

ఆ భూమిని ఇప్పుడున్న స్థితికి తేవడంలో తాను ఎంతో కష్టపడింది. ఎంతో డబ్బు పెట్టింది. అదంతా లెక్కలేనట్టూ, తమ జీవితాలకు విలువే లేనట్లూ, పట్టాకాగితం ఒక్కచే ప్రపంచం అన్నట్లూ మాట్లాడితే?

రాజిరెడ్డికి ఏం చెప్పాలో అర్థంకాలేదు. ఏం అనగలడు? నిజంచేత ఆతనికి సత్తెమ్మమీద సానుభూతి వుంది. ఆమె మీదనేకాదు. ఆమెలాగ సంఘవ్యవస్థ కక్కుల చక్రంలో నలిగిపోతున్న వాళ్ళందరిమీదా కూడా అభిమానం వుంది. ఒక్కమారు తిరగబడితే తప్ప ఆ వెట్టిచాకిరీలూ, హింసలూ, దోపిడీలు వదలవని ఆతడు గట్టిగా నమ్ముతాడు.

కాని, ఆతని అభిప్రాయాలు కార్యరూపంలోకి వస్తే నలిగిపోయేవాళ్లు తన సన్నిహిత బంధువులే. ఏడాది క్రితం వెట్టిచాకిరీ చెయ్యబోమని

నలుగురూ కట్టుకట్టేసరికి తన మామగారివాళ్లు ఎంత ఇబ్బంది పడ్డారో విన్నప్పుడు సంతోషం కలిగినా రెండోవేపున అయ్యో అనిపించకపోలేదు. వండుకున్న తిండి ఏలాగో పెట్టుకుతిన్నా ఆకుతీసి పారేసే దిక్కు లేక పోయింది. మంచా లున్నాయి. పరుపు లున్నాయి. దుప్ప ట్లున్నాయి. కాని కళ్లు మూసుకొని పడుక్కోవాలనుకొంటే పక్కవేసేటందుకు మనిషి లేకపోయె. దొడ్డినిండా పశువులున్నాయి. పిల్లలకి పాలువచ్చే దారి లేక పోయె. ఒక్కరికీ ఏం చెయ్యాలో తెలియదు. ఏ పనికి ఏం ఇవ్వాలో ఒక్కళ్ళకీ అర్థంకాదు.

అనాడు తాము పడిన ఇబ్బందుల్ని ఏ కరువుపెట్టి వెట్టి వ్యతిరేకతని తెలుగు మీరిపోవడంగా వర్ణించి అత్తవారివాళ్లు నిందిస్తూంటే రాజిరెడ్డికి ఏం సమాధానం చెప్పాలో అర్థం అయ్యేదికాదు. పైకి ఏమీ అనక పోయినా మనసులో మాత్రం వుండేది. ఏం వాళ్ళెందుకు వుట్టినే చాకిరీ చెయ్యా లనిపించేది. కాని, రెండోవేపున డబ్బు అడిగి తీసుకొని పని ఎందుకు చెయ్యకూడదు అనీ తోచేది. అంత సందిగ్ధతలోనూ అతని సానుభూతి మాత్రం ప్రజలవేపే వుంది.

ఇప్పుడూ అదే స్థితి. సానుభూతి సత్తెమ్మమీద. ఆమె ఆ భూమిని బాగుచెయ్యడానికి చూపిన తాదాత్మ్యం ఆతడు కళ్ళారా చూసేడు. అంత కంటె భూమిమీద మరోహక్కు ఏం కావాలి? ఆ భూమి వుందో లేదో, ఎక్కడుందో, ఎల్లావుందో ఎరగని మామగారు దానిని కావాలనడం బాగాలే దనిపించింది. "దున్నేవాళ్ళకే భూమిమీద హక్కుండాలి."

కాని, ఆ సానుభూతిని తాను ఏవిధంగా చూపగలడు? భూమిని అడగడం న్యాయంకాదని మామగారివద్ద అనగల ధైర్యంలేదు. ఆయనంటే ఒక విధమయిన భక్తీ, భయమూ కూడాను.

చిన్న బావమరదివద్ద చనువూవుంది. తన ఈడువాడు గనక పరి చయమూవుంది. కాని, ఆయన ఆలోచన వేరు. యంత్రాలతో పెద్దయెత్తున

వ్యవసాయం సాగించాలనే ప్రయత్నంలో వున్నాడు. దున్నేవాడికే భూమి హక్కు వుండాలనేటట్లయితే ఇప్పుడు నాకంటే హక్కుగలవా దెవ్వరూ వుండరన్నాడు.

యంత్రాలతో తాను వేల ఎకరాలు దున్నించగలడు. తనకు పట్టావున్న భూమేకాదు. అడ్డు చెప్పేవాడు లేకపోతే వూళ్ళోదేకాదు చుట్టుప్రక్కల వూళ్ళనికూడా దున్నించెయ్యగలడు. ఆ భూమంతా తనకు రావలసిందే మరి - అన్నాడు.

నిజంగా అంతపనీ చెయ్యగలరు. కాని చెయ్యరు. ఒక్కమారు ఆ పని ప్రారంభిస్తే ఇంక ఆస్తి హక్కు అనేదానికి అవకాశమే లేకుండా పోతుంది. భూమిమీద ఆస్తిహక్కు ఒక్కమారు రద్దు అయ్యాక అది అక్కడే ఆగుతుందని నమ్మకం ఏమిటి ? ఆ భయం లేకపోతే ఏనాడో ఆ పని చేసివుండేవారే.

మానవుడు ఏమవుతాడనే విచారంలేదు. మనం ఏమవుతామనే బాధే. అదే ఇక్కడా ప్రత్యక్షమయింది. దానిని తాను అర్థం చేసుకొన్నాడు. కాని ఆ మాటలు సత్తెమ్మతో ఎల్లా చెప్పగలడు ? తన బావమరది మీదా, మామగారిమీదా తిరుగుబాటుకి ప్రోత్సాహం చెయ్యడం న్యాయం కాదనుకొన్నాడు. అయితే మరి సత్తెమ్మ ప్రశ్నకు సమాధానం ?

భర్తతోడి సాహచర్యంలో పట్టుబడ్డ అభిప్రాయాలూ, సత్తెమ్మ అంటే వున్న మంచి అభిప్రాయములో సుమిత్రకూడా తన ఆత్మబంధువులు ఈ విషయంలో మంచిగా వ్యవహరించడం లేదనుకొంది. కాని, వాళ్ళు ఆత్మ బంధువులు. తండ్రీ, అన్నా, వాళ్ళు తప్పుచేస్తున్నా రనిపించినా, ఎంత సదభిప్రాయంగల మనిషి అయితే మాత్రం సత్తెమ్మవద్ద వాళ్ళని ఏమన గలదు ? అలాగని సమర్థించనూలేదు. సమస్యకు పరిష్కారమార్గం మగడి మీద పడేసి ఎదురు చూస్తూంది. కాని ఆయనకు కూడా తెగినట్లు కనబడ్డంలేదు.

మెట్లమీద ఎవరో గబగబా ఎక్కివస్తున్న చప్పుడయి సుమిత్ర కుర్చీ చేతిమీదనుంచి అప్రయత్నంగానే లేచి నిలబడింది. ఇంత చనువుగా వచ్చేవా రెవరా యన్నట్లు ఆమె చూపులు ఆ వైపే తిరిగాయి. మరు క్షణంలో తల కనబడింది. గుర్తుపట్టింది. తన సమస్య తేలిపోయినంత వుత్సాహం గొంతులో ప్రతిధ్వనించింది.

"అరుగో చిన్నన్నయ్యే వచ్చేరు. అయన్నే అడుగు...."

ఏమిటీ అడగడం అంటూ ఆతడు మరుక్షణంలో గదిలో అడుగు పెట్టేడు. కుర్చీ ఒకటి లాక్కు-కూర్చుని, రెండోమారు తన ప్రశ్నను రెట్టించేవరకూ ఆ గదిలో మరొక మనిషికూడ వున్నదని గుర్తించలేదు. గుర్తించినాక అతనినోట మరోమాట రానూలేదు. ఉదాసీనంగా కనబడు తున్న సత్తెమ్మ ముఖం ఆతని నాకర్షించింది.

సన్నగా సలాకులావున్నా ఆ విగ్రహంలో దీప్తివుంది. పెద్ద పెద్ద కళ్లు ఆ దీప్తికి దివిటీ పడుతూంటే, ఆ సౌందర్యం ముందు ఆతడు చాల సేపటివరకూ నిర్వాక్కుడుగా కూర్చుండిపోయేడు.

తన చెల్లెలి ముందర ఎవరో ముక్కు- మొగం ఎరగని పరాయి స్త్రీ వేపు రెప్పార్పకుండా చూడడం సంకోచం అనిపించింది. చూపులు తిప్పు కొన్నాడు. కాని, దానికి ఎంత మనోనిగ్రహం చూపవలసి వచ్చిందో ఆతని అప్పటి మొగమే చెప్పింది.

తన వైపు రెప్పార్పకుండా చూడడం సత్తెమ్మకు చాల కోపం తెప్పిం చింది. అసహ్యమూ కలిగింది. రఘునందనుణ్ణి గురించి ఆమె కేమీ తెలియదు. దొర కొడుకని మాత్రమే ఆతనిని గురించి ఆమెకు తెలిసిన దల్లా. దొరలయెడా, వారి నీతి నియమాలయెడా ఆమెకు తీవ్రమైన అసహ్యం వుంది. వారి అవినీతికర చర్యల కథలు ఆమె బహు ముఖాల అసంఖ్యాకంగా వింది. రఘునందనుడి అన్న రమణారెడ్డి చాకలి మంగ మ్మని లొంగదీసుకొనే ప్రయత్నంలో కాపురంలో నిప్పులు పోసుకొన్న

కథ వూళ్లో ఇంకా మరిచిపోలేదు. రఘునందనుడు ఆ అన్నకు తమ్ముడే కాదా, పైగా భార్య పోయింది. ఆయన చూపులలో కేవలం ఆశ్చర్యం. దిగ్భ్రమా మాత్రమే కనబడుతూన్నా అవి తన రూపు రేఖలకు జోహారు లిస్తున్నట్లు కనబడుతూనే వుంది. సత్తెమ్మ మనస్సులోనే చిట చిట లాడింది. తల తిప్పుకొంది. ఆ చిట చిటలో చరాలున మేడదిగి పోయేదే. కాని, సుమిత్ర వేసిన ప్రశ్నకూ, ఇచ్చిన సలహాకూ సమాధానం ఇచ్చినా ఇవ్వకపోయినా లేచిపోవడం మర్యాదకాదు. కనక నిలబడింది.

"అడగవమ్మా! అసలు మనిషి వచ్చేడు."

తన అన్నను కూడా హెచ్చరించింది.

"ఆవిడేదో అడుగుతూంది. చెప్పు."

రఘునందనుడు ఆ ప్రశ్నకోసం ఎదురు చూసేడు. కాని సత్తెమ్మ ఏమీ అడగలేదు.

ఈ మారు ఆ ప్రశ్న ఏమిటో సుమిత్రే చెప్పింది. ఏం చెప్తావన్నట్లు సత్తెమ్మ అతని చూపుల్ని నిర్భయంగా ఎదుర్కొంది.

రఘునందనుడు ఏమీ సమాధానం ఇవ్వలేదు. ఏం ఇవ్వాలో తోచ లేదు. తన భూమిని గురించి ఈమెకు సమాధానం ఎందుకివ్వాలి?

ఎందుకివ్వాలో కూడా సుమిత్రే బయట పెట్టింది.

"ఆ భూమి ఎందుకూ కొరగానిది. అందుకే తాతగారు గాలికిపోయే పేలాపిండిలా కృష్ణార్పణం అన్నారు. ఇప్పుడది బాగుపడింది...."

తన తాతగారి పనిని అంత కించపరుస్తూ మాట్లాడ్డం రఘునందనుడికి కష్టం అనిపించింది. అందులో తల చెల్లెలే అంటూంది. అదీ ఈ పరాయి పడుచువద్ద. ఆ భూమిసమస్యతో ఆమెకే సంబంధం వుండడంకూడా కొంత చికాకు కలిగించింది. చెల్లెలివంక రూక్షణంగా చూసేడు.

"తాతగారు చేసిన తప్పు దిద్దుకుందాం."

ఆతని అభిప్రాయం అర్థంకాక సుమిత్ర మగని ముఖం చూసింది. బావకు కోపం వచ్చిందని గ్రహించి రాజిరెడ్డి అందుకొన్నాడు.

"పెద్దలు చేసినపనికి పేర్లు పెట్టడం మంచిదికాదు. కాని, మనం చేసేపనులు ఆ అవహేళనకు కారణం కానీయకూడదు."

అది చెల్లెలిని మందలించడమో, తనను తప్పుపట్టడమో రఘునంద నునికి అర్థంకాలేదు.

"పేరెట్టండి. ధర ఇచ్చేస్తా. కొరగాని దిచ్చినారనే అప్రతిష్ఠ ఎందుకు ?"

పరిస్థితుల్ని మరింత పాడుచేశానని సుమిత్ర గతుక్కుమంది. రాజిరెడ్డి కూడా గ్రహించేడు. కాని, ఇంతవరకూ వచ్చాక వెనక్కి గుంజడం ఏలాగో అర్థంకాలేదు.

సత్తెమ్మ సమాధానం ఇచ్చింది.

"భూమికి ఖరీదు కడతారు. కాని, దానిని నేడున్న దశకు తేవడంలో చేసిన కష్టానికి ఖరీదు ఏం కడతారు ?"

రాజిరెడ్డికి ఆ మాట వినగనే మహాకవి శ్రీశ్రీ గీతంఒకటి గుర్తు వచ్చింది. సన్నగా ఆలాపించేడు.

పొలాలనన్నీ
హలాలదున్నీ
ఇలాతలంలో హేమంపిండగ
జగానికంతా సౌఖ్యం నిండగ
విరామ మెరుగక పరిశ్రమించే
బలం ధరిత్రికి బలిగావించే
కర్షకవీరుల కాయంనిండా
కాలువకట్టే ఘర్మజలానికి

ఘర్మజలానికి
ధర్మజలానికి
ఘర్మజలానికి
ఖరీదు లేదోయ్.॥

చెల్లెలి మగని మధురకంఠస్వరంతో మరుగునపడిన అభిమానం ఘర్మజలం ఖరీదుతో మళ్ళీ తల ఎత్తింది....

నెమ్మదిగా లేచి వెళ్ళిపోయేడు.



# తొమ్మిదో ప్రకరణం

రంగయ్య నల్లగొండ చేరేసరికే బాగా రాత్రి అయింది. బస్సు దిగేడు. పరిచితమ్ములైన వీధులే పరధ్యానంలో అపరిచితంగా తోస్తూంటే, అలవాటయిన కాళ్ళు వాటంతటవే అత్తవారింటికి చేర్చేయి. ఆ వేళ కప్పుడే అంతా భోజనాలు చేసేసి. వాకిట్లో మంచాలమీద కబుర్లు చెప్పుకొంటున్నారు

అల్లుణ్ణి ఆ వేళప్పుడు ఆ ఆకారంలోచూసి మాణిక్యమ్మ కంగారు పడింది. వచ్చింది ఆత డొక్కడేనని తెలుసుకొన్నాక ఆలోచనలో పడింది. ముఖం, మాటలూ చూసేక ఏదో విశేషం వుందనుకొంది. మనస్సులో ఎంత ఆదుర్దావున్నా చంపుకొని ఆతిథ్యం ఇచ్చింది. కోడలికి వంట పురమాయించి, చిన్నకూతుర్ని బావగారికి కాళ్ళ కడుక్కునేందుకు నీళ్ళ తెమ్మని పురమాయించింది. చిన్న బావమరిది మంచందిగి కూర్చోడానికి చోటు యిచ్చేడు.

ఇంటిల్లిపాదీ తనకోసం చూపుతున్న శ్రద్ధాసక్తుల్ని చూసేసరికి రంగయ్య మనస్సు ఊరటపడింది.

మాణిక్యమ్మ కొడుకు చేతికి విసినకర్ర యిస్తూ ఉమ్మడిగా కుశలప్రశ్న వేసింది.

"అంతా మంచేనా ?"

కాళ్ళ చేతులు కడుక్కుని, ఇన్ని మంచినీళ్ళు త్రాగి సేద తీరేక పేరు పేరు వరసన క్షేమం తెలుసుకొంది.

"వదినగారు తిరుగుతున్నారా ? కోడలు పిల్ల ఏం చేస్తూంది ? సూరమ్మ బాగుందా ? దాన్నికూడా ఓ మారు తోలుకు రాకపోయావా, పోనీ ..."

అందరూ బాగున్నారు. మరి అనుకోకుండా, ఇంత హఠాత్తుగా ఎందుకు వచ్చినట్లు? ముఖంలో కనిపిస్తున్న నలుగుడు ప్రయాణపు బడలిక లాగలేదు. మనస్సులో వ్యధ ఏమిటో? భార్యా భర్తలమధ్య మాట పట్టింపులు రాలేదుగదా యనుకొంది. ఒక్కక్షణం. నాలిక చివరకంటా వచ్చిన ప్రశ్ననే మార్చింది.

ఆమె అడగ దలచిన ప్రశ్నల్ని రంగయ్య ఆమె ముఖంలో చదివేడు. క్షీణస్వరంతో ఆ అడగని ప్రశ్నలకి సమాధానం ఇచ్చేడు. కాని అది సమాధానం కాదు. ఎదురు ప్రశ్న.

కంఠస్వరంలోనే మాణిక్యమ్మ ఆతని నిస్సత్తువనూ, ఆదుర్దానూ గ్రహించింది. మామగారు వూళ్ళో లేరంటే తెల్లబోయాడు. పట్నం వెళ్ళేరంటే గుడ్లు మిటకరించేడు. బస్సుకి రావలసిందే నన్నమాట విని తేరుకొన్నాడు. బస్సువేళ మిగిలిపోలేదా యని పదిమాట్లు ప్రశ్నించేడు.

మామగారికోసం ఆతడు చూపుతున్న ఆదుర్దాను గ్రహించి ఆయన తప్పకుండా ఆ రోజుననే వచ్చి తీరుతారని మాణిక్యమ్మ ధైర్యం చెప్పింది. ఆఖరు బస్సుకూడా వచ్చేవేళ మిగిలింపని వంటింట్లో గిన్నెలుసహా సర్దేసిన సంగతిని తానూ మరచింది.

ఎంత రాత్రి అయినా మామగారు వస్తారనే మాటవిని రంగయ్య తృప్తిపడ్డాడు. పనికుర్రవా డొచ్చి జాలార్లో నీళ్ళు పెట్టేనన్నాడు. వేణ్ణీళ్ళతో స్నానం. కమ్మని గేదె పెరుగుతో భోజనం. ప్రాణము కుదుట పడింది. సామానులేని ఖాళీపడవ సాధారణ కెరటాల్లోకూడా వూగులాడిపోతుంది. పూటువేసిన పడవ తుపానులోకూడా హంసగమనం సాగిస్తుంది. మనుష్యుడుకూడా అంతే. నిండు కడుపుమీద ఆవేశాలు అల్లరి చేయవు. కడుపు నిండేక, ప్రశాంతంగావున్న మనుష్యులమధ్య కూర్చున్నాకా రంగయ్యకు అంతవరకూ తానుపడిన ఆవేదన అనవసరమేమో నని కూడా అనిపించింది.

సావకాశంగా కూర్చున్నా మరల యోగక్షేమాలు. ఈ మారు వివరాలతో కనుక్కొన్నారు. చిన్న బావమరది యిచ్చిన వక్కాకు నములుతూ రంగయ్య తాను వచ్చిన కారణం బయట పెట్టేడు.

నలుగురూ శివరామిరెడ్డికి ఛీత్కారాలు తగిలిస్తూంటే ఆతని మనస్సు తేలికపడింది.

తనవూళ్ళో శ్రోతలకీ, వీళ్ళకీ తేడావుంది. వారంతా తాను పడుతున్న వ్యథ ననేకమార్లు అనుభవించినవాళ్ళే. అనుభవించడమే తప్ప మరో దారి లేదని కుంగిపోయినవాళ్లే. వాళ్ళది సహానుభూతి. చనిపోయిన వాని గుణగణాలు తలచుకొని, శక్తిసామర్థ్యాలు జ్ఞాపకం చేసుకొని, వానిమీద పెట్టుకొన్న ఆశలు చెప్పుకొని ఏడ్చినట్లే వుంటుంది వాళ్ళ ఓదార్పు. అవి సాంత్వనం కలిగించలేవు. తగిలిన గాయాల్ని రేపుతుంటాయిగాని.

కాని, వీళ్ళది ప్రేమతో కూడిన పరాయితనం. తన బాధలో వాళ్ళకి భాగంలేదు. తన కష్టంచూస్తే జాలిమాత్రమే. తనమీద ప్రేమమాత్రమే. శివరామిరెడ్డి తమ వూళ్ళోవాళ్ళకిలాగ వీళ్ళకి దొరకాడు. ఆయనమీద తమ రందరికీవున్న భయమూలేదు. భక్తీలేదు. కనక రంగయ్యమీది ప్రేమాభిమానాలు శివరామిరెడ్డిమీద అసహ్యం రూపంలో బయట పడడానికి భయము, భక్తీ, వేదాంతమూ అవేవీ అడ్డంరాలేదు. విన్నవారు ప్రతి ఒక్కరి కంఠంలో ఆశ్చర్యం, అసహ్యం, క్రోధం మేళవించేయి.

"వాడి దరిద్రం మండిపోనూ."

"ఉన్నవాడికి ఉన్నంతా దరిద్రం."

"వాళ్ళ భూమి నీ కెందుకయ్యా అని గడ్డెట్టేవాళ్ళే లేరా మీవూళ్ళో."

బంధుకోటి అంతాచేరి ఆశ్చర్యార్థకాలూ, అభిమాన వాచకాలు, అభినందన వాక్యాలు పలికి హెచ్చరిస్తూంటే రంగయ్య దుఃఖం మరిచి కుటుంబ గాధను సగర్వంగా చెప్పుకొని పోతున్నాడు. బహుశా తన కుటుంబీకుల

దారిద్ర్యం, పామరత్వం, మోటుతనం గురించి మరొకప్పుడైతే అంత గర్వంగా చెప్పేవాడే కాదేమో.

"ఆ మిట్టపల్లాల చెక్క ఖరీదు ఎంతనికాదు. బహుశా దానిలో చేసిన చాకిరీకి కూలి కడితే ఆ డబ్బుతో ఏ చెరువుక్రిందనో పదెకరాల భూమి వచ్చి వుండేది. చాకిరీ ఒక్కటేనా? ఎంత పెట్టుబడి పెట్టేరు, దానిలో రూపాయికి అణాయేనా వచ్చిందా అంటే అనుమానమే. అసలు విషయం అది కానేకాదు. మా కుటుంబంవాళ్ళ కష్టానికీ, ఓర్పుకూ అది చిహ్నం. అందులో మా రక్తం పోదిపాం. ప్రాణాలు ఎవచల్లేం. మా కుటుంబంలో భాగం అది. దానిని ఇవ్వాలనడం. మా కుటుంబంలోని ఆడవాళ్ళని ఇవ్వాలనడంకన్న తక్కువేం కాదు.

ఆ బోళ్ళపొలం విషయంలో రంగయ్య అంత అభిమానాన్ని ఎన్నడూ ప్రకటించి వుండలేదు. అనేక మాట్లు దానిమీద చేసేఖర్చు బూడిదలో పన్నీరు పొయ్యడమేనని అక్కగారివద్దా అన్నాడు.

బహుశా ఆ భూమి తన కుటుంబపు దారిద్ర్యానికి చిహ్నంగా భావించేడేమో కూడా. ఈ రెండు మూడు నెలలనుంచీ గ్రామంలో వున్నాడు. పొలం పనులు బోలెడు వచ్చేయి. ఇంట్లో వచ్చిన గొడవల్లో సత్తెమ్మ వేనికీ కలగచేసుకోవడం లేదు. తాను వూళ్ళోనే వున్నా ఎప్పుడో ఓమారు షికారుగా వెళ్ళిరావడం తప్ప పొలం పనులన్నీ సరయ్యమీదనే వదిలేసేడు. అన్నింటికీ కూలీల్నే పెట్టవలసి రావడంతో ఖర్చుబాగా తగులుతూంది. ఖర్చులకి చేతిలోంచి డబ్బు వదలడంతో ఆదాయాలు లెక్కచూడ్డం మొదలు పెట్టేడు. జమాఖర్చులు బేరీజు వేసుకొని వ్యవసాయం కిట్టుబాటు కాదని తేల్చుకొన్నాడు. ఎవరికన్నా కౌలు కిచ్చెయ్యాలనే కోరికనుకూడ వెలిబుచ్చేడు. అదంతా ఆతని కిప్పుడు గుర్తు రానేలేదు.

వ్యవసాయం కిట్టుబాటు కాదనీ, ఉన్న భూమిని అమ్మేసి పట్నంలోకి చేరుకోమనీ బంధువులు చాల మార్లు ఆతనికి సలహా యిచ్చేరు.

అయితే ఆ పల్లెటూళ్ళో మెరక భూమికి వచ్చేధర శూన్యం. దానిమీద వచ్చే సొమ్ము దేనికీ చాలదు. అందుచేత ఆదాయం వచ్చినా రాకపోయినా, తనకూ కొంత భూమి అనేది వుందంటే సంఘంలో తనకు నిలకడన్నా వుంటుంది. ఆ వుద్దేశంతోనే ఆతడు అమ్మడంగురించి ఎక్కువ శ్రద్ధా తీసుకోలేదు. ఆ వివరాలన్నీ ఎరిగున్న వాళ్ళకికూడా ఆతని మాటలకి నవ్వు రాలేదు.

ఆ ఆవేశంలో ఆతడు తనకున్న పట్టుదల తీవ్రతను కూడా ప్రకటించేడు.

"ఆయనకు మన సంగతి ఇంకా బోధపడలేదు. మేము వోడ్చిన చెమటా రక్తం కక్కిస్తాగాని వూరికే వొదులుతామా ,"

ఈమారు మాణిక్యమ్మ నవ్వుకుంది. ఘర్షణ వస్తుందంటే వూళ్ళోంచికూడా వెళ్ళిపోయే రకంమనిషి. తనకి నష్టంవచ్చినా వొరగదోసుకు పోతాడు. ఆలాంటివాడు తొడలుచరిచి హుంకారం చేస్తూంటే ఎవరికేనా నవ్వు వస్తుంది. కాని నవ్వడానికి సమయంకాదు. ఉచితమూకాదు. అల్లుడాయె. మాణిక్యమ్మ ఆతని మాటలకు భయం ప్రకటించి అనునయించింది.

"తొందర పడకు. మీ మామగారు వస్తారు. ఆయన చెప్తారుగా. ఏమీ కంగారు అక్కరలేదు."

భయం లేదని పైకిచెప్పినా ఇల్లాంటి విషయాలలో భర్త చెయ్యగలదేమీ వుండదని ఆమెకు తెలుసు. తన ముప్ఫయ్యేళ్ళ కాపురంలోనూ ధనవంతుల శక్తిసామర్ధ్యాలను గురించి ఆమె చాలమాట్లు వింది. సంస్థానంలో చదువు, ఆస్తులు, వుద్యోగాలు కొద్దిమంది యిళ్ళకు మాత్రమే పరిమితం. వాళ్ళకి వ్యతిరేకంగా తీర్పుచెప్పించడం, దానిని అమలు జరిపించడం ఇంచు మించు అసంభవం. దొరలు భూములు లాక్కొని తరిమేస్తే వచ్చి రైతులు తన భర్తతో కష్టాలు చెప్పుకొని సలహా అడగడం ఆమె వింది.

ఒకమారు వచ్చినవాడు-ఈ లోకంమీద విసువుపుట్టి సెలవు పుచ్చుకొంటే తప్ప ఎన్ని ఏళ్లు గడిచినా మళ్ళీ మళ్ళీ వస్తూనే వుంటాడని ఆమె ఎరుగును. కనక యింక అల్లుడు భూమి ఆశ వొదులుకోవలసిందే ననే నిశ్చయం చేసుకొంది. ఏదో ఉత్పాతం వస్తేతప్ప లాభం లేదు ...

మళ్ళీ ఓమారు శివరామిరెడ్డిని తిట్టింది. అల్లుడికి ధైర్యం చెప్పింది.

* * * *

వకీలు గోపాలరావు అల్లుడి కధవిని ఆశా చూపలేదు. ఆవేశ పడనూలేదు. శివరామిరెడ్డిని తిట్టనూలేదు. వకీలుగా ఆయన ఇల్లాంటి కేసులెన్నో చూసేడు. అందుచేత సరాసరి వ్యవహార పరిశీలనకే పూనుకొన్నాడు.

"భూమి పట్టా అయిందా?"

"పన్ను రశీదులున్నాయా?"

"ఖబ్జామీదే అనడానికి కాగితంమీద ఆధారాలేమన్నా వున్నాయా?"

చదివింది వకాలతే అయినా తన ఇంటి వ్యవహారాలకి సంబంధించిన ప్రాధమిక విషయాలనుకూడా తాను ఎన్నడూ తెలుసుకోలేదని అప్పుడే మొట్ట మొదటి పర్యాయం రంగయ్యకు అర్థం అయింది. ఆ మాట చెప్తూ తల వంచుకొన్నాడు. గోపాలరావు అల్లుడువేపు జాలిగా చూసేడు. ఇంత తెలివయిన వాడివి వకాలతు ఏం చేస్తావనా? రంగయ్య సిగ్గు పడ్డాడు. వ్యవహార విషయంలో తన అజ్ఞానాన్ని కప్పిపుచ్చుకొనేటందుకై న్యాయం, ధర్మం ప్రకారం ఆ భూమి తనదేనని ఒత్తి ఒత్తి చెప్పేడు. ఏభయ్యేళ్ళ పైనుంచి ఆ భూమి తనకుటుంబం ఖబ్జాలోనేవుంది. పన్ను ఇవ్వలేదనే తగాదా ఎప్పుడూ వచ్చిన గుర్తులేదు. అందుచేత ఆ విషయం సరిగ్గానే వుండివుంటుందని ఆతని నమ్మకం.

కాని, గోపాలరావుకు ఆ నమ్మకంలేదు. డబ్బు ఇచ్చేస్తారు. భూమిని కొనుక్కొంటారు. కాని, భూమిని తమపేర పట్టాలు చేయించుకొనే

శ్రద్ధ చాలమందికి వుండదు. రిజిస్ట్రారు ఆఫీసువాళ్ళపాలిటికి ఓ మొసలి. ఆ ప్రాంతాలకు వెళ్ళడానిక్కూడా వాళ్ళకి భయం।

ఆ భూమిని అమ్మినది ఏ దొరలో. పెద్దరెడ్లో అయితే ఇంక రిజిస్ట్రేషన్ ఆయ్యే ఆశే వుండదు. కుటుంబ ప్రతిష్ఠలు. మనిషినమ్మకాలు. అవసరం పనులు అనేకం అడ్డం వస్తుంటాయి. భూమితాను చేసుకొంటున్నాడు. పన్నులు తానే చెల్లించుకొంటున్నాడు. అదేరైతు భరోసా. పట్వారీ రశీదు ఇవ్వకపోయినా పట్టించుకోడు. పన్ను ఎంత ఇవ్వాలో. ఎంత ఇస్తున్నాడో అర్థంకాదు. తనకు భూమి అంటూ వున్నదేగొప్ప. ఒకవేళ పన్నుఎక్కువ వసూలుచేస్తున్నట్లు అనుమానం తగిలి అడిగినా పట్వారీ చెప్పడు. ఆయేడు సర్కారు రకం ఎక్కువ చేసిందంటాడు. జాయింటుపట్టాలో సరిగ్గా లెక్క చూడకపోవడంచేత తక్కువ వసూలు చేశాననీ. ఇప్పుడు సరిచేసేశాననీ అంటాడు. ఇంకా ఎక్కువ వసూలు చెయ్యనందుకూ. గతం ముదరా రాబట్టనందుకూ సంతోషించమంటాడు. మామూలుమాట జ్ఞాపకంచెయ్యాలా యని గదుముతాడు. ఏదో కాగితంమీద రశీదు ఇస్తాడు. అది రశీదో. చిత్తు కాగితమో రైతు ఎరగడు. పన్నెంత ఇచ్చినట్లు వ్రాసేడో. సంతకం ఎవరిదిపెట్టేడో అతనికి తెలియదు. అసలా చీటీయిచ్చిందేగొప్ప. దాన్ని పదే పదార్థంగా మూటకట్టి ఏ చూరులోనో దోపెతాడు. ఆ యిళ్ళు ఓ యిల్లా? ఆ యిళ్ళల్లో ఓ పెట్టీ. బేడానా? ఎప్పుడో ఏ యిల్లో తగలబడినప్పుడు ఏళ్ళ తరబడి దాచిన ఆ కాగితాలన్నీ బూడిదఅయి వూరుకుంటాయి. ఇంక మిగిలేదల్లా భూమిమీది ఖబ్జామాత్రమే. దంపినమ్మది బొక్కిందే కూలి. పేచీరాకుండావుంటే ఆభూమి అతడిదే. అన్నప్పుడూ పేచీలురావు. నిజమే కాని పేచీకి అవకాశం వుండనేవుంది. లేకపోయినా వాటిని సృష్టించే మార్గాలువెయ్యి. వెయ్యిన్నొకటోదికూడా వాళ్ళు కనిపెట్టగలరు.

భార్యపంపిన టీ కప్పులముందు గోపాలరావు తన అనుభవంలోని కేసుల్ని గురించి చెప్పుకొనిపోతున్నాడు.

వానిలో ఒకటి మరీ అన్యాయంగా కనబడింది.

వాళ్ళంతా గౌండ్లు. అయిదారు కుటుంబాలవాళ్లు అన్నదమ్ములు కొడుకులు. కూతుళ్లు. కోడళ్లు. అల్లుళ్లు ఓ నలభయి ఏభయిమంది వున్నారు.

పెద్దకుటుంబం. చెలకభూమి. డెబ్భయి ఎనభయ్యెకరాలుంది. దానిలోనే ఒకకుంట. కుంటక్రింద ఓ పదెకరాలు మాగాణవుతూంది. మిగిలినదంతా ఈదులవనం. ఆ పంట తింటూ ఈనులు గీసుకుంటూ. ఆభూమిలో చాకిరీ చేసుకొంటూ వాళ్ళు రోజులు గడిపేస్తున్నారు. భూస్వామి వెంకయ్య కూడా తెలివిగానే పన్నాగం పన్నేడు. అతడు తమ భూమిమీద కన్నేసేడని వాళ్ళెరగనే ఎరగరు. ఆ వూళ్ళోకో ఆపరేటివ్ బ్యాంకుంది. దానికి వెంకయ్యే సదరు.

ఎప్పుడో పదేళ్ళక్రితం పిల్లదాని పెళ్ళికో మరోకార్యం కరామత్తుకో బ్యాంకులో గౌండ్లు ఓ మూడువందలు అప్పుతీసుకొన్నారు. రెండేళ్లు గడిచింది. మంచిడబ్బు నిక్కచ్చిరోజుల్లో వెంకయ్య నొక్కేడు. వాళ్ళు డబ్బుకి గిజగిజలాడుతున్నప్పుడు పొలం అమ్మమన్నాడు. వాళ్ళు ఒప్పుకోలేదు. ఇంక నేర్పుగా జాయింటు కుటుంబములోని అన్నదమ్ముని వితంతుభార్యకు ఓ వంద యిచ్చి భూమి తనకు అమ్మేసినట్లు వ్రాయించుకొన్నాడు.

ఇటువంటి ఘటనల్ని రంగయ్య ఎన్నోవిన్నాడు. అయినా ఆశ్చర్యం ప్రకటించకుండా వుండలేకపోయేడు

"చెల్లుతుందా ?"

"వెంకయ్యకు కావలసింది పేచీకి ఆధారం. చెల్లుతుందో చెల్లదో తేల్చవలసింది కోర్టులు."

కో ఆపరేటివ్‌బ్యాంకు అప్పు మూడువందలో, నాలుగువందలో తీర్చలేకుండా వున్నవాళ్లు కోర్టుఖర్చులు భరించగలరా ? అదే ఆశ వెంకయ్యది. వూళ్ళో పట్వారీ జగన్నాధరావు అడ్డంవచ్చి వుండకపోతే ఆ ఆశ అప్పుడే ఫలించేది. పట్వారీకి వెంకయ్యకూ పడదు. పైగా పంచాయతీ

అంటూ లేకపోతే తనకుమాత్రం డబ్బు ఎవరిస్తాడు ? కనక గౌండ్లని ప్రోత్సహించేడు కోర్టుకుతెచ్చేడు.

గోపాలరావే ఆ కేసు నడిపించేడు.

"ఏమయింది ?"

అది అల్లుడిప్రశ్న కోర్టులో న్యాయమే జరిగివుంటుందనే మామగారి యందుగల నమ్మకముతో అతడు గౌండ్లువిజయం పొందేవుంటారని తల చేడు. కాని గోపాలరావు సమాధానంతో కళ్ళంతచేసి ఆశ్చర్యంకురిపించేడు.

మామూలుగా అవుతూన్నదే ఇక్కడా అయింది. కోర్టుల పద్దాక వ్యవహారం ఓ పట్టాన తేలుతుందా ? వెంకయ్య కాలిదితీస్తే మెడకీ, మెడది తీస్తే కాలికీ లంకెలు వేస్తున్నాడు. కాలంగడిపి. ఆయాసపెడితే గౌండ్లు లొంగివస్తారని అతని ఆశ. కేసు మరో రెండేళ్లు సాగిందల్లా లాభం జగన్నాధరావుకి. ఉభయులకీ కావలసింది కేసు తేలకపోవడమే. అంతే. తల లేదు. నాలుగైదేళ్ళపాటు గౌండ్లవాళ్ళ కుటుంబం అంతా వాళ్ళవూరికీ, నల్లగొండకీ మధ్య రోడ్డుమీదనే బ్రతికేరు. హఠాత్తుగా ఓ రోజున జగన్నాధరావు రంగంనుంచి నిష్క్రమించేడు.

రంగయ్య విచారం ప్రకటించేడు.

"చచ్చిపోయేడా ?"

తన కవితాధోరణి కల్పించిన అర్థానికి గోపాలరావు పక పక నవ్వేడు.

"కొంచెం ఇంచు మించు అల్లాంటిదే. లంచంమేసి తిరిగి పోయేడు."

జగన్నాధరావుకి గౌండ్లమీద అభిమానమా యేమన్నానా ? పైరవీ నడిపితే పైసా ముడుతుంది. నడిపేడు. చిక్కినంత చిక్కించుకొన్నాడు. నాలుగేళ్ళ తంటాలుపడ్డా దొరకనంతడబ్బు వెంకయ్య ఇస్తానంటూంటే ఇంకేం ?

"ఏమిచ్చేడు?"

అదో అనవసరపుప్రశ్న. డబ్బుగలవాడు ఏమిచ్చినా ఇస్తాడు. ఇంత బలగం వున్నవాళ్ళే నెగ్గలేక పోయేరనిపించేస్తే తనకిమళ్ళీ వూళ్ళో ఎదురుంటుందా? ఆ ఆలోచనతో జగన్నాధరావుకళ్లు జిగేల్ మనిపించేడు.

ఏరోక్కాలు ఎడ్లజత. ఏడెనిమిది వందలకు తక్కువుండదు. దొడ్లో వున్న నలభయ్యేభయి జతల్లోంచి ఏరుకోమన్నాడు.

మంచి. కొత్తకచ్చడం బండి. రోజూ ఏడెనిమిదిశేర్లు పాలిచ్చే గొడ్డు గేదె వాళ్ళింట్లో మంచి చాయగేదె వుండేదట. దానికూతురది. మలిచూలు పడ్డ. మంచితరి అవుతుంది.

ఇవిగాక మరో అయిదువందలు కరుకులు మూటగట్టి యిచ్చేడు.

అంతా చేరుస్తే రెండు రెండున్నరవేల సొత్తు. ఇంక చచ్చిపోయేడంటే ఆశ్చర్యం ఏం వుంది?

గోపాలరావు మళ్ళీ పక పక నవ్వేడు రంగయ్యకు నవ్వురాలేదు. జగన్నాధరావు చేసిన మోసంగురించి ఆలోచిస్తున్నాడో. గొండ్లవాళ్ళ పుస్థితికి విచారిస్తున్నాడో.

గొండ్లు నిరుత్సాహపడి కేసు వదిలేసుకొన్నారు. కోర్టు తీర్పులతో నిమిత్తం లేకుండా వెంకయ్య విజయం పొందేడు.

రంగయ్య ఒక్కనిట్టూర్పు విడిచేడు. గొండ్లకన్న ఎంత ఎక్కువ కాలం నిలబడగలనో అని ఆలోచిస్తున్నాడు.

గోపాలరావు అల్లుని ఆలోచనలు పసికట్టినట్లుగా సమాధానం ఇచ్చేడు.

"కేసు నడుపుదాం. ముప్పు తిప్పలూపెట్టి మూడు చెరువులు తాగిద్దాం. కాని. నీ భూమి నీకు దక్కుతుందనే ధైర్యంమాత్రం లేదు. కోర్టులూ. చట్టాలూ నీకు రక్షణ యివ్వలేవు. కాని, ఒక పని చేయవచ్చు.

సంగారెడ్డిని కలుద్దాం. ఆయన కిదో కేసుకాదు. అయినా సలహా చెప్పగలుగుతాడు.

సంగారెడ్డికి ఇదో కేసుకాదు. ఆయన దీనిని పట్టుకోడు. రంగయ్యకు ఆ సంగతి బాగా తెలుసు. జాగీర్దార్లూ, ఇనాందార్లూ చనిపోయినప్పుడు సనదులు నిజాంకు తిరిగిపోతాయి. వానిని వారసుల కిప్పించేటందుకు పైరవీలు నడపడంలో సంగారెడ్డి మొనగాడు. మంచి కీలక స్థానాల్లో ఆయన మనుష్యులున్నారు. ప్రస్తుతం హైకోర్టు ఛీఫ్ జడ్జిగావున్నాయన బారెట్లా ప్యాసయి కొత్తగా బారుకి వచ్చినప్పుడు కేసులిప్పించి పైకిలాగేడు. అడ్వొకేట్ జనరల్‌గావున్న వ్యక్తి చదువుకొంటున్నరోజుల్లో వాళ్ళింట వుండి, ఆయన పుస్తకాలనే వుపయోగించుకొన్నాడు. ఈ పరిచయాలన్నీ నేడాయన కుపయోగపడుతున్నాయి. వారసులకి సనదులిప్పించినందుకు ఫీజుగా ఆస్తిలోవాటా. ఆలాగ ఆయన సంస్థానంలోని అన్ని జిల్లాల్లోనూ బోలెడంత ఆస్తి సంపాదించేడు. ఆయనకి ఈ బోళ్ళపాలెం పేచీ ఒక కేసా?

కాని, శివరామిరెడ్డి మాటల్లో సంగారెడ్డిమీద ఎంతో ఆప్యాయం, భక్తి కనబరిచేడు. అదేమన్నా వుపయోగ పడుతుందేమో!

రంగయ్య ఆశ కొత్తచిగుళ్లు పెట్టింది.

# పదో ప్రకరణం

సంగారెడ్డి వారు చెప్పినవన్నీ శ్రద్ధగా విన్నాడు. అన్నీవిని దేశాన్ని బాధిస్తున్న ప్రధానమైన పీడను ప్రస్తావించేడు.

"బాధ్యతాయుత ప్రభుత్వంలేని లోపం మనకి అడుగడుగునా కనిపిస్తూంది."

బాధ్యతాయుతప్రభుత్వం లేనిలోపం పరిపాలనావిధానంలో ఏవిధంగా ప్రతిబింబిస్తూందో, ఆ లోపం దేశంలో ఇంకా పాతుకుపోయి వుండడానికి కారణం ఎవరో, ఏం చెయ్యాలో సుదీర్ఘంగా వుపన్యసించేడు.

"ప్రజాతంత్రప్రభుత్వం ఏర్పడితే తన ఏకచ్ఛత్రాధిపత్యం చెల్లదని నిజాంప్రభువు ఆలోచన. యూనియన్‌లో చేరితే తన పెత్తనం పోతుందని భయం ప్రజాప్రతినిధులనీ, రాజ్యాంగచట్టం అనీ ముక్కుత్రాళ్లు బిగుస్తాయని ఆలాహజరత్ అనుమానం. నిజాము తొలక్కపోతేమానె. ఆయన రెక్కలు కత్తిరించాలి...."

నిజాము పెత్తనం పోవాలనే వాడు గోపాలరావు. తాను వచ్చినపని మరిచి నిజాము వుండాలో, అక్కర్లేదో తేల్చుకోడానికి సన్నద్ధం అయ్యేడు.

నిజామును వుంచాలనడం ఒక ఎత్తుగడ మాత్రమే నంటాడు సంగారెడ్డి.

ఎత్తుగడ పేరుతో నిజామును అట్టేవుంచాలనడం ప్రజల వుద్యమాన్ని అవమానించడం అంటాడు గోపాలరావు.

"నిజాము ముస్లింగనక, ఆయన్ని తీసెయ్యాలంటే హిందూముస్లిం ఘర్షణగా చిత్రిస్తారు...." అంటాడు సంగారెడ్డి.

అంజుమన్ ఎ ఇత్తెహాదుల్ ముస్లిమీన్ ముస్లిం రాజ్యపరిరక్షణ పేరుతో రజాకార్లని తరిఫీదు చేస్తూంది. కాస్త నోరున్నవాడల్లా పదిమందిని పోగుచేసుకొని ఊళ్ళమీదపడి అల్లరిచేయడం సాగిస్తున్నాడు. వారి నోరు నొక్కడానికి నిజాము విషయం ఇప్పట్లో వదిలెయ్యడం ఓ ఎత్తుగడ సంగారెడ్డి దృష్టిలో. ప్రజాతంత్ర ప్రభుత్వం ఏర్పడితే నిజాము ఉత్సవ విగ్రహంలా వుంటాడు. సంవత్సరానికోమాటు బూజు దులిపి, తోమి, ఊరేగించినట్లు శాసనసభకి తీసుకురావచ్చు ప్రజలు ఎన్నుకొన్నవాళ్లు చట్టాలు చేస్తారు. ఆయన సంతకం పెడతాడు.

కాని గోపాలరావు అదంతా కాంగ్రెసు సిద్ధాంతాలకి తిలోదకాల నివ్వడమే నంటాడు. ప్రజలకి ఒకటిచెప్పి, మరొకటిచేస్తే ద్రోహం అన్నాడు.

నిజాము జాగీర్దారీ విధానానికి ప్రతినిధి ఆ విధానంక్రింద నలిగిపోతూన్న ప్రజ ఆ విధానంతోపాటు నిజామూ పోవాలంటున్నారు. నిజామును తరిమెయ్యాలన్నప్పుడే వుద్యమానికి పజల సహాయం వుంటుంది.

పైగా నల్లగొండ, వరంగలుజిల్లాల ప్రజలు పది నెలలనుంచి నిజాం ప్రభుత్వాన్ని ఎదిరించి పోరాటాలు సాగిస్తున్నారు. ఎన్ని ఇబ్బందులు పెట్టినా, నిర్బంధాలు తెచ్చినా లొంగడంలేదు. ఈ స్థితిలో నిజామును వుంచుతామనడం ఓ ఎత్తుగడేకాదు. ప్రజల పక్కన నిలబడి, నిజామును గద్దెదించేటందుకు వారితోపాటు పోరాడడమే ఇప్పుడు చేయవలసినపని.

సంగారెడ్డి గోపాలరావును హేళన చేసేడు.

కమ్యూనిస్టుల "ప్రజాశక్తి" సరిగ్గా ఇదేపద్ధతిలో వ్రాస్తుందన్నాడు.

గోపాలరావు అభ్యంతరం చెప్పలేదు.

పైగా కాస్త ఆలోచించేవాళ్ళంతా అదేనిర్ణయానికి రావలసి వుంటుందన్నాడు.

సంగారెడ్డికి చుర్రుమంది. తనకి ఆలోచనలేదనా దాని వుద్దేశం ?

"బాధ్యత పట్టించుకోనేవాళ్ళ ఆలోచనలు ఒడిదుడుకుల్లోపడవు."

ప్రజల్ని పోలీసులమీదా, ప్రభుత్వంమీదా తిరుగుబాటుకి ప్రోత్సహించడం చేతనే నిర్బంధవిధానం సాగించడానికి నిజాముకు సాకుదొరికిందని సంగారెడ్డి అభిప్రాయం.

"ప్రభుత్వ ఏలాంటిదే గాని, తనమీద తిరుగుబాటువస్తే చూసి చూసి వూరుకోదు. వూరుకోమనడం మనతప్పు. ఈవేళ ఆ ప్రభువుమీద తిరగబడ్డ వాళ్లు రేపు మనమీద తిరగబడరా ?"

తన అభిప్రాయాలకి కాంగ్రెసు అగ్రనాయకుల ఆలోచనలు సరిపడుతున్నాయనికూడా చెప్పుకోకుండా వుండలేకపోయేడు. తాను సర్దార్ పటేల్‌ను కలుసుకొన్నప్పుడు ఆయనకూడా అదేచెప్పాడన్నాడు.

సర్దార్‌పటేల్ సంస్థానాల ఆంతరంగిక వ్యవహారాల్లో కలగచేసుకోమనికూడా హామీ యిస్తున్నాడు. కాశ్మీర్, తిరువాన్కూర్, హైదరాబాద్‌ల విషయంలో మరోఅడుగు ముందుకు వేయడానిక్కూడా సిద్ధంగావున్నాడు. విదేశ వ్యవహారాలూ, రక్షణలాంటి ప్రధానసమస్యల్ని యూనియన్‌కు వదలాలనే విషయంలోకూడా పట్టుపట్టనన్నాడు."

"సంస్థానాల వ్యవహారాలలో కలగచేసుకోముఅంటే రోజూ మన కళ్ళముందు జరుగుతున్నవన్నీ చూసినా మాట్లాడము అనేగా ?"

సంగారెడ్డి తన ఆవేశంలో చాలదూరం పోయేననుకొని సర్దుకోడానికి ప్రయత్నించేడు.

"యూనియన్‌లో కలియాలనే దొక్కటే సర్దార్‌పట్టు. ఒకమారు యూనియన్‌లో చేరేక నిజాము ఎక్కడికి పోతాడు ?"

కాని గోపాలరావు ఆవిధంగా సంతృప్తి పడలేదు. యూనియన్‌లో చేరడంవలన నిజాంపరిపాలనలో మంచిమార్పులు కలిగే అవకాశంకన్న, వీరిస్నేహంలో యూనియన్‌లోకూడా పరిపాలనాపద్ధతులు చెడడానికి అవ

కాళం వుంటుందంటాడు. ఇక్కడిదిక్కడే ఇప్పుడున్నట్టే వదిలేసి, నిజాముతో స్నేహంచేస్తాననడం ఆ దౌర్జన్యాలని సమర్థించడమేగా ?

చర్చలు అసలువిషయాన్ని వదలి చాలదూరం పోయేయి. కాంగ్రెసులోని వేరువేరు ముఠాల మూలసిద్ధాంతాలచర్చలో పడింది. రెండు ముఠాలవారూ తిట్టుకొనేతిట్లుకూడా సూచనప్రాయంగా విసురుకొన్నారు.

వ్యవహారం ముదురుతూందికూడా. రంగయ్య తనువచ్చిన వ్యవహారం మూలపడిందని కంగారుపడ్డాడు. అసలుసమస్యను గుర్తుతెచ్చేడు.

సంగారెడ్డి గంభీరంగా సమాధానం ఇచ్చేడు.

"ఇటువంటి దురన్యాయాలకి మూలం తుంచెయ్యడంకోసమే మరో పదిరోజుల్లో సత్యాగ్రహం చేయాలని నిశ్చయించుకొన్నాం."

రంగయ్య ప్రశ్నలధోరణికి వెనకనున్న అభిప్రాయాన్ని గోపాలరావు గుర్తించేడు. వ్యవహారంమీదవచ్చి రాజకీయపు చర్చల తగాదాల్లో వూరికి నందుకు విచారపడ్డాడు. సంగారెడ్డి వాక్యాలకు సమాధానం నాలుక చివరవరకూ వచ్చినా దిగమింగేడు.

రంగయ్యే ఈమారు రాజకీయ చర్చను ఎత్తుకొన్నాడు.

అయితే జమీందారీ విధానం పోవాలనీ, రైతులకు భూములివ్వాలనీ పట్టుపడితే ఈ వుద్యమానికి దొరలంతా ఎదురుతిరగరా ?"

సంగారెడ్డికి ఆ ప్రశ్నలోవున్న మెలిక చటుక్కున స్ఫురించలేదు. వెంటనే అనేసేడు.

"చిన్నవాడివైనా బుద్ధిమంతుడివి. మీ మామకి వాళ్ళకి చెప్పు ఆమాట. మాట్లాడితే జమీందారీవిధానం రద్దుచేస్తామంటూ ఆలంగడా వెనక తాళం వేస్తూన్నారు. గోడు చెడగొట్టకండయ్యా అంటే వినిపించుకోరు."

గోపాలరావు స్టేట్ కాంగ్రెసులో స్వామీజీ ముఠా మనిషి. అందుకే ఎత్తి ఆపొడుపు.

సంగారెడ్డి తన అభిప్రాయాన్ని వివరించేడు.

"జమీందారీవిధానం రద్దుచేయవలసిందే. కాని అది భావికర్తవ్యం. ప్రస్తుతం కావలసింది ఆటువంటి చట్టాలను చెయ్యగల అవకాశం."

ఆ భావికార్యక్రమానికి ప్రాతిపదిక ఎల్లావుండాలోకూడా చెప్పేసేడు.

"అనవసరమైన గంద్రగోళాలూ, వ్యతిరేకతా రాకుండా, ఎవళ్ళకీ నష్టం కలగకుండా వ్యవహారాలు సర్దుబాటు చేసుకోవాలి."

నష్టంకలగని పద్ధతీ గంద్రగోళంరాని పద్ధతీ నష్టపరిహారం ఇవ్వడం. అదీ అడిగినంత.

* * * *

రంగయ్యా, గోపాలరావూ తిరిగివస్తూ ఆనాటి చర్చల్ని నెమరువేసుకొన్నారు.

జమీందారీవిధానంమాట ఎత్తవద్దనీ, నిజామును ఎప్పట్లాగే వుంచుదామనీ సంగారెడ్డి చెప్పిన వాదనలు గోపాలరావుచెవుల్లో గింగిరుమంటున్నాయి. వారం పదిరోజుల్లో స్టేట్‌కాంగ్రెస్ సత్యాగ్రహానికి సన్నాహాలు చేస్తూంది. కాని, ఆ పోరాటంవలన సాధించదలచిన ఫలితాలవిషయమై కాంగ్రెసులోనే ఏకాభిప్రాయంలేదు. అది ఆతనికి చాలా విచారం కలిగిస్తూంది.

తన నెదుర్కొంటున్న సమస్యకు ఆ వాదోపవాదాల్లో పరిష్కారం వెతుక్కుంటున్నాడు రంగయ్య. సిద్ధాంతాలస్థాయిలోనే ఆలోచిస్తూ కూర్చోగల స్థిమితంలేదిప్పుడు. ఒక పెద్దసమస్య, జీవితసమస్య కళ్ళముందు నిలబడి నామాటేం చెప్పేవని నిలదీస్తూంది.

"అయితే ఈ ఎభయ్యేళ్ళనుంచీ ఆ భూమిలో ఊరికే చాకిరీ చేయనిచ్చినందుకా పరిహారం ఇవ్వడం ,"

గోపాలరావు అల్లునిమాటబువిని నిలబడ్డాడు. నష్టపరిహారం ఇవ్వాలనేమాట ఆయనకు అనుచితంగా కనబడలేదు. ఆస్తిహక్కులంటూ వున్నాయి. వాటిమాటేమిటి ?

రంగయ్య తల అడ్డంగా తిప్పేడు.

ఆ భూమిని ఆయన ఎన్నడూ చెయ్యలేదు. చెయ్యగలిగివుండేవాడే కాదు. మరెందుకు పరిహారం? పట్టామాకు లేకపోయిందనా? ఆయనకు వుందనా? అన్యాయంగా సంపాదించినపట్టాకి మనుష్యుడి ప్రాణంకన్నా విలువ ఎక్కువా?"

న్యాయం అయితేలేదు. కాని, సమాజం నిబంధనలన్నీ న్యాయం మీదనే ఆధారపడి వుండడంలేదు.

గోపాలరావు ఇవ్వగల సమాధానం ఒక్కటే.

"సమాజం నడకకి కొన్ని నిబంధనలవసరం."

"మనుష్యుని జీవితానికి కొన్ని న్యాయపరిరక్షణ లవసరం. అన్యాయాలను రక్షించుకొనేందుకు మనుష్యుడు నిలబడ్డం అవసరమే. ఆ అవసరం నాకు వచ్చింది."

అల్లుని కంఠస్వరములోని దృఢత్వం గోపాలరావును చకితుణ్ణి చేసింది.



# పదకొండో ప్రకరణం

తెల్లవారడంతోనే గోపాలరావు అల్లుణ్ణి హైద్రాబాద్ ప్రయాణం చేసేడు. చెప్పడం అయితే పెద్దవకీలు నెవరినో కలుసుకోడానికి అన్నాడు. కాని, అసలు వుద్దేశంవేరు. నిన్నరాత్రి సంగారెడ్డి ఇంటినుంచి తిరిగి వచ్చాక మాట్లాడిన మాటలు విన్నాక అల్లుణ్ణి స్వగ్రామం పోనివ్వడం మంచి దనిపించలేదు. నిజంచేత ఇల్లాంటి సందర్భాల్లో మరో క్లయింటయితే భూమిమీద ఖజ్జామాత్రం వదలకని చెప్పేవాడే. కాని, ఇక్కడ క్లయింటు కూతురు మగడు. దిక్కుమాలిన పొలంకోసం పట్టుదలలకిపోతే ప్రాణాలకే మోసం. గ్రామాల్లో రెడ్లూ, పెత్తందార్లూ మహా దురంతాలకూడా వెనుదియ్యరు. బంగగీని చంపించిన దిల్లాగే. పింత్రిపోలులో పట్టపగలు నడివీధిలో జగ్గయ్యని చంపించి ఇంకా నాలుగు నెలలుకాలేదు. పాడుభూమి. అంతాచేసి నాలుగువేలు చెయ్యదు. దానిని రంగయ్య ఎల్లాగూ వ్యవసాయం చెయ్యబోవడంలేదు. ఎక్కడో వకాలతుపెట్టడమో, మంచివుద్యోగం దొరికితే పోవడమో అనుకుంటున్నదేనాయె.

సరిగ్గా సమయానికి ప్రభుత్వంలో మంచి హోదాలోవున్న ఒకమిత్రుడు ఒక ఉద్యోగానికి మనిషికావాలని చెప్పినమాట గుర్తువచ్చింది.

నిజాం ప్రభుత్వానికి పబ్లిసిటీ ఆఫీసర్లు అవసరం అయ్యేరు. అందులోనూ ప్రస్తుతరాజకీయ పరిస్థితులదృష్ట్యా హిందువైతే మంచిదనేదృష్టిలో వున్నారు. సమర్థుల్ని ఆకర్షించడానికై మంచిజీతాల నిస్తున్నారు. భవిష్యత్తులోకూడా మంచి వుపయోగా లుంటాయని ఆ మిత్రుడు చెప్పేడు.

చెప్పిన సమయంలో అల్లుణ్ణి పంపాలనే ఆలోచన తోచలేదు. దానికి రాజకీయాలు ఓ కారణం. రెండోది బల్లకడితే వెంటనే కాకపోయినా

ఆ జీతపురాళ్ళు కిట్టకపోవు. ఆ ఆలోచనతోనే తన అల్లుడిమాట చెప్పలేను. కాని, ఇప్పుడు పరిస్థితి తరుముకు వస్తున్నట్లనిపించింది. ఆ మిత్రునివద్దకు రంగయ్యని తీసుకుపోయి పరిచయం చెయ్యాలని నిశ్చయించుకున్నాడు. కాని, ఆ నిశ్చయం మనస్సులోనే. పైకిచెబితే రంగయ్య ఒప్పుకోడు. అత డున్న ఆవేశం అటువంటిది. లాభనష్టాల్నీ పట్టుదలల్నీ బేరీజువేసుకొనే వయస్సుకూడాకాదు.

భార్యకూడా ఆ ఆలోచనే బాగున్నదంది. పట్టుదలలు ఎంతెంత ఆలో చనగల వాళ్ళనీ ఇట్టేబోల్తా కొట్టించేస్తాయి. వాళ్ళ స్వగ్రామంలో ఇద్దరు యిరుగు పొరుగువాళ్లు. తమ యిళ్ళమధ్యనున్న ఉమ్మడిగోడకి ద్వారం పెట్టుకునేహక్కు వుందో లేదో తేల్చుకోడానికి బోలెడంత ఆస్తికి కరారావుడి చుట్టేసేరు. అప్పటికీ తేలలేదు. ఒక ప్రాణం బలిపెట్టేరు. నలు గురు రెండేసేళ్లు జైళ్ళల్లోపోయి కూర్చున్నారు. ఇంతా చేస్తే పైన మరో కోర్టు మిగిలిపోయింది కూడా.

అందుచేత అల్లుణ్ణి స్వగ్రామానికి వెళ్ళవలసిన పనిలేకుండా మారు దారిన పెట్టడమే మంచిదని ఆమెకూడ సలహా చెప్పింది. ఇంక ఆలో చన అనవసరం. పెద్దవాళ్ళని సలహా అడగడం పేరుతో అల్లుణ్ణి కదిలిం చేడు. ఇద్దరూ మొదటి బస్సుకే బయలు దేరేరు.

* * * *

బస్సు సర్వాపేట సమీపాన ఘాటీలోకి వచ్చేసరికి పోలీసులు ఆపేసేరు. అంతదూరంలో లోయలోకి దొర్లిపోయిన ఒకలారీ తగులబడిపోతూంది. మధ్యమధ్య ఏవో ప్రేలుతున్న చప్పుళ్లు చుట్టుప్రక్కల కెవ్వరూ పోకుండా పోలీసులు కమ్మేసేరు.

బస్సుడ్రైవరు ఆ ప్రమాదం ఏమిటో చెప్పేడు. ఖాజీకి హైద్రాబాద్ నుంచి పెట్రోలు, బందూకులు, జంబియాలు తీసుకొని విన్న రెండు లారీలు వచ్చేయి. బహుశా ఇది మరొకటయి వుంటుంది.

గోపాలరావు రంగయ్య మొగ మొగాలు చూసుకున్నారు. నిజాము ఓ వైపున ఢిల్లీకి మనుష్యుల్నిపంపి రాయబారాలు సాగిస్తూనే, ఆయుధాలు వగైరా అందించి జనాన్ని తయారు చేసుకొంటున్నాడు. ఖాజీ తమ ప్రాంతంలో అంజుమన్ నాయకుడు. దానికి నిజాము నవాబు ప్రోత్సాహం, సహాయం ఉన్నాయి. లేదని పైకి ఎన్ని చెప్పినా ఈ ప్రత్యక్ష సాక్ష్యానికి ఏం చెప్తారు?

డ్రైవరుకు ఇంకా చాలా సంగతులు తెలుసునని ప్రశ్నలువేసి గోపాలరావు గ్రహించేడు. ఈ ఆయుధాల్ని జేరవేసే లారీలు వీళ్ళ సహాయం లేనిదే నడవ్వు. వాళ్ళల్లో ఏ ఒక్కరికి తెలిసినా మిగతా అందరికీ తెలిసిపోతుంది. అయినా అనేక కారణాలవలన పైకి చెప్పలేరు. ఏయే జిల్లాలో ఏయే మజ్లిస్ నాయకునివద్దకు ఎన్నెన్ని ఆయుధాలు జేరవేసిందీ వాళ్ళందరికీ కరతలామలకం. ఇంత పెద్దఎత్తున ఆయుధాలు రవాణా అవుతున్నా గోల పుట్టలేదేమాయని గోపాలరావు ఆశ్చర్యపడ్డాడు.

మంటలు చల్లారినాక పోలీసు అధికార్లు బస్సుని పోనిచ్చారు. కాని, తగలబడినలారీవైపు తొంగి చూడ్డానిక్కూడా వీలులేకుండా వేగిరించేరు.

దారిలో అయిన ఆలస్యాలు కారణంగా బస్సు పట్నంచేరేసరికి బాగా ఆలస్యం అయింది. తాను కలుసుకోదలచానన్న వకీళ్ళందరూ ఎక్కడెక్కడికో షికార్లుపోయి వుంటారు. గోపాలరావు తన ఉద్యోగి మిత్రుడికోసం ఫోన్ చేసేడు. ఆయనింకా ఇంట్లోనే వున్నాడు. మిత్రుడు గొంతు వినిపించగానే ఉత్సాహం ప్రకటించేడు. ఆ రోజురాత్రి ఆయన ఇంటివద్ద ముషాయిరా జరుగుతుంది. నగరంలోని ప్రముఖులు చాలామంది వస్తున్నారు. గోపాలరావుకూడా తప్పక రావాలన్నాడు.

బి. యల్. ప్యాసైన తన అల్లుడుకూడా తనతో వచ్చేడని విన్నాక ఆ వుద్యోగి అసలు విషయం అర్థం అయిందనుకొన్నాడు. ఆ యువకు

డితో తనకు పరిచయం లేనందుకు విచారం తెలిపేడు. సాయంకాలం ముషాయిరాకి ఆయన్నికూడా తోడితెమ్మని పదేపదే చెప్పేడు.

తాను తలపెట్టిన ఒక ముఖ్యమైన పని సక్రమంగా సానుకూల పడుతున్నందుకు గోపాలరావు సంతృప్తి పడ్డాడు.

ముషాయిరాకు వచ్చిన ఆహ్వానాన్ని అల్లుడి కందజేసేడు.

"నువ్వూ వ్రాస్తావుగా కవిత్వం. రా, అదో సరదా."

రంగయ్య చిరునవ్వు నవ్వేడు.

* * * *

విశాలమైన ఆ హాలంతా లష్తర్ల వెలుతుర్లో మిలమిల లాడిపోతూంది. గది అంతటా తివాచీలు పువ్వులు పరచినట్లున్నాయి. హాలులో ఒక ప్రక్కన పరుపులు, తఖ్తాలతో వేదిక అమర్చబడివుంది. గుమ్మంలో నిలబడి గోపాలరావు స్నేహితుడు స్వయంగా అతిధుల్ని చిరునవ్వుతో ఆహ్వానిస్తున్నాడు. కరచాలనం చేసేడు. అదాబ్ తెలుపుతున్నాడు.

గోపాలరావును చూడగానే ఆయన చాలా ఆనందం ప్రకటించేడు.

రంగయ్యతో పరిచయం చేసుకొని ఆహ్వానించేడు.

వుద్యోగి వర్గంలో మామగారికున్న మంచిపేరుకు రంగయ్య ఆశ్చర్య పడ్డాడు. ఆ వుద్యోగి స్వయంగా ఇద్దరినీ విశ్రాంతి మందిరంలోకి తీసుకెళ్ళేడు. ఒక పరిచారకుడు 'డ్రింక్' తెచ్చి యిచ్చేడు. గ్లాసులు ఖాళీచేస్తూ రంగయ్యతో పరిచయం వృద్ధి చేసుకొన్నాడు. ఎక్కడ చదివేడో, ఎప్పుడు ప్యాసయ్యేడో వివరాలు తెలుసుకొన్నాడు.

సంభాషణ ముషాయిరాల మీదికి మళ్ళింది. రాజకీయాలోచనల తలనొప్పిలో కవితాగోష్ఠి మనస్సుకు ఎంత ప్రశాంతి నిస్తుందో వర్ణించేడు. 'దక్షినీ సంస్కృతి' ప్రత్యేకతకు ఉదాహరణంగా ఈ ముషాయిరాలు మతభేదాల పునాదిమీదగాక కవితాభిరుచి పునాదితోనే జరగడం గమనించాలన్నాడు.

"ఈ ప్రత్యేకత నిజాము ప్రభువు పరిపాలనా ఫలితం."

ఈ ప్రత్యేక సంస్కృతిని రక్షించే టందుకే నిజాము స్వాతంత్ర్యం కోరుతున్నాడని కూడా తన మిత్రుడు చెప్తాడని గోపాలరావు భావించేడు. కాని, ఆయన ఆమాట అనలేదు. ఈ ప్రత్యేక సృష్టితో పరిచయం లేక పోవడం చేతనే దేశమంతటా దురభిప్రాయాలు వ్యాపించి వున్నాయన్నాడు. వానిని తొలగించడం, ప్రపంచానికి సత్యస్థితి తెలపడంలో నేడు సంస్థానంలో నున్న యువకుల మీదగల ప్రధాన బాధ్యత అన్నాడు.

తర్వాత అందరినీ సభామందిరానికి తీసుకువెళ్ళేడు.

* * * *

రాత్రి ఒంటిగంట వేళకి ముషాయిరా ముగిసింది. మరునాడు ఆఫీసులో కలుసుకొంటామని వాగ్దానం చేసి గోపాలరావు, రంగయ్య వీధిలోకి వచ్చేరు. రిక్షాలు తీసుకొని బయలుదేరేరు.

కొంత దూరం వచ్చేసరికి రోడ్డు మొగలో పోలీసువాడు రిక్షాలు ఆపేడు. గబగబా నాలుగు మూలలనుంచీ ఓ యిరవయిమంది చుట్టు మూగేరు. వారిని చూసేసరికి గోపాలరావుకు అర్థం అయింది. పోలీసువాడు ప్రశ్నలు వేస్తున్నాడు. వాడు ఆపుతాడు. మిగిలిన వాళ్ళంతా అల్లరిచేస్తారు. మజ్లిస్ వలంటీర్లు వాళ్ళతా. హైద్రాబాద్ అజాదీకోసం పోలీసుల సహాయంతో రోడ్లమీద వీరవిహారం చేస్తున్నారు.

గోపాలరావును తీసుకువస్తున్న రిక్షావాడు తాను బేరం ఎక్కించుకొన్న వీధీ, వుద్యోగి ఇల్లూ చెప్పేడు. రజాకార్లు ఆ పేరు వినగానే వెనక్కి తగ్గేరు. పోలీసువాడు సలాముకొట్టి ప్రక్కకు తొలిగేడు.

రిక్షాలు కదిలేయి.

హోటలుగదికి వెళ్ళేక గోపాలరావు తన వుద్యోగి మిత్రునితో జరిగిన సంభాషణ విశేషాలను నెమరువేసేడు. ప్రచారశాఖ వుద్యోగి కిస్తామన్న ఎనిమిదివందల రూపాయల జీతాన్ని పొగిడేడు. రంగయ్య అపహాస్యం చేసేడు.

"మన రిషిల నాపిన సంస్కృతీ రక్షకుల చర్యలను సమర్థించేటందుకు ఎనిమిది వందల జీతం చాల తక్కువ."



## పన్నెండో ప్రకరణం

ముసలితనపు బరువుకి కాళ్ళు తడబడి పోతూంటే సరయ్య పరుగు పరుగున వూళ్ళోకి వచ్చేడు. అతడు చెప్పినవార్త విని వీరమ్మ లబో దిబోమంది.

పెద్దవూర శేరీదారు కిష్టయ్య పదిమంది కూలీలతో పొలంలోకి వచ్చి తనకుండా మండా వాకిట్లో పారేసేడు. పాక పీకేయించేడు.

పొలం వొప్పచెప్పమని ఇంకా రోజు తిరగలేదు. ఇంత త్వరగా స్వాధీన పరచుకొనేందుకు మనుష్యుల్ని పంపుతాడని ఎవ్వరూ ఊహించను కూడా లేదు. వీరమ్మ విలపించింది, "ఈ ఏడాది పంట కోసుకొనే అదృష్టం కూడా లేదా దేవుడా !"

ఇంకెవ్వళ్ళమాటా వినిపించుకోకుండా, సుదీర్ఘమైన వాక్యాలతో, ఉదాత్తానుదాత్త సరితాల్ని యథాశక్తి నుపయోగిస్తూ ఆ భూమిని బాగుచెయ్యడం కోసం తన మగడు పడ్డ కష్టాన్నీ, దానిమీద ఆయన పెట్టుకున్న ఆశల్నీ జ్ఞాపకం వున్నంతవరకు వర్ణిస్తూంది.

"ఇంత రాత్రేళ ఎందుకన్నా వినకుండా, గొరకొయ్యలు నెత్తికొచ్చే యని పరుగు పరుగున వెళ్ళి, రౌతులేరి చదునుచేసి గట్టువేస్తివయ్యో ! కొడుకు పెద్దవా డౌతాడు కోడలొస్తుంది, ఇంత తిండి తింటారని ఎంతెంత లేసి ఆశ లెట్టుకుంటివయ్యో !...."

సరయ్య రోజుకుంటూ పరుగెత్తి రావడం చూసేకా, వీరమ్మ లబ దిబలు విన్నాకా వీధివాళ్ళందరికీ విషయం అర్థంఅయింది. పొలాలనుంచి

వస్తున్నవాళ్ళు భుజానవున్న సామానులు వీధిలోనే చెట్టుక్రింద పడేసి, లోపలికి వచ్చి పరామర్శ చేస్తున్నారు. సలహాలు చెప్తున్నారు. వేదాంతం బోధిస్తున్నారు. ఇరుగు పొరుగమ్మలు సానుభూతి ప్రకటిస్తున్నారు.

"ఇంతే ప్రాప్తం...."

"దేవుడన్నా మరిచిపోతాడుగాని—"

సరయ్యగొంతువిని సత్తెమ్మ బయటికి వచ్చింది. ఆతడు తోటలో జరిగిన విషయాలన్నీ మొట్టమొదటి మారుగా వివరంగా చెప్పేడు.

సత్తెమ్మ కళ్ళల్లో భుగభుగలు కనిపించేయి. ఆ ఆకారాన్ని చూస్తూంటేనే వచ్చినవాళ్ళంతా ఆశ్చర్యంతో నోరు తెరిచారు.

ఆమె తల్లిలా ఏడవలేదు. వినవచ్చిన జనం ఓదార్పులూ వినలేదు. దృఢంగా అడుగులేస్తూ వెళ్ళి పంచలోంచి చిటికెనవ్రేలు లావూ, బారెడు పొడుగూ జువ్వకర్ర లాగింది.

తల్లి ఏడ్పుమాని, సగంలోనే మాటనిలిపి, ఆశ్చర్యంతో నోరు తెరిచి కూతురువంక చూస్తూంది. ఆ జువ్వకర్ర ఎవరికోసమో ఆమె కర్థంకాలేదు. ఈ గంద్రగోళాలు వచ్చేక కూతు రామె కర్థం కావడమేలేదు. ఈ మూడు నెలలలో కూతురులో ఆ చురుకుదనం చూడలేదు. ఎప్పుడూ నీరసంగా, నిర్లక్ష్యంగా, నాకెందుకొచ్చిందిలే అన్నట్లు వుంటున్న మనిషి ఒక్క-క్షణంలో పూర్వాకారం ధరించింది. ఆ జువ్వ తీసింది. అది ఎందుకో, ఏం చేయబోతూందో, ఏడుస్తున్నందుకు తన్ను వడ్డించదుకద? ఎందుకేనా మంచివని చూడవచ్చిన ఇరుగు పొరుగమ్మల మధ్యకు జరిగింది.

కాని సత్తెమ్మ అటువంటిదేమీ చెయ్యలేదు. అసలు అక్కడున్న వాళ్ళ వేపు చూడనేలేదు. జువ్వకర్రతో వాకిట్లోకి వచ్చింది. సరయ్యను నడవ మంది. రెండోమాట కూడా లేకుండా, వెనక తిరిగి చూడకుండా చరచరా నడిచిపోతూంది.

ఆమె ఎక్కడికి బయలుదేరిందో, తనను ఎక్కడికి నడవమన్నదో సరయ్యకు అర్థంకాలేదు. కళ్ళింతచేసుకొని ఆమె పోయినవేపే చూస్తూ ఒక్కనిముషం నిలబడ్డాడు.

సత్తెమ్మ వీధిమలుపు తిరిగేసరికి తెలిసింది. పొలంవైపే వెడుతూంది. అంటే భూమిమీదికొచ్చిన వాళ్ళని ఎదుర్కోడానికి బయలుదేరుతూం దన్నమాట. ఒక్కర్తే అంతధైర్యంగా కదలడం ఆశ్చర్యం అయింది. ఆమె సాహసానికి ఓవైపున సంతోషం కలిగింది. కాని మరుక్షణంలో భయమూ వేసింది. పొలం ఆక్రమించిన దొరకు బలగంవుంది. ప్రభుత్వం వత్తాసుక్షణంలో వస్తుంది. "నాభూమి నాక్రమిస్తున్నాడు మొర్రో" యని మొత్తుకున్నా బీదవాడిమాటా, రైతుమాటా ఏప్రభుత్వమూ పట్టించుకోదు. అదే దొరలయితే ? "వాడిభూమి దున్నుతానంటే ఒప్పుకోడంలే" దని కాకిచేత కబురంపినా మందీ మార్బలం దిగుతుంది. ఈ అన్యాయాన్ని ఎది రించడానికే తమప్రయత్నం. అయితేనేం ? సత్తెమ్మ జువ్వాకర్ర పుచ్చుకొనే సరికి కంగారుపుట్టింది. ఆడకూతురు ఒక్కర్తే ఏం చెయ్యగలదు ?

సరయ్య కంగారుగా పిలుస్తూ, తడబడుతూ పరుగు ప్రారంభించేవరకూ అసలువిషయం ఎవ్వరికీ తెలియలేదు. తెలిసేక నలుగురూ సత్తెమ్మని పట్టుకోడానికి లేచేరు. ఆపండని ఒక రొకరికి పురమాయించేరు.

జనంతోపాటు వీరమ్మా ఆదుర్దాగా లేచింది.

"సత్తెమ్మతల్లీ ! నిలబడవే. ఏమర్రా నాయనా ! దానిని ఆపండర్రా."

జానకిరామయ్య కండువా నడుముకి చుడుతూ "ఆపడం ఎందుకు నడవండేస్సి"–అన్నాడు.

ఆతడు చేసుకునేదీ కౌలుభూమే. ఈ వరసచూస్తే తాను బచాయించేది అసంభవం. ఈవేళకాకపోతే రేపయినా తనభూమీ గొడవలోపడేదే. చేసు కొంటూ చేసుకొంటున్న భూమినల్లా నాకిచ్చెయ్యమని కూర్చుంటుంటే

మందిగ్రబతికేదెల్లా. జానకిరామయ్యనిన్నటినుంచీ అదే ఆలోచనలోవున్నాడు. సత్తెమ్మ పూరుకున్నా తనభూమి నడిగితే ఏమైనా ఇవ్వకూడదని నిర్ణయం చేసుకొన్నాడు. ఇప్పుడు సత్తెమ్మా తాను అనుకొన్నదే చేస్తూంది. ఆమెని ఆపడం ఎందుకు ?

సత్తెమ్మ ఎవరిమాటా ఎవరిపిలుపూ వినిపించుకోలేదు. చరచరా నడుస్తూంది. చేతిలోని జువ్వకర్ర వెనక్కీ ముందుకీ వూగుతూ, ఆమె అడుగుతో లయ కలుపుతూంది.

వెనకనుంచి వస్తున్న జనాన్ని ఆమె గమనించలేదు. ఈ హడావుడి నంతా చూసి వీధుల్లోకి వచ్చేశారు. ఆడా మగా, అంతా తలోవిధంగా తలో మాటా అంటున్నారు.

వీరేశలింగం వెనకనుండివస్తున్న వీరమ్మను పలకరించేడు. ఆమె గిడగిడలాడింది.

"తీసుకురారాబాబూ ! పొలం పోతే పోయింది. పోలీసాళ్ళ దెబ్బలు కూడా ఎక్కడతినం ?"

పోలీసులు, దెబ్బలు అనేమాట వినేసరికి ఏడాదిక్రితం గ్రామంమీద జరిగినదాడులు జ్ఞాపకంవచ్చేయి. ఇప్పటికీ సూర్యాపేట తాలూకా గ్రామాల మీద గుర్రపుదళాలు దాడిచేస్తూనే వున్నట్లు కర్ణాకర్ణిగా వింటూనేవున్నారు. వీరేశలింగం సమాధానంకూడా ఇవ్వకుండా లోపలి కెళ్ళిపోయాడు.

వెనకనే వస్తున్న జానకిరామయ్య ఎగతాళిగా చూసేడు. గుమ్మాల్లో నిలబడివున్న నలుగురు ముగ్గుర్నీ పిలిచేడు.

"రాండేసి."

పిలిచేడే గాని వస్తున్నదీ లేనిదీ చూడకుండా పరుగెత్తాడు.

వీరమ్మా, ఆమె వెనక కోడలూ సత్తెమ్మను తీసుకు రావడానికి చక చకా నడుస్తున్నారు. ఆయాసంతో రొప్పుతున్నారు.

సాతాని బూసయ్య తోడు కదిలేడు.

"నడవండి. తొందర పడనివ్వకండి."

వీధి మొగలో కోటమ్మ ఎదురయింది. చంకనున్న పిల్లగాణ్ణి అరుగు మీద కూలబడేసి పైటకొంగు నడుముకు చుట్టింది.

"రాండి. నేనూవస్తున్నా."

పదడుగులు వేసింది. నడివీధిలో నిలబడి వెనక్కి జారుకుంటున్న వాళ్ళని తిట్టడం మొదలెట్టింది.

"మగాళ్ల. ఆడకూతురుపాటి చొరవలేదు. థూ...."

కోటమ్మ నోటిదురుసు మనిషి. ఎంతవాడినీ, ఇట్టే మాట అనేస్తుంది.

ఆమె కేకలూ, హడావిడీ జనంలోని నిస్తబ్దతను వొదలకొట్టేయి. వీధి గుమ్మాల్లోనూ, పెరటి గుమ్మాల్లోనూ నిలబడ్డ ఆడవాళ్ళంతా కోటమ్మను చూసి కదిలారు. ఎడ పిల్లల్ని వదిలించుకొనీ, చంటిపిల్లల్ని చంకనేసుకొనీ వెంటబడ్డారు. ఆడవాళ్లు కదలడంతో మగాళ్లు అరుగులు దిగేరు. పది నిముషాల్లో జనం పుంతలకీ, చెలకలకీ అడ్డుపడి బోళ్ళపొలం వైపు పరుగెత్తుతున్నారు.

సత్తెమ్మ ఈ గంద్రగోళాన్ని గమనించలేదు. పిలుపులూ, హెచ్చరికలూ కూడా ఆమె చెవి చొరడంలేదు. తన వెంట జనం వస్తున్నారనే ధ్యానంకూడాలేదు. పొలాన్ని ఆక్రమించడానికి వచ్చేరన్న మాట ఒక్కటే సర్వగ్రాసిగా ఆమె మెదడుని ఆక్రమించి వుంది.

వచ్చినవాడు కూడా కిష్టయ్య అనే సరికి ఆమె ఆవేశానికి అంతే లేకుండావుంది. నిరుడు వెంకటయ్యను దగ్గరుండి కొట్టించిన నాటినుంచీ కిష్టయ్య అంటే ఆమెకు తగని కోపం. ఆతడిని ఏమీ చెయ్యలేక పోయిన అసహాయస్థితి ఆ ద్వేషాన్నింతకాలమూ మనస్సులో అణచి వుంచింది. నేడు ఆతడే తన పొలాన్ని ఆక్రమించడానికి వచ్చేడు.

సత్తెమ్మ పుంతదాటింది. బోర్లలో నడుస్తూంది. గట్టు తిరిగితే బావి. వీరమ్మకి పొలం పోతుందనే ఆదుర్దాకన్న తర్వాత రాగల బాధలు ఎక్కువ ఆందోళనకరంగా వున్నాయి. దొర భూమిని పట్టుకు పోతాడు. తాము కొనుక్కొన్న నలభయ్యేభయ్యేకరాల చెలకా వుండనేవుంది. చేసుకు బ్రతకొచ్చు. కాని, ఇప్పుడు రగడ పడితే దొరతో వ్యవహారం. ఆయన కొడుకు సర్కిల్ ఇన్‌స్పెక్టరు కూడా. సర్కారు వాళ్ళ తరపు. తమ కొంప పీకేస్తారు. ఊళ్ళోంచికూడా లేచి పోవలసిందేగాని నిలబడ్డాని క్కూడా దారుండదు.

కాని, ఆమె మాటలు వినేటందుకూ, జౌగాములు ఆలోచించే టందుకూ సత్తెమ్మ అ ప్రాంతాలకూడాలేదు. నడవలేక వీరమ్మ బాగా వెనకబడింది. ఊరిజనం కూడా ఆమెను దిగతొక్కి పోతున్నారు. ఏం చెయ్యలేని కోపం వచ్చింది. చేతగాని తనాన్ని తిట్లలో ప్రకటిస్తూంది. అసలు ఈ గొడవకి మూలకారణం సత్తెమ్మే ననికూడా ఆమె నమ్మకం. చేసింది చాలక ఇప్పు డింకా పీకమీదికి తెస్తుందని భయం.

వెనకనే వస్తున్న గొల్ల భాగయ్య చెయ్యి పట్టుకొంది. సత్తెమ్మతల్లిని నిలుపుతే ఆతని కడుపున పుడతానని వాగ్దానం చేసింది.

వెంకటయ్యకు భాగయ్య స్నేహితుడు. తన యిల్లు వదిలి పోయేక వెంకటయ్య ఆతని ఇంట్లోనే మకాం కూడా. వీరమ్మ ఆ విషయా న్నెరుగును. మరొక సమయం అయితే తన కూతురు విషయంలో ఆతని సహాయాన్ని వీరమ్మ కోరివుండేదేకాదు। కాని ఇప్పుడా అనుమానాలూ. ద్వేషాలూ గుర్తువచ్చే స్థితికాదు. ఆయాసంతో రొప్పుతూ. రోజుతూ. జారి పోతున్న పైటకొంగు నడుంచుట్టూతిప్పి మొలలోదోపి, ప్రక్కనున్న రాతి బండమీద చదికిలబడింది. వెనక వస్తున్న జనం ఆమెను అక్కడే వుండ మంటూ, గబ గబ ముందుకు పరుగెత్తు తున్నారు. ధైర్యంకోసం వెనక వస్తున్న వాళ్ళను పిలుస్తున్నారు. మళ్ళీ నడుస్తున్నారు.

పొలం సమీపించినకొద్దీ సత్తెమ్మ నడక తీవ్రం అయింది. అడుగు వడి నడకవడి అయింది. అది పరుగయింది. గట్టు తిరిగి పొలం కోరడి గుమ్మంలోకి వచ్చేసరికి చెట్లచాటున పాక కెదురుగానున్న నిలువెత్తు గుండ్రాయిమీద కూర్చున్న కిష్టయ్య కనబడ్డాడు. బండమీదలేచి నిలబడ్డాడు. ఎందుకో తమ వూరివేపే చూస్తున్నాడు.

సత్తెమ్మ కోరడిదాటి. చెట్లుదాటి తాను కూర్చున్న బండవద్దకు వస్తున్నా కిష్టయ్య ఆమెను గమనించనేలేదు. ఆతనిదృష్టి దూరాన వినిపిస్తున్న కోలాహలంమీద కేంద్రీకరించివుంది.

దూరాన ఏవోకేకలూ, పిలుపులూ వినబడుతున్నట్లయి కూర్చున్న వాడల్లా లేచి నిలబడ్డాడు. దూరాన వూరివేపునుంచి జనం పరుగెత్తివస్తూ కనబడ్డారు. మనుష్యుల్ని గుర్తుపట్టేటంత దూరంలోలేరు. రంగురంగుల బట్టలు అన్నీ ఆడవాళ్ళవి. పంచెలు, ఎర్రరంగు గళ్ళకండువాలూ, నల్ల కంబళ్ల వాళ్ళంతా మగాళ్లు. అందరూ పరుగెత్తి వస్తున్నారు. తానున్నవేపే పుంతలకీ, చెలకలకీ అడ్డపడి వస్తున్నారుకూడా. చేతులుఎత్తి ఏదోకేకలు వేస్తున్నారు. ఎదురుగాలిలో మాట వినబడ్డంలేదు. చేతులెత్తుతూ వూపుతున్నారు. అది పిడికిళ్లుబిగించి. గద్దరిస్తూన్నట్లు కనిపిస్తూంది.

ఏడాదిక్రితం వూళ్ళో 'సంగం' ఏర్పడిన సంగతి జ్ఞాపకం వచ్చింది. ఆ రోజున వూరేగింపులో వాళ్ళంతా పిడికిళ్లు బిగించి చేతులు ఇల్లాగే ఎగరేసేరు. పద్దాలును తీసుకెళ్ళలేక చేతులూపుకుంటూ తాను తిరిగిపోతూంటే ఇల్లాగే రణగొణధ్వని చేశారు.

తర్వాత వాళ్ళమీద తాను కసితీర్చుకొన్నవిధం గుర్తువచ్చి హడలిపోయేడు. వాళ్ళనితాను స్వయంగా కొట్టేడు. కొట్టించేడు. మంచినీళ్లు అడుగుతే నోట్లో వుచ్చపోసేడు. ఒకడికి కాళ్ళు మెలితిప్పించేసేడు. అవన్నీ నేడు తాను అనుభవించాలసి వస్తుందనిపించింది. భయంతో రాతినుంచి

ఒక్కవురుకు వురికేడు. అదే ఆతణ్ణి రక్షించింది. లేకపోతే సత్తెమ్మ బలం కొద్దీ సాచికొట్టిన జువ్వకర్ర దెబ్బకు వీపు పొడుగునా చర్మం లేచిపోయేది.

అంతదెబ్బా తినవలసిన కిష్టయ్యా తప్పించుకోడంతో ఆ వూతానికి సత్తెమ్మ ముందుకి తూలిపోయింది. బండ్రాయికి తగిలి కర్ర కణుపులోనికి విరిగిపోయింది. దెబ్బ నిజానికి తగలక పోయినా చప్పుడువిని వెనక తిరిగి చూసిన కిష్టయ్యకి అంతదెబ్బా వీపునపడ్డట్లే అనిపించింది. సత్తెమ్మ తూలు పాటు సర్దుకొని లేచేలోపున ఏభయ్యేళ్ళమనిషీ పాతికేళ్ళవాడిలాగ కోరడి మీదుగా లంఘిస్తున్నాడు.

సత్తెమ్మ వెనక్కాలనే తోటలోకి చొరుచుకువచ్చినజనం కిష్టయ్యా వీపు తడుముకుంటూ కంచెవురికి పారిపోడంచూసి విజయధ్వని చేసేరు. ఆ విధంగా తరిమిన సత్తెమ్మను భేషుక్కయినపని చేసేవన్నారు. ఆమెను వెనక్కి పిలుచుకు పోవాలని వచ్చినవారుకూడా తమ వుద్దేశాన్ని మరచి పోయేరు. కిష్టయ్యా పారిపోతో మంది భయాన్నికూడా వీపునవేసుకొనే పోయేడు. పారిపోయేవాడిని తరమడం ఓ హుషారు. ఆలాగే అంతా కిష్టయ్యా వెంటబడ్డారు. కాని, ఆతడు చిక్కలేదు. ప్రాణభయంతో ఆతడు కోరడి అవలీలగా దాటేసేడు. వెంటవచ్చిన వాళ్ళ కది సాధ్యంకాలేదు. ఒకళ్ళిద్దరు ముళ్ళకంచె తప్పించడానికి ప్రయత్నించేరు. సాధ్యంకాలేదు. ఇంక ఏపనీచెయ్యలేక కోరడి లోపలే నిలబడి, బూతులుతిడుతూ కిష్టయ్యా కాళ్ళకి మరింత ప్రోత్సాహం ఇవ్వడం ప్రారంభించేరు.

* * * *

విరిగిపోయిన కర్రముక్కతో లేచి నిలబడి సత్తెమ్మ పాకవైపు తిరిగింది. ఆమె రౌద్రాకారం, కిష్టయ్యా పలాయనంచూసేక దొరగారిపాలేళ్లు నిలువునా వొణుకుతున్నారు. పక్కపక్కల్ని చొడుగుతూ సందుదొరికితే పారిపోవాలని చూస్తున్నారు. కాని తోటఅంతా జనం నిండిపోయేరు.

ఇంతలో సత్తెమ్మ వాళ్ళవేపు తిరిగింది. ఆచూపులోనే కర్రలు వీపులమీద నాట్యం ఆడుతున్నంతబాధను అనుభవించేరు. క్షమార్పణలు చెప్పుకొంటు న్నారు. మరెప్పుడూ రామని వాగ్దానాలు చేస్తున్నారు.

సత్తెమ్మ ఏమీఅనలేదు. కాని, ఆమెతో వచ్చినజనం వుత్సాహం పట్టలేకుండా వున్నారు. మహాదర్పంగా రొమ్ములు విరుచుకొని తిరిగిన కిష్టయ్య చుంచులా పారిపోతూండగాచూసి తమబలాన్ని గుర్తించేరు. ఆత నితో వచ్చినజనం? వాళ్ళూ గజగజలాడిపోతున్నారు. తమబలాన్ని గుర్తిం చిన వుత్సాహంలో పొలంఅంతా కలగదొక్కుతున్నారు. ఎదుట వున్న వాళ్ళనీ, లేనివాళ్ళనీ చుట్టపెట్టి బూతులు తిడుతున్నారు.

"కొడుకుల్ని పక్కలిరగతన్నండి."

"మీ దొర ముల్లెగాని దాచిపెట్టేదనుకున్నారంట్రా ?"

సత్తెమ్మ వాళ్ళని కొట్టవద్దంది. నిర్లక్ష్యంగా పొమ్మంది. ఆమాట నోటరావడం తడువు కందెనవేసిన బండిచక్రాల్లా కాళ్ళు చక చక పరుగెత్తేయి.

ఎక్కడనుంచి వచ్చేడో మంగలి వెంకన్న మందిముందు చేతులు నలుపుతూ నిలబడ్డాడు. ఆతనిభూముల్ని ఒక్కవారంక్రితమే దొర స్వాధీనం చేసుకొన్నాడు. తన పొలాన్నికూడా విడిపించమని ఆతని ప్రార్థన.

విజేతలంతా పెద్దపెద్ద కేకలుపెడుతూ ఆ పొలంవైపు నడిచేరు. విడి పించడానికి అక్కడ వారి నడ్డపెట్టేదేదీలేదు. పొలంచుట్టూ చివరికి కోరడి కూడాలేదు. దానిని దొర స్వాధీనపరచుకొన్నాడనిగాని, అది దొరలదని గాని చెప్పేటందుకు గుర్తుకూడాలేదు. లేకపోయినా ఆస్తిస్వత్వాలమీద రైతు వానికున్నభక్తి సుగ్రీవాజ్ఞలాంటిది. తానుగా ఆ స్వత్వాన్ని త్రోసిపుచ్చలేదు.

మంద - ఆడా మగా అంతా చెలక దగ్గిరి కొచ్చేరు. వెంకన్న మహా సంతోషంతో చేతులు నలుపుకుంటూ భూమిలోకిదిగి అలంగం తొక్కేడు.

"నీపొలం నువ్వు చేసుకో. ఒకరి గోడేమిటి ?"

మంది అనుజ్ఞ తీసుకొని వెంకన్న పొలంపని అప్పుడే ప్రారంభించేడు. పనంటే ఏముంది ? చెలకలో వున్నరాళ్ళన్నీ ఏరి గట్టున పడేసేడు. రెండు జిల్లేడుమొక్కలు తొక్కేసేడు.

జనం మహోత్సాహంతో గర్జించింది.



## ఒ క టో ప్ర క ర ణం

రంగయ్య పూళ్ళోకి తిరిగి వచ్చేసరికి గ్రామం ఏమీ జరగనట్లే నిత్య కృత్యాలలో మునిగిపోయింది.

జోళ్ళపాలెం బావికడ నలుగురూ విడిపోయేక ఎవరికివారే ఆలోచనల్లో పడిపోయేరు. వారిని కలిపి నిలవబెట్టే బంధంలేదు. ఒక నిర్మాణం ఏర్పడి వారికి దారిచూపే స్థితిలేదు. పైగా ఇంటికి వచ్చేసరికి ఇళ్ళవద్ద దొరికినధైర్యం. ప్రోత్సాహంకూడా చాల స్వల్పం. అందులో పోలీసు దాడుల్ని చవిచూసి పది నెలలుకూడా కాలేదు. ఆనాటి దెబ్బల కదుములు ఇంకా 'కరేల్' మంటూనే వున్నాయి.

" నీ కెందుకొచ్చిన గొడవలురా పిల్లగ ! "

" పోలీసోళ్ళు పక్కలిరగదంచుతే ఎవరు కాస్తారు ? "

" దొరలతో కోడెమంట్రా. ? "

" మన్నికూడా భూమినుంచి లేచి పొమ్మంటే ? "

అనేక దృక్కోణాలనుంచి అనేక వ్యాఖ్యలు, సలహాలు, ప్రార్థనలు, బెదిరింపులు, తిట్లు.

కొందరు నిశ్శబ్దంగా వున్నారు. మనస్సులో బెరుకు కలిగినా పైకి గంభీరంగా మెసులు కుంటున్నారు. కొందరు తాము ఏమీ చెయ్యలేదని చెప్పుకొన్నారు. మరికొందరు 'పోవే నీ గొడవేమిటి' అని గదుము తున్నారు. కొద్దిమంది మాత్రం మొండికేసేరు. ఇంతకంటె కొత్తబాధలు ఏం వొస్తాయి చూద్దాంలే - అనే మొండితనం కనబరిచేరు.

కాని, అందరూ కూడా ఏదో జరగ గలదనే విషయంలో ఏకాభిప్రాయం ప్రకటించేరు. ఎవరికి వారు గాంభీర్యం. అమాయికత్వం, మొండి

తనం చూపిస్తూనే బంధువుల యిళ్ళూ, వాళ్ళ యోగక్షేమాలు స్వయంగా తెలుసుకు రావలసిన అవసరాలూ జ్ఞాపకం చేసుకొన్నారు. కొందరికి పట్నంలో వ్యవహారాలు మురిగిపోతున్న ప్రమాదం గుర్తువచ్చింది. అవీ, యివీ లేనివాళ్ళూ, పొలం పనులున్నవాళ్ళూ బావుల దగ్గిరికి చేరుకొన్నారు. మొత్తంమీద మధ్యాహ్నం అయ్యేసరికి గ్రామంలో వయస్సు వచ్చిన మగాడు లేకుండా వెళ్ళిపోయేరు.

వూళ్ళో యిళ్ళలో ఆడవాళ్ళూ, పిల్లలే మిగిలేరు. టిక్కు టిక్కు మంటూ అలికిడైనప్పుడల్లా అదిరి, అదిరి పడుతూ నీడల్లాగా తిరుగుతున్నారు. పిల్లల్ని ఇంటివద్దనే పడుండమని గదుముతున్నారు. ఎవరన్నా వస్తున్నారేమో చూడమని పొరుగింటి పిల్లలకి పురమాయిస్తున్నారు.

పిల్లవాళ్ళందరికీ తమ ప్రాముఖ్యత అర్థం అయింది. ప్రతి యింటివాళ్ళూ తమ సాయం కోరుతున్నారు. పోలీసాళ్లు వస్తారని పెద్దవాళ్ళంతా భయపడుతున్నారు. ఆ పోలీసుల రాకపోకల్ని గమనించి చెప్పే బాధ్యత తమమీద పెడుతున్నారు. మనస్సులో పోలీసాళ్ళు కొడతారేమోననేభయం మధ్య మధ్య పీడిస్తున్నా, హఠాత్తుగా తమమీద పడ్డ పెద్దరికాన్ని వారు వదులుకోడానికి ఇష్టపడ్డంలేదు. ఎవరికి వారే తమతో వెంటబడుతున్న తమ్ముళ్ళనీ, చెల్లెళ్ళనీ పోలీసులు కొడతారని బెదిరించి వెనక్కు పంపెయ్యాలని ప్రయత్నిస్తున్నారు. ఆ బెదిరింపు పనిచేయనప్పుడు తామే రెండు కొడుతున్నారు. అదీ పనిచెయ్యనప్పుడు గికురించి పారిపోతున్నారు. తప్పించుకుపోవడం కూడా సాధ్యంకానప్పుడు విసుగూ కోపంతో "నీయమ్మ నేమో చెయ్యా...."యని బూతులకు లంకించు కొంటున్నారు.

కదల మెదలలేని ముసలివాళ్లు కర్రల సాయంతో ఏ చెట్టుకిందికో చేరి దవడలు పీకేలాగ పచ్చాకు చుట్టలు ముట్టించేరు. బాతాఖానీ కొట్టడానికి ప్రయత్నించేరు. కాని రోజూలాగ మాటలు సాగడంలేదు. అందరిదృష్టి

వేరేచోటవుంది. అందుచేత ఏ అంశం ఎత్తుకున్నా రెండు మూడు మాట లతో మొండిపడి పోతూంది.

వాళ్ళ చెవులు వూరివెలపల వున్నాయి. కళ్లు వీధిమూలల్లో వున్నాయి. మసకబారిన కళ్లు పత్తికాయలు చేసుకొని వీధిలో కనబడిన నీడల్ని గుర్తిం చడానికై ప్రయత్నిస్తున్నారు. ఎంతసేపటికీ తాము·ఎదురు చూస్తున్నవాళ్లు రావడంలేదు. విసుగుపుట్టి, చుట్టనలిపి చెవిలో పెట్టుకొని లేస్తున్నారు. దేని కోసమో వెతుకుతున్నట్లు ఆత్మప్రదక్షిణంచేసి మళ్ళీ కూర్చుంటున్నారు. తెగిపోయిన సంభాషణల్ని మళ్ళీ ప్రారంభించడానికై వ్యర్థప్రయత్నాలు చేస్తున్నారు.

కోటమ్మ వూరి వెలపల బాట పక్కనున్న బండమీద బుట్టెడు ఆముదాలు ఆరబోసి కర్రొకటి పట్టుకు కూర్చుంది. పొద్దుటి ఘటనలో ఆమె తీసుకొన్న పాత్ర భర్తకి నచ్చలేదు. ఇద్దరూ కొట్లాడుకున్నారు. ఈ ప్రోత్సాహం నువ్వే యిచ్చేవని, నిన్ను కట్టుకున్నందుకు నన్ను కొడ తారే యని మొత్తుకొన్నాడు. కలగబోయే బాధని తలుచుకొని, ముందు గానే పంచనున్న కర్రతీసి రెండు తగిలించేడు. కోటమ్మ అతని మొగం మీద నఖక్షతా లుంచింది. అతడామె కుటుంబం వాళ్ళ గయ్యాళి తనాన్ని పట్టుకొని తిట్టేడు. అతని కుటుంబం వాళ్ళలో పెళ్ళాన్ని కొట్టడానికితప్ప మరో మగతనం లేదని సోదాహరణంగా లెక్కచెప్పింది. తమ పిల్లలకి ఇద్దరిలో ఎవరిపోలికలు వస్తాయోనని ఇద్దరూ భయం ప్రకటించేరు. మాట ల్లో నెగ్గలేక 'అమ్మ ఆలీ' బూతుల కెక్కువ ప్రాముఖ్యత ఇచ్చేడు. పోలీ సువాళ్ళువచ్చి మానభంగ ప్రక్రియని ఏవిధంగా జరుపుతారో వర్ణించేడు.

కోటమ్మ మగని చేతకానితనాన్ని దులిపేసింది.

ఆ మాటల్నే ఇప్పుడు బండమీద కూర్చుని చుట్టూ చేరిన ఆడవా ళ్ళకి బోధిస్తూంది.

" తుపాకులూవద్దు తూటాలూవద్దు. సంకట్లోకిచేసుకున్న కారపు గుండ ఓ పిడికెడు తీసుకొని గాలిబారున నిలబడికొడితే నాకొడుకులు...."

గుండ ఎల్లాతయ్యాలో, ఎల్లావిసరాలో, ఫలితాలు ఏలావుంటాయో వర్ణిస్తూంటే దారినపోయేవాళ్ళు ఓ నిముషం నిలబడి ఆనందిస్తున్నారు. ఆఖరున ప్రపంచరహస్యాన్ని చెప్పేసి కోటమ్మ తన వాదాన్ని ముగించింది.

" పరుగెత్తేవాణ్ణి గొర్రె తరుముతుంది. నిలబడితే నిప్పులుకూడా ఆరిపోతాయి. "

* * *

సాయంకాలం అయింది; ఏమీ జరగలేదు. పోలీసులురాలేదు. కనీసం దొరగారి మనుష్యులుకూడా రాలేదు. ఏమిటో రహస్యం ఎవరికీ అర్థం కావడములేదు. చిన్నదానికీ పెద్దదానికీ, సంబంధం వున్నవాళ్ళకీ లేనివాళ్ళకీ కబుర్లమీద కబుర్లువచ్చేవి. ఇప్పుడేమీలేవు. ఎందుచేతనో. కబురువస్తుందేమోననేది ఓ భయం. రాకపోయినా భయమే. కారణం ఎవ్వరికీ తెలియదు. తెలుసుకొనేటందుకు మార్గమూలేదు.

ఊరికి రమారమీ మైలుదూరంలో చెరువునానుకొని ఎత్తుబండమీద దొరగారి గఢీవుంది. వూళ్ళోకల్లా కాస్తవున్న ఆసాముల పదిఇళ్లూ అక్కడే వున్నాయి. అంతా పందిరిరాటకి పనులు చెప్పేరకం. కనక ఎంతపనున్నా ఆ దారిని వెళ్ళే అలవాటు వూళ్ళోవాళ్ళకిలేదు. అక్కడ ఏం జరుగుతుందో తెలియడం యెల్లాగ? సేతుసిందీ గోవిందునడిగితే తెలుస్తుంది. తీరా ఆతని కోసం వెడితే వూళ్ళో లేడంది. ఆతనిపెళ్ళాం. ఎక్కడి కెళ్ళేడంటే దొర పంపేడంది. ఇంకేముందని వచ్చినవాడు రెండోప్రశ్న వెయ్యకుండా పరుగెత్తేడు. కాని, ఆ భయం అనవసరమని అప్పుడే తెలిసిపోయింది. దొర ఆతడిని పంపించి రెండురోజులయింది. ఆ మాటవిని పరుగెత్తుతున్నవాళ్ల నిలబడి "నిజమేనా?" అని అడిగేరు.

మళ్ళీ ప్రయత్నం ప్రారంభం అయింది. ఈమారు మాలగూడెం పెద్ద శీనయ్యనుంచి భోగట్టాతియ్యడానికి ప్రయత్నించేరు. శీనయ్యే మరో సేతుసిందీ.

ఎప్పుడు పిలవడానికి వెళ్ళినా తన్నుతిట్టి, పటేల్‌చేత తిట్లు తినిపించే రైతులు నేడు ఇరుకునపడం శీనయ్యకు చాలా సంతోషంగావుంది.

గూడెం నలుగురినీ పిలిచి పోగుచేసేడు. రైతులమీద దొర ఎల్లా కసి తీర్చుకొంటాడో చెప్తుండగా గొల్లభాగయ్య వచ్చేడు. ఏదో పెద్దపని వున్నట్లు వొచ్చి అసలు విషయం తెలుసుకోవాలనుకొంటున్న భోగయ్యని ఎగతాళి చేసేడు.

"ఏమయ్యోవ్ గొల్లాయన? ఏమన్నా రెండెకరాలన్నా కిట్టుబాటయ్యేనా?"

భాగయ్యకి కోపంవచ్చింది. మళ్ళీ ఎత్తిపొడిచేడు.

"నీఅల్లుడికి పటేల్‌గిరీ దొరకలా?"

నిరుడువెట్టి వ్యతిరేకపోరాటాల కాలంతో మాలలు వుద్యమంలో చేరకుండా విడదీసేటందుకై నిజాంప్రభుత్వం ఓ ఎత్తుగడ వేసింది. మాలలకు ముస్లింమతం ఇచ్చేటందుకు జరిగిన ప్రయత్నాలు ఇదివరకే విఫలం అయ్యాయి. ఈమారు మతంతోపాటు ఇతరఆశలుకూడా చూపించ ప్రయత్నించేరు. గూడెంలో కాస్త నోరున్నవాడికి గ్రామపటేల్ పదవులనిచ్చేరు ఆ ఎగలో శీనయ్యఅల్లుడు సున్నతి చేయించుకొన్నాడు; పటేల్‌గిరి సంపాదించేడు.

కాని, వుళ్ళో పెద్దకులాల వొత్తిడికి మతంమార్పూ నిలబెట్టుకోలేక పోయేడు. పటేల్‌గిరీ పోయింది.

భాగయ్య ఎత్తిపొడుపు అనాలోచితం.

మాలవానికి వుద్యోగం ఇవ్వడం, వాళ్ళు ముందుకు రావడమూ ఇష్టంలేక పెద్దకులాలవాళ్లు చేసిన దౌర్జన్యంగానే వారు దానిని భావిస్తు

న్నారు. అందుమీద కొంతసేపు వాగ్వాదం జరిగింది. ఏమీ తేలలేదు. భాగయ్య వెళ్ళిపోయేడు.

దారిలో వెట్టిమాదిగ ఎదురయ్యేడు. కాని, అతను చెప్పగలదేమీ లేదు. ఆరోజున ఉత్తరం ఏదీ తీసుకొని ఎవ్వరూ పోలీసునాకాకి వెళ్ళ లేదు, కాని ఆ విషయంకూడా నమ్మకంగా చెప్పలేడు, మధ్యాహ్నమే కిష్టయ్య ఎక్కడికో వెళ్ళేడు.

అంతే; ఇంక లాభంలేకపోయింది. ఆ ప్రయత్నం ఆగింది.

చీకటిపడింది మొదలుకొని జనం ఒక్కొక్కరే అడుగులో అడుగు వేసుకుంటూ ఊళ్ళోకి వస్తున్నారు. ఇంటివద్ద ఏదో దుర్వార్త విన బడుతుందనే ఆశంక. కానీ, అటువంటిదేమీ జరగదేదు. ఇంటిపై ఆకుకూడా కదలలేదు. కదలకపోవడంకూడా అనుమానించదగిందే. ఎందుకు కదల లేదు ?....చడిచప్పుడు లేకుండా మూకుళ్ళు నాకేసేరు. గొంగళ్ళు భుజాన వేసుకొన్నారు.

బొద్దురావివద్ద పదిమందీచేరేరు. ఆలోచన ప్రారంభించేరు.

దొర ఆలోచన ఏమిటిగానీ, ఈ ప్రశాంతస్థితికి మోసపోరాదని అంతా ఏకాభిప్రాయానికి వచ్చేరు. తెల్లవారగట్ల ప్రజలంతా ఆదమరచి వున్నప్పుడు పోలీసుల్ని తెచ్చి చుట్టెయ్యాలనుకొంటున్నాడో యేమో: తెల్దారు పల్లెలో వాళ్లు చేసిందదే. గుర్రాలమీదకూడా పోలీసు బలగం వస్తుంది. రెండేసివూళ్ళని కొగిలేస్తారు. సరిగ్గా తెల్లారేముందే. మసక చీకటి వుండగా ప్రారంభం చేస్తారు. బయటికి పోయేవాళ్ళని కూడా నిలేస్తారు.

అప్పుడు ప్రారంభ మవుతుంది కొట్టుడు. పోలీసాళ్ళ ఫక్కీఅంతా ప్రజాశక్తిలో తుచ తప్పకుండా ఇచ్చేరు. తమ రహస్యాలని బయట పెడు తుందని, ఆ పత్రికని నిజాం సర్కారు నిషేధించింది. నిషేధించినా ఎల్లాగో

వస్తూనేవుంది. చాటునా మాటునా కొందరు అందులో విషయాలు చదువు తూనే వున్నారు. ఆవార్తలంతా వింటూనే వున్నారు.

తెల్లారగట్ల పోలీసులు వస్తేరావచ్చుననే ఆలోచన తోచేక అందరూ రాత్రిపూటే వూరొదిలి పోయేరు. బావుల దగ్గిరికి చేరుకున్నారు. ఆడవాళ్లు బిక్కు బిక్కు మంటూ ఇళ్ళల్లోనే వుండి పోయేరు.

తెల్లవారింది. సాయంత్రం అయింది. మళ్ళీ తెల్లవారింది. పోలీసుల పత్తాయేలేదు. శివరామిరెడ్డి ఆలోచనలూ బయట పడలేదు. ఒక్కటి నమ్మిక చిక్కింది. ఆయన ఏం చెయ్యబోవడంలేదు.

ఎందుచేత ?....

ఏం చేస్తాడో అన్న ప్రశ్న కెంత సమాధానమో దీనికీ అంతే సమాధానం. ఎందుకూరుకున్నాడంటే ఎవరేం చెప్తారు ?

కాని, జనం మనస్సులు సమాధానం లేదని సంతృప్తిపడి వూరుకో లేవు. తామే ఒక సమాధానం కల్పించుకొంటాయి.

అలాగే ఇప్పుడూ సమాధానం కల్పిత మయింది. జనం అంతా ఎదురు తిరిగేటప్పటికి దొర భయపడి వుంటాడు. వుంటాడేమిటి ? భయ పడ్డాడని చాకలి మంగమ్మ రేవులో అన్నట్లు ఎవరో అన్నారు. మంగమ్మ గఢీలో పనిచేస్తోంది. కనక నమ్మదగిన మాటే అయి వుంటుంది. తీరా వెళ్ళి అడిగితే ఆమె అమాటే ఎరగనంది. అయినా ఆమాట ప్రచారం అవనే అయింది. అంతా నమ్మనే నమ్మేరు. "దొర భయపడ్డాడ"నే మాట అందరి నోటా ప్రతిధ్వనించింది.

ఎంతో తటపటాయిస్తూ, భయంతో, పైకి తేల్చలేక తేల్చలేక వెలి బుచ్చిన ఈ అభిప్రాయం జనానికి జీవ కలిగించింది. దొరలకి భయంపుట్టిం చడం అంటే మాటలా ?

ప్రతివారూ తాము చేసిన పనిలో దొరకి అంత భయం కలిగించిన దేముందని ఆలోచించేరు. ఆలోచించినకొద్దీ ఆ రోజున తాము వేసిన ప్రతి మాటా అరివీరభయంకరంగానే కనబడింది.

కిష్టయ్యతో సత్తెమ్మ పేచీ పెట్టుకుంటే తమ కందరికీ చేటువస్తుందని భయపడ్డవారు కూడా ఆ విషయాన్నిప్పుడు పూర్తిగా మరిచిపోయేరు. ఇప్పటి ఆలోచనలువేరు. కిష్టయ్య ఎదురు తిరిగితే తాను ఎంతదెబ్బ ఎల్లా కొట్టేసేవాడో మనస్సులోనే వ్యూహయుద్ధం సాగించేరు. చివరకా వ్యూహయుద్ధం అంతా నిజమే ననుకొనే స్థితికివచ్చేరు.

రంగయ్యవచ్చి అడిగేసరికి అసలు జరిగిందేమిటో ఎవ్వరూ చెప్ప గల స్థితిలేదు. వాళ్లు చెప్తున్న కథాసాగరంలో నిజం ఏమిటో ఆతనికి అంతు చిక్కలేదు.

పొలం దరిదాపులకైనా వెళ్ళని తల్లి ఏమీ చెప్పలేక పోయింది. అమ్మి కర్రతీసుకు వెంటబడిందనీ. ఆమెను ఆపటం ఎవరితరం కాలేదనీ మాత్రమే ఆమె చెప్పగలింది.

భార్య మరికొన్ని వివరాలు చెప్పింది. కిష్టయ్య వీపున సత్తెమ్మ జువ్వకర్ర విరగ్గొట్టిందంది. ఆవార్తకి బలంగా చూరులోంచి విరిగిన జువ్వ కర్ర ముక్కతీసి చూపించింది.

ఈ ఘటన జరిగేక సత్తెమ్మ ఇంటిపట్టున వుండడమేలేదు. ఎప్పుడో వస్తుంది. ఇంత తిండి తింటుంది. వెళ్ళిపోతుంది. వెంకటయ్యతో మళ్ళీ సంబంధం పెట్టుకుందేమో నన్న అనుమానం మనస్సులో పీడిస్తున్నా వీరమ్మ ఆమెను ఆపడానికి సాహసించలేదు. ఏ క్షణంలో పోలీసులు వస్తారో, దొరికితే మానానికీ, ప్రాణానికీ కూడా మొప్పం. అందుచేత వచ్చినప్పు డింత తిండిపెట్టి వెంట వెంటనే పంపేస్తోంది ఒక్కొక్కప్పు డామె తిండికీ రావడంలేదు. ఎక్కడ తింటున్నావన్నా, ఎక్కడుంటున్నా వన్నా ఏమీ చెప్పదు.

రంగయ్యకి ఏంజరిగిందో, ఎల్లాజరిగిందో వివరాలు అర్థంకాక పోయినా తనభూమిని గ్రామం అంతాకలిసి కాపాడారనేది స్పష్టంఅయింది. తన అక్కగారిచొరవ ఆ పనిలో చాల వుపయోగించిందనికూడా గ్రహించేడు. వూరంతా సత్తెమ్మ చొరవని తెగపొగిడారు.

మామగారివద్ద తానుచేసిన ప్రతిజ్ఞా, దానిని అమలుజరిపేటందుకు వేసుకొన్న ఎత్తులు, చేయవలసి వుంటుందనుకొన్న పోరాటం,— తన కర్తృత్వంతో నిమిత్తం లేకుండానే కార్యరూపంలోకి వచ్చేసేయి. తాను చేయవలసినపని పూర్తయినందుకు సంతోషంగానేవుంది. అందులోనూ తన అక్కచేసిన సాహసానికి బ్రహ్మానందపడ్డాడు. ఆమెమీద ఎంతో భక్తి కలిగింది. ఆ భక్తిని ప్రదర్శించడానికి ఎన్నోమార్లు ప్రయత్నించేడు. కాని, సత్తెమ్మ లక్ష్యం చేయనేలేదు.

రెండోవైపున కార్యం సానుకూలపడిన విధానానికి ఎంతోబాధ కలిగింది.

తానేవుంటే తానూ ఇప్పుడు జరిగిన పనినేచేసి వుండేవాడు. కిష్టయ్యని తరిమేసేవాడే. ఆతడు ఏమన్నా అంటే నాలుగు తగిలించేవాడే. కోర్టుకెడితే ఓచెయ్యి తానూ చూసేవాడు. అయితే అదంతా వ్యక్తిగతంగానే వుండిపోయేది. అందులో ప్రజలు చేయవలసిందల్లా తనకి వ్యతిరేకంగా దొరలతో చేరకపోవడమే.

కాని, ఇప్పుడు జరిగిందివేరు. ఇందులో తనచెయ్యి ప్రత్యేకంగా ఏమీలేదు. బాధ్యతమాత్రం తప్పదు. తనభూమి కాపాడబడింది. కాని, ఒక తిరుగుబాటే జరిగిపోయింది. ఒక చిన్నవిప్లవం. దానిఫలితాలు కోర్టుల్లోనూ సాక్షులతోనూ తేలవు. తుపాకులతోపని తగులుతుంది.

ఈ నాలుగు రోజుల్లోనూ ప్రజల్లో కనిపిస్తున్న మార్పు చూసేసరికి రంగయ్యకు మరీ కంగారు పుట్టింది. మంది మంచి హుషారులో వున్నారు.

కొంతమంది సామునేర్చుకొంటున్నారు. ఎందుకో వాళ్ళకే తెలియదు. తమరు చేసినపనికి నిజాం పోలీసులు వస్తారని తెలిసి తయారవుతున్నారా? పోలీసులువస్తే చేతులూపుకొంటూ రారు. బందూకులతో వస్తారు. వీళ్ళు వీళ్ళ కర్రలూ ఏం చేస్తాయి? కర్రతిప్పుతూ, అడుగువేస్తూ, గిరికీలుకొట్టి ఆయాసంతో చదికిలబడుతూంటే బందూకులున్నవాడికి భయమా? పోలీసుల నెదుర్కోడానికీ సాము నేర్చుకొంటున్నామని వాళ్ళు చెప్పడం లేదు. కాని చేస్తున్నారు. అదిచాలు. పోలీసులకి.

కలగబొయ్యే పర్యవసానాలు తలచుకొన్నకొద్దీ రంగయ్యకి కంగారు ఎక్కువవుతూంది. తాను ఎరిగున్న ఒకళ్ళిద్దరితో ఇదేం మంచిదికాదన్నాడు కాని, ఆ ఇది ఏమిటో చెప్పలేదు. దొర అక్రమించుకోబోతూంటే జనం అడ్డంవెళ్ళడమా? ఆ మాటను అతడే అనలేదు. ఆ విధంగా అడ్డంవెళ్ళి నప్పుడు వాళ్లు ఎవ్వరినీ కొట్టలేదు. బాధించలేదు. మరి! తన అసంతృప్తి దేనికో తానేచెప్పలేదు.

కాని, అసంతృప్తిమాత్రం మనస్సుని కలిచేస్తూంది.



# రెండో ప్రకరణం

తన బావికడకయినాసరే బుడన్‌రావడం సిలార్ సాయబు కేమాత్రం ఇష్టంలేదు. అయినా కూర్చోమని ఓరాయి చూపించేడు. బుడన్ ఎంత కాలం కనబడకపోయినా సిలార్ విచారపడడు. అయినా మర్యాదకోసం చాలరోజు లక్కనబడ్డావే అన్నాడు.

బుడన్ మందహాసంచేస్తూ ఏదో నసిగేడు. సిలారు దానిని వినిపించు కోనూలేదు. పట్టించుకోనూలేదు. ఆతని ఆలోచనలన్నీ ఒక్క ప్రశ్నమీదనే కేంద్రీకరించి వున్నాయి.

"వీడెందుకొచ్చినట్లు ?"

మరోప్రశ్న దాని కనుబంధంగానే మనస్సులో గిరికీలు కొడుతూంది.

"వీడెప్పుడు వొదిలిపోతాడు ?"

బుడన్ తానెందుకొచ్చిందీ చెప్పలేదు. ఎప్పుడు పోయేదీ తెలియ వియ్యలేదు. ఆతడు తన్నుగురించికన్న, భారతదేశంలో అధికారంలో మిగిలిన ఒకేఒక ముస్లింనవాబు భవిష్యత్తునుగురించి ఎక్కువ బాధపడు తున్నట్లు కనిపించేడు. ఆయన్ని గద్దెనుంచి దింపడానికి హిందువులు పెద్దఎత్తున చేస్తున్నకుట్రలు వివరించేడు. అవేగనక నెగ్గుతే కలగగల నష్టాల్ని ఏకరు పెట్టేడు.

"మన ముసల్మానుల్ని బ్రతుకనిస్తారా ?"

హిందువులకీ ముసల్మానులకీమధ్య జరగగల కొట్లాటల్లో ముస్లిము లకు కలగగల నష్టాల్ని సవివరంగా బుడన్ చెప్పేడు. ముస్లిం మతానికి జాతికీ మహాప్రమాదం కనిపెట్టుకొనివుంది.

సిలార్ సాయబు ఎటువంటి పరిస్థితుల్లోనూ నమాజ్ మరచిపోడు. తనమతానికి ఏదో ప్రమాదం రాబోతూందని చెప్పేసరికి కళ్లు ఎత్తేడు. సావధాను డయ్యేడు.

బుడన్ ఆ విషయాన్ని గమనించికూడా గమనించనట్లే చెప్పుకుపోయేడు.

“మన నవాబు పరిపాలిస్తుండగానే....”

ఎక్కడెక్కడ ఎప్పుడెప్పుడు హిందూముస్లిం గలాటాలు జరిగేయో వాటికి హిందువులే ఏలాకారణమో బుడన్ చెప్పుకుపోతున్నాడు. అల్లుడు హోదాలో ఆతనియింట వున్నప్పుడు సిరార్‌చెప్పిన ఔరంగాబాద్ మతకలహాల అనుభవాన్నికూడా తన వాదనకు బుడన్ ఉపయోగించుకున్నాడు.

“....ఇంతింత అన్యాయాలు ముస్లిములకు జరిగిపోతున్నయ్యే. ఆయనబలమే లేకపోతే అసలు నిలవనిస్తారా?”

సిలార్ కొన్ని ఏళ్ళక్రితం మొహర్రం పండుగులకి ఔరంగాబాదాలో వుండడం తటస్థపడింది. ఆతడక్కడుండగనే మతకలహాలు చెలరేగేయి. ఆ కలహాల్లో చావుతప్పి బయటపడ్డవాళ్ళల్లో ఆతడొకడు. బుడన్ ఆ జ్ఞాపకాల్నిరేపి, మనస్సు కలవరపరిచేడు. సిలార్ కానాటి ఘటనలన్నీ మనస్సులో మెదిలాయి. ఆ జ్ఞాపకాలన్నీ మళ్ళీ నెమరువేశాడు. బుడన్ చాల శ్రద్ధగావిన్నాడు. మధ్యమధ్య ప్రశ్నలువేస్తూ మరచిపోయినవివరాలు మళ్ళీ చెప్పించేడు.

“అబ్దుల్ ఘనీ ఎంతమంచి డాక్టరు. ఎంతతెలివి. బీదా సాదా అంటే ఎంతప్రేమ? అలాంటివాడిని హాస్పిటల్‌లో ఆపరేషన్ చేస్తూండగా తలపగలగొట్టి చంపేసేరు....”

హత్యావివరాలు చెప్పించి బుడన్ డాక్టరు మరణానికి సంతాపం వెలిబుచ్చుతూ కళ్లు ఒత్తుకున్నాడు. పరుపులు కుట్టుకొని బ్రతికే ఒక దూదే

కుల సాయిబు దుకాణాన్ని దుండగీళ్లు తగులబెట్టిన సంగతిచెప్తుంటే సిలారు కళ్లు చెమ్మగిల్లేయి. అతని దుఃఖానికి సానుభూతితెలుపుతూ బుడన్ ఆవేశం ప్రకటించేడు.

"ఈ దురంతాలు చేసినవాళ్ళని...."

ఆకొట్లాటల్లో ముస్లిములపాత్ర తక్కువేంకాదనీ, మొదట్లో హిందువులదే పైచెయ్యి అయినా తర్వాత సర్కారు, పోలీసులసాయంతో వలసినంత ప్రతీకారం జరిగిందనీ ఆతడు ఎరుగును. కాని. సిలారుకు ఆవిషయం తెలియదు. కొట్లాటల ప్రారంభంలోనే చచ్చినంత పనయి రైలు ఎక్కేసేడు. కొట్లాటలకు, హత్యలకు కారకులయినవారిని ప్రభుత్వం అరెస్టు చేసిందన్న దొక్కటే అతనికితెలుసు. ఆమాటనే చెప్పేడు.

నవాబుపాలన వుందిగనకనే అమాత్రమైనా సాధ్యమయిందన్నాడు బుడన్. సిలారు తలపూగించేడు.

ఈమారు బుడన్ ముస్లిం మతాన్ని రక్షించేటందుకూ వృద్ధి పరచేటందుకూ ఖాజీవంటి గొప్పవాళ్లు ఏవిధంగా పనిచేస్తున్నారో. హిందువులు వానికి ఏవిధంగా విఘాతాలు కలిగిస్తూన్నారో చెప్పేడు.

సిలారుకు అవన్నీ తెలుసు. పల్లెటూళ్ళల్లో మాల మాదిగలకు ఇతర దళిత జాతులకూ తురక మతం ఇప్పించి.-వారిని ఇతర కులాలమీదికి ఎగతోలేటందుకే - ఖాజీ తీవ్రమైన వుద్యమము సాగిస్తున్నాడు. ఆ విధంగా మతం మార్చుకొన్న వాళ్ళమీద పెద్ద కులాలవాళ్ళు ఆర్థిక ఆంక్ష లుపయోగించి లొంగదీసు కొంటున్నారు. ఆర్యసమాజంద్వారా వారిని శుద్ధి చేస్తున్నారు.

ఖాజీ ముస్లిం మత ప్రచారానికి తీసుకున్న శ్రద్ధమూలంగానే ఆయన భూముల్ని రైతులు వదలకుండా చేయిస్తున్నారని బుడన్ చెప్పేడు.

"మన మతంలోని కాస్త తలకాయల్ని ఏరి ఖతమ్ చేసేస్తారు. ఆ తర్వాత మనవంతు. ఆలా జరగడానికి వీలులేకుండా నిజాం సర్కారు

అడ్డంవుంది. అందుంచేత ఇప్పు డాయనమీద కత్తికట్టేరు. యూనియన్‌లో చేర్చి కాళ్లు చేతులు కట్టేసి మనపని పట్టాలని చూస్తున్నారు. నిజామ్ చాలా తెలివిగలవాడు. ఆయన ఆ ఎత్తు పసికట్టేసేడు. నేను చేరనుగాక చేరను అన్నారు. హిందువులు తగ్గివచ్చినట్లు కనబడుతూ ఆయన కాళ్ళకి ఎల్లాగైనా బంధం వెయ్యాలన్ని చూస్తున్నారు. కాని అవేం సాగవు. మన ఖాజీ మియా, కాశింరజ్వీసాబ్ వాళ్ళంతా సర్కారుకు దీనిలోని మోసం చెప్తున్నారు. ఏమయినాసరే యూనియన్‌లో చేరేదిలేదు అన్నారు. హైద్రాబాద్ ఆజాదీ ప్రకటించాలంటున్నారు...."

అర్థం అయినట్లుగా పిలార్‌సాయిబు తలవూగించేడు.

ఆ ప్రోత్సాహంతో బుడన్‌కు హుషారు పుట్టింది. ముస్లింలకు ఆపద్బాంధవుడైన నిజాం ప్రభువు గొప్పతనాన్నిగురించి ఎంతో వుత్సాహంతో చెప్పుకు పోయేడు.

ఆ మధ్యన ఆతడు హైద్రాబాద్ వెళ్ళినప్పుడు నిజాము కోఠీని అల్లంత దూరంనుంచి చూడ గలిగేడు. నిజామును చూసే ననుకొన్నాడు. ఆయన పరివారంతో నగర వీధుల్లోకి బయలుదేరాడు. ఆ వేళకి సరిగ్గా రోడ్లమీద నరసంచారం బంద్ అయిపోయింది. ఒక్క గంటసేపు రోడ్డు వదలి పక్కనకూడా నడవనియ్యలేదు. ఎక్కడివాళ్ళ నక్కడే ఆపేసేరు. ఉన్నట్లుండి పోలీసుల ఈలలు కీచు గొంతులతో వినిపించేయి. ఒక జీప్‌లో మర తుపాకులతో సైనికులు కూర్చుని వుండగా అది ముందు బర్రున సాగిపోయింది. కొద్దిసేపటికి ఓడజను కార్లు వచ్చేయి. వాటిలో కొన్నింటికి సిల్కు తెరలు. అవి ఎంత వేగంతో వెళ్ళేయి. వాటి కడ్డంవస్తే మరి బ్రతుకుందా? అటువంటి ప్రమాదాలు జరగకుండేటందుకే దయామయుడైన ఆలా హజ్రత్ రహదారి బంద్ చేయించేసేరు!

ఆ కార్లు వెడుతూండగా తన ప్రక్కనున్నవా రెవ్వరో "నిజామ్ సర్కారు" అన్నారు. ఎవరిని గురించి ఆమాట అన్నారో. కనీసం ఏకారులో వున్న వారినిచూపి అన్నారో కూడా బుడన్‌కు తెలియదు.

కార్ల శబ్దాన్నీ. నడకనీ అనుకరించే శబ్దాలతో సాభినయంగా నిజాము హైద్రాబాద్ వీధుల్లో ఊరిగే పద్ధతిని బుడన్ మహోత్సాహంతో చెప్తూంటే. సిలార్‌సాయిబు ఆశ్చర్యార్థకాలు వెలువరుస్తూ నోరు తెరిచి వింటున్నాడు. మాట మధ్యలో నవాబుకు మూడువందలమంది పెళ్ళా లున్నారుట కాదా అన్నాడు.

నిజాం నవాబుకు ఎందరు పెళ్ళా లున్నారో ఎవరికీ తెలియదు. ముస్లిం జాగీర్దార్లూ వాళ్ళూ నవాబు ప్రాపకంకోసం అందమైన కూతుళ్ళని నవాబు అంతఃపురంలో వప్పచెప్తూంటారని జనవాక్యం. పైగా పెళ్ళాల సంఖ్య మనుష్యుని గొప్పదనానికి గుర్తుగా భావించే సమాజం. కనక నవాబుకుగల భార్యలసంఖ్య అవసరాన్నిపట్టి పెరుగుతూంటుంది.

ముసలి సిలార్ నిజాం భార్యలసంఖ్య వాకబు చేస్తూంటే బుడన్ వుత్సాహం పట్టలేకపోయేడు. సంఖ్య ఇంకా ఎక్కువగా వుంటుందని గంభీరంగా చెప్పేడు.

"రోజుకో పెళ్ళాం చొప్పున మూడువందల అరవైమందో. అరవై నాలుగుమందో వున్నారంటారు."

సూర్యమానం లెక్కలు తీసుకోవాలో. చంద్రమానం లెక్కలు తీసుకోవాలో బుడన్ చటుక్కున తేల్చుకోలేక పోయేడు. అందుచేత నిజాం నవాబు భార్యల సంఖ్యని కూడా ఇదమిత్థ మనలేక పోయేడు.

ఈ భార్యలు. అనంతంగావున్న పరివారంకోసం నవాబు సువారం లోంచి ఉదయం మొదలు సాయంకాలం వరకూ నెత్తి గంపల్లోనూ, నల్లని కంచరగాడిదలు కట్టిన బళ్ళల్లోనూ ఆహారం పంపిస్తూంటారన్నాడు. బళ్ళల్లోవుండే పదార్థాల్ని అతడు చూడలేదు గాని రోడ్ల వెంబడి ప్రతిమూల

లోనూ, అన్నప్పుడూ కనిపిస్తూండే ఆ కంచరగాడిద బళ్ళ వైశాల్యమూ, వాటిలో ముందూ వెనకా కూర్చుండే చోపుదారుల సంఖ్యా చూసి, దాని కనుగుణంగా సువారంలోంచి వెళ్ళే పదార్థాల పరిమితిని వూహించుకొన్నాడు. అదే సిలారుసాయిబు ముందు వర్ణించేడు.

పచ్చటి గుడ్డల్లో తాంబాళంపెట్టి నెత్తిన పెట్టుకొని ఒక్కొక్క-హూరు పదేసి, పదిహేనేసిమంది వెడుతూంటారు. అందుచేత నిజాం ఔదార్యం చాల గొప్పదే అయి వుంటాలి.

గంప పెద్దదేగాని అందులో పిడికెడు మెతుకులుకూడా వుండవని హైద్రాబాద్‌లో వాళ్లు చెప్పేరు. కాని, బుడన్ ఆ మాటమాత్రం చెప్పలేదు. నవాబు సువారంలో వండుతారని తోచిన వంటకాల పేర్లన్నీ ఏకరువు పెట్టేడు. పులావు మంచిరుచిగా వుండాలంటే ఏమేం సరుకులు, దినుసులు వెయ్యాలని తన అభిప్రాయమో అవన్నీ తడుముకోకుండా ఏకరువు పెట్టేడు. నవాబుపంపే గంపలనిండా అటువంటి రసవత్తర పదార్థాలే వుంటాయని వర్ణించేడు. సిలారు ఆ స్వాదు పదార్థాలరుచి తలచుకొని నాలుకతో పెదవులు తడుపుకొన్నాడు.

బుడన్ మంచి మాటకారి. మనస్సులో ఎంతోకోపం. అసహ్యం పెనుగులాడుతున్నా సిలారుసాయిబు ఆలోచన లన్నింటినీ ఆ మాటకారి తనంతోనే కట్టేసేడు. ముస్లిం మత రక్షణకై ఇత్తెహాదుల్ ముస్లిమీన్ ఏలా పనిచేస్తూందో, ఖాజీ మొదలయినవాళ్లు ఎంతకష్టం, ఖర్చూ వోర్చి రజాకార్లని సమీకరించవలసి వస్తూందో చెప్పేడు. రజాకార్లలోచేరి జెహాద్ సాగించవలసిన బాధ్యత ముస్లిమయిపుట్టిన ప్రతిఒక్కని భుజస్కంధాల మీదా వుందన్నాడు.

ఆ పవిత్ర కార్యక్రమంలో పాల్గోడేకుండా వయస్సు అడ్డంవచ్చినందుకు సిలారు ఒక్కనిట్టూర్పు విడిచేడు.

అంతవరకు బహు జాగ్రత్తగా గ్రంథం నడుపుతున్న బుడన్ ఒక్క తప్పటడుగు వేసేడు. సిలార్‌కు తనమీదవున్న అసహ్యం ఆత డెరుగును. కాని, అంత అసహ్యాన్నీ కప్పేసి. తన వుద్యమానికి ఆతని సహాయాన్ని సంపాదించ గలిగానని సిలార్ నిట్టూర్పులో ఆతనికి దిలాసా దొరికింది. ఆ ధైర్యంతోనే ముంతాజ్ యోగక్షేమాలు అడిగి, ఆమె తనను గురించి ఎప్పుడన్నా అడుగుతుందేమో తెలుసుకొనగోరేడు.

వెంటనే సిలార్ సావధానుడయ్యేడు. ముంతాజ్‌పేరు ఎత్తేఅర్హత కూడా బుడన్‌కి లేదని సిలార్‌నమ్మకం. మరల వెనుకటిసంబంధం పునరుద్ధరించే వుద్దేశం ఆతని కేమాత్రమూలేదు.

సిలార్‌లో వచ్చినమార్పును చూసికూడా చూడనట్లుగనే బుడన్ సంభాషణను మార్చేడు.

మరో అరగంటకూర్చుని ఆకబుర్లూ, ఈకబుర్లూ చెప్పి లేచేడు. ముసలివాని ధోరణికి మనస్సు కుతకుతలాడుతున్నా పైకి తేలలేదు. మరో రెండు నాళ్ళల్లో ఖాజీ ఇంటివద్ద ఇత్తెహాదుల్ ముస్లిమీన్‌సభ జరుగుతూందని సిలార్‌ను రమ్మనీ పిలిచేడు. ఈమారు సిలార్ వెనకటంత వుత్సాహం చూపలేదు. ఖాజీ ఇదివరకోమారు బుడన్‌తో బాంధవ్యం పునరుద్ధరించుకోమని కబురు పెట్టేడు. ఇప్పుడు బుడన్ ఆప్రయత్నమే చేసేడు. ఇప్పుడు ఖాజీరమ్మన్న దెందుకయినా అక్కడ ఈవిషయంమీద ఒత్తిడి తెస్తారనిపించింది. సమాధానం ఇవ్వలేదు.

బుడన్ ఇంకా ముందుకు వెళ్ళడానికి సిద్ధంగాలేడు. వూరుకున్నాడు.

ఇద్దరూ బావిదగ్గరనుంచి బాటమీదికివచ్చేరు. సాయంత్రం అయింది. పుంతలో దుమ్మంతా లేవగొడుతూ పెద్దగొర్రెలమంద వాళ్ళకెమరువచ్చింది. దారివదలి ఇద్దరూ పక్కగా నిలబడ్డారు. బుడన్ మందను చూస్తూన్నాడు. మంచిబలిసిన గొర్రెపొట్టేలు మందమధ్య సగర్వంగా నడుస్తూ ఆతని కళ్ళ ఎదుటనుంచి సాగిపోతూంది. హఠాత్తుగా ఆతనికి ఒకసంగతి తోచింది.

రెండురోజుల్లో ఖాజీఇంటివద్ద పెద్దసభ జరుగుతుంది. వేటసంపాదించమని ఖాజీ కొంతడబ్బు తనకిచ్చేడు. వెంటనే మందకడ్డుపడి పొట్టేలుకొమ్ములు పట్టుకొన్నాడు. దానిని మందబయటికి లాక్కువచ్చేడు.

"సభరోజున పులావు"

తన దూరదృష్టికీ, జేబులో మిగలగల డబ్బుకీ బుడన్ సంతుష్టితో కళ్లు చికిలించి, చిన్నగనవ్వేడు. సిలారుముఖంలో అయిష్టం కనబడింది. కాని, తాము ప్రారంభించవలసివున్న జీహాద్‌కు ఖర్చు కాఫిర్లనుంచే రాబట్ట వలసివుందనే ధర్మసూక్ష్మాన్ని బుడన్ వెలువరించేడు.

అప్పటికప్పుడే మంద నిలబడిపోయింది. గొల్లలు తమ పోతును వదలమంటూ ప్రాధేయపడుతున్నారు.

"నీకాల్మొక్కుతా. విడిచిపెట్టుదొరా!"

బుడన్ గొర్రెను పట్టుకొన్నది వదిలిపెట్టేటందుకా? ఆ సంగతి గొల్లలకీ తెలుసు. అతని క్రూరస్వభావం వాళ్ళకెరికే. మామడొడ్డిలోకి పంది వచ్చిందనే నెపంతో బుడన్ వడ్డెరవాణ్ణి పొడిచి చంపినవాడుకాదూ? ఆ కేసు కోర్టుల్లో మాసిపోయినా ప్రజలమనస్సుల్లో మాసిపోలేదు. ఆ క్రూరత్వాన్ని కట్టుకొన్నపెళ్ళామూ, పిల్లనిచ్చినమామాకూడా మరిచిపోలేదు. గ్రామస్తులూ మరిచిపోలేదు. ఆనాడు చేసినంతపనీ మళ్ళీ చేయగలవాడే. కనకనే గొల్లలు అంతంత దూరంనుంచే కాల్మొక్కుతున్నారు.

బుడన్ వాళ్ళగోడు లెక్కచెయ్యలేదు. పోతుమెడలో తలపంచకట్టి లాక్కుపోడానికి ప్రయత్నించేడు. అది కాళ్ళు బిగతన్ని కదలనిరాకరించింది. బాటప్రక్కనున్న సీతాఫలంకొమ్మవిరిచి దానితో పిర్రమీద రెండు అంటించేడు. పోతు ఈమారు నడవడానికి వొప్పుకొంది. గొల్లలు వెంటబడ్డారు. సాధారణమైన జీవాన్ని ఇచ్చి దానిని దక్కించుకొనేటందుకు ప్రయత్నించేరు. దేవరపోతును విడిచి మరొకటి తోలుకు పొమ్మన్నారు.

రెండో పోతునుకూడా తీసుకెళ్ళడానికి బుడన్ సిద్ధమే. కాని. దేవర పోతయ్యేది దెయ్యం పోతయ్యేది. ధానినిమాత్రం విడిచిపెట్టడు. వెంటబడ్డ గొల్లలకు ఖబడ్దార్ చెప్పేడు. వెళ్ళిపోతూ మామవంకచూచి పళ్ల ఇగిలించేడు.

"ఎల్లుండి తప్పకుండా రావాలి."

సిలార్ సమాధానం చెప్పలేదు. జెహాద్ దెబ్బ మొదట రుచిచూచిన గొల్లలవంక జాలిగాచూచేడు. తలవంచుకొని ఇంటికి వడివడిగా నడిచేడు.



## మూడో ప్రకరణం

శివరామిరెడ్డి పూజ పూర్తిచేసేడు. దేవుని బొమ్మఎదుట సాష్టాంగపడి లేచి నిలబడ్డాడు. దేవుని పాదాలవద్దనున్న పువ్వొకటితీసి చెవిలో పెట్టుకొని, సంతృప్తి దీపించే ముఖంతో దేవునిగదివదిలి బయటికివచ్చేడు. గుమ్మం పక్కనేవేసిన తిన్నెమీద ఒక్కక్షణం కూర్చున్నాడు. మనశ్శాంతితో సావధానంగానే దేవపూజచెయ్యాలి. సావధానానికి ఓక్షణంసేపయినా కూర్చోడంఒకసాక్ష్యం. పూజముగియగానే లౌకికకార్యాలకు వెళ్ళిపోవడం దేవునిమీద తాత్పర్యం లేదన్నదానికి నిదర్శనమూను.

పరుగెత్తుకొనివచ్చిన మనమణ్ణి చంకనేసుకొని, వానితో కబుర్లు చెప్తూ పదడుగులు వేసేసరికి కిష్టయ్య వణికిపోతూ, రొప్పుతూ రోజుతూ ప్రత్యక్షం అయ్యేడు. పంచలో చిరుగులు కనిపిస్తున్నాయి. తలగుడ్డలేదు. పిక్కలమీదా చేతులమీదా చీరుకుపోయి. రక్తం చిమ్ముతున్న చారికలు కనిపిస్తున్నాయి.

ఆతని ఆకారం చూడగానే శివరామిరెడ్డి జరిగిన సంగతులను కొంత వరకు స్థూలంగా గ్రహించేడు. తెలంగాణా పరిస్థితుల్ని ఈ ఏడాదిబట్టీ చూస్తున్నాక కిష్టయ్య కథని వూహించుకోడం కష్టమేంకాదు.

ఒకమూల మిలటరీ, పోలీసులూ గ్రామాలమీదపడి మడతకొట్టుడు సాగిస్తూనే వున్నారు. రెండోవేపున మంది ఎక్కడో ఒకచోట తిరగబడు తూనే వున్నారు.

తెల్దారు పల్లిలో జాగీర్దారురౌడీల్ని చితకొట్టి తరిమేశారని పది రోజులక్రితం తెలిసింది. ఈ ఘటనకు పదిరోజులుముందే నిజాం మిలిటరీ

వూరుమీద దాడిచేసి కుక్కలునాకేలా కొట్టేరని చెప్పేరు. కాని, తీరా చూస్తే జనం కసిపెరిగిందేగాని లొంగలేదు. పాతసూర్యాపేటలో ఓమూల పోలీసులు పేటలమీదపడి కొడుతూనే వున్నారు. రెండోవేపున కూలి ఎక్కువిస్తేగాని వీలులేదని పాలేళ్లు సమ్మెచెయ్యనేచేసేరు. వరంగలు జిల్లానుంచీ అదేమాట. కరీం నగరునుంచీ అదేమాట. ఇక్కడ తనవూళ్ళోనూ అదే జరిగిందన్నమాట.

ఆమాట తోచేసరికి శివరామిరెడ్డి నిస్తబ్ధుడై పోయేడు. తనవూళ్ళో ఇటువంటి తిరుగుబాటు వస్తుందని ఆయన వూహించలేదు. నిరుడువచ్చిన అల్లరిని అణిచేసేక వూళ్ళోజనం తలఎత్తే అవకాశం వుందనికూడా ఆయన తలచడంలేదు. అయినా చాల జాగ్రత్తగానే ప్రజలధోరణి ఎల్లావుందో చూసుకొంటూనే అడుగు వేస్తున్నాడు. నెలక్రితం ఇద్దరు కౌలుదార్లని తప్పించేడు. వారంక్రితం మరొకరిని వేరేభూమి చూసుకోమన్నాడు. ఏమీ గంద్రగోళంరాలేదు. వస్తే నెలక్రితమే రావలసింది. రావులయ్యకి శుద్ధ మొండిఘటం అని పేరుంది. అతడంత సులభంగా భూమి వదులుతాడని అనుకోలేదు. కాని, భూమిఎందుకు వదలమంటున్నారనేనా ప్రశ్నించకుండా వెళ్ళిపోయేడు. తర్వాత ఏమన్నా చేసిపోతాడేమోననే భయంతో తానే ఆతడికి మరోచోట రెండెకరాలు చూపించేడు. నిరుడు వెట్టివ్యతిరేక అల్లర్లలో మంగలి వెంకన్నని పోలీసులు కదల మెదలకుండా కీళ్లు మణగకొట్టేరు. కొంప అంటించేసేరు. రెండునెల్లు జైల్లో జొన్నరొట్టె తినిపించేరు. వాడి ముఖం చూడ్డానికే ఏలాగో అనిపించింది. గడ్డం గీయమనిపిలుస్తే ఏగొంతు ముడో తప్పించేస్తాడనే భయంతో వాడిని తా నేపనికి పిలవలేదు. అయినా వాడేవచ్చి గుమ్మంలోవుంటున్నాడు. పొలంవదలాలనే సరికి దండంపెట్టి వెళ్ళిపోయేడు.

అయినా ఎప్పుడూ వస్తుందని వూహించనిచోట ప్రతిఘటన వచ్చింది. ఎంతో ఆలోచించివేసిన అడుగుకాస్తా వైకుంఠపాళీ పామునోటపడ్డ

పావులాఅయింది. ఇదివరకు పొందిన విజయాలుకూడా ఈదెబ్బతో తుడిచి పెట్టుకు పోయాయి.

కిష్టయ్య చెప్పిందివిన్నాక గ్రామం అశేషం, అబాలగోపాలం, స్త్రీ పురుషులంతా కత్తులూ, బరిసెలూ తీసుకువచ్చేరని అనుకొన్నాడు. వాళ్ళ పేర్లన్నీ ఏకరువు వేసేడు. వాళ్ళల్లో ఒక్కర్నికూడా ఆతడు చూడలేదు. కాని రమారమి నూరు, నూటఏభయిమంది వచ్చివుంటారని చూసినప్పుడు అనుకొన్నాడు. ఆ నూరు, నూటఏభయిమందిలో వుండకపోతాడా అన్న పేరల్లా చెప్పేసేడు.

ఆతడు తనమీద కర్రవిసిరిన సత్తెమ్మనికూడా చూడలేదు. దూరాన్నుంచి వస్తున్నమందిని చూసేసరికే కాళ్ళు దడదడలాడేయి. కళ్లు భైరులు కమ్మేయి. సత్తెమ్మ విసిరినజువ్వ వీపుమీద పడడానికూడా వ్యవధి నివ్వకుండా కళ్ళుమూసుకొని కంచె కడ్డపడ్డాడు. కాని ఇప్పుడుమాత్రం తనను కొట్టినవాళ్ళపేర్లూ, కొట్టినవిధమూ తడుముకోకుండా చెప్పుకుపోయేడు.

ఆతడు శివరామిరెడ్డిలో ప్రతీకారదీక్ష కలిగించి తనకు కలిగిన అవమానానికి సాధ్యమైనంత భయంకరమైనశిక్ష విధింపచెయ్యాలనే ఆ అబద్ధాలన్నీ ఆడేడు. కాని. వాని ఫలితం మరొకటయింది.

నిరుడు జరిగిన ఘటనల అనంతరం ఊరంతా. ఒక్కయింటివాళ్లు కూడా మిగలకుండా కర్రలూ, కత్తులూ తీసుకొన్నారంటే తాను తొందర పడకూడదని శివరామిరెడ్డి నిశ్చయించుకొన్నాడు.

కిష్టయ్యని వూరడించి ఇంటికివెళ్ళి బట్టలుమార్చుకురమ్మని సలహా యిచ్చేడు. ఆ వేషంలోనే డాక్టర్ సర్టిఫికెట్ సంపాదించడం మంచిదనీ, పోలీసురిపోర్టు ఇవ్వడం ముఖ్యమనీ కిష్టయ్యసలహా.

శివరామిరెడ్డి చిరాకుపడ్డాడు. తనబతుక్కి కిష్టయ్యకూడా సలహా ఇవ్వడమేనా? పైగా పనంతా పాడుచేసుకు వచ్చేడనికూడా అనిపించింది.

* * * *

ఆ వార్త వినగానే రఘునందనుడు పడుచుదనపు పెంకితనంచూపేడు. ఏదో ఒకటి చెయ్యాలి లేకపోతే సెంటుభూమికూడా దక్కనివ్వరన్నాడు. మాపాటుకి విలువేలేదా అంటున్న సత్తెమ్మ కళ్ళఎదుట కనిపిస్తున్నట్లనిపించింది. పాటుకి విలువ వుంది. అంతేకాదు పట్టాకీ, ప్రభుత్వానికీకూడా వుంది. అ విషయం నిరూపించకపోతే ఎవ్వరినీ బ్రతకనివ్వరు.

శివరామిరెడ్డి దానికి సుతరామూ అంగీకరించలేదు. ప్రజల ధనమాన ప్రాణాల్ని కాపాడే బాధ్యత ప్రభుత్వానిది. ప్రతి చిన్నవిషయానికీ ఎవరికి వారే పదిమందిని పోగుచేసుకొని కర్రతీసుకొంటామనడం సాధ్యంకాదు. ఈవేళ ఒకడు పదిమందినితెస్తే రేపు రెండోవాడు పదిహేనుమందిని లేవదీస్తాడు. దానికి అంతేదీ? అద సాధ్యమూకాదు. అందరికీ ఆ సామర్థ్యమూ వుండదు. అందుకే ఓ ప్రభుత్వమనీ ఓ ఏడుపనీ, ఇలా ఎవళ్ళకివాళ్లు అల్లరి చేసి రెండోవాళ్ళ ఆస్తిపాస్తుల్ని లాగేసుకోకుండా పన్నులిచ్చి, ప్రభుత్వమిచ్చీ నవాబునో, రాజునో పోషిస్తున్నా ప్రజల్ని హద్దుల్లో వుంచగలశక్తి ప్రభువుకి వుండాలి. కాని, ఇప్పుడీ ప్రభువుకి ఆ శక్తిలేదు. ఈ ప్రభుత్వం రోజులు చెల్లిపోయేయి.

ప్రభుత్వం మారవలసిన అవసరాన్ని తెలుపుతూ మామగారు తెచ్చిన వాదాన్ని రాజిరెడ్డి కొంత సవిరించేరు. కలవాళ్ళ ఆస్తిపాస్తుల రక్షణకే ప్రభుత్వం ఏర్పడింది. ఆ రక్షణకు అవసరమైన హద్దుల్లోపల ప్రజల ప్రయోజనాలకూడా రక్షణ వుంటుంది. అది నిజమే. కాని, ఇప్పుడు....

"... రోజులు చెల్లిపోయింది ప్రభుత్వానికికాదు. సమాజంలోని ఆర్థిక వ్యవస్థకి. ఆర్థిక వ్యవస్థను కాపాడడానికే ప్రభుత్వ యంత్రం. దానికి రోజులు చెల్లేయంటే అది కుక్క కాపలాకాస్తున్న ఆర్థిక విధానానికి రోజులు చెల్లిపోయాయన్నమాట."

శివరామిరెడ్డి ప్రశ్నార్థకంగా చూసేడు. రాజిరెడ్డి తన వాదాన్ని వివరించేడు.

"ప్రజలలో తమ స్థితిగతులయెడ ఆసంతృప్తి. తమ బలంయెడ విశ్వాసం రగుల్కొనంతకాలం గడ్డిపరకకూడా వాళ్ళని అణిచి పెడుతుంది. ఒక్కమారు ఆ పరిజ్ఞానం కలిగిందా ఎన్ని ఆయుధాలూ. సైన్యాలూవున్న ప్రభుత్వమైనా సరే గడ్డి పరకలాగ తుడుచుకుపోతుంది."

రఘునందనుడు బావతో వాదం వేసుకున్నాడు. మనకళ్ళ కెదురుగా కనిపిస్తున్న మూకలు ప్రభుత్వాన్ని ఓడిస్తాయా ?—అదీ అతని ప్రశ్న.

జరుగుతున్న చరిత్రలోంచే రాజిరెడ్డి వుదాహరణ లిచ్చేడు. తన వాదానికి బలంగా.

"జమీందారీ విధానంలో ఏయే సంస్కరణలు తీసుకురావాలో సూచించ వలసిందిగా మీర్జా ఇస్మాయిల్ కాలంలో ఒక కమిటీని ప్రభుత్వం నియమించింది. ఇప్పుడు జాగీర్దార్ల చేతుల్లోవున్న న్యాయ. పోలీసు. నిర్మాణ శాఖల అధికారాల్ని రద్దుచేసి అవన్నీ ప్రభుత్వం చేతిలోకే కేంద్రీకరింప చేసుకోవాలని ప్రయత్నాలు జరుగుతున్నట్లు వార్తలు వింటున్నాం. ఇవన్నీ ఏమిటి? ప్రజలఎదురొక్కలుముంచు ఆర్థికవ్యవస్థ వేస్తున్న వెనకఅంజేకాదా?"

ప్రభుత్వంలో వస్తున్న మార్పుల్ని ప్రజల తిరుగుబాట్లకి ఫలితాల నుగా స్వీకరించడానికి రఘునందనుడు ఒప్పుకోలేదు. దేశం మొత్తం అభి వృద్ధికోసం మీర్జాయో. మరొకరో చేస్తున్న ఉదాత్తకృషి తప్ప వేరుకాద న్నాడు. ఇటువంటి స్థితిలో తిరుగుబాటు చేయడం ప్రజల కృతఘ్నతకు నిదర్శనం.

రాజిరెడ్డి బావ ఆలోచనను తోసేసేడు. భావనలూ. ఆలోచనలూ గుబులుగా పుట్టుకురావు.

"మానవజీవితాన్ని మించిపోయిన ఆలోచనలులేవు. ఆచారాలూలేవు. అవన్నీ సామాజికప్రవృత్తుల పరిణామాలూ. ప్రతిబింబాలూ మాత్రమే."

* * * *

కాని పెద్దకొడుకు రమణారెడ్డిని వొప్పించడం, ఆపడం శివరామి రెడ్డి కంత సులభంకాలేదు.

రమణారెడ్డి పోలీసు వుద్యోగి. ఆ శాఖలకుండే లక్షణాలన్నీ మూర్తీభవించిన మనిషి.

సమయంలో నొక్కెయ్యకపోతే అసలు లొంగుబాటుకే రాదని ఆతనివాదం.

కాని, ఆ వాదాన్ని తండ్రి పూర్తిగా నిరాకరించేడు. కేవలం మోట బలంతో కర్రపుచ్చుకొని అదలించడంవలన పనిజరిగే ఆశలేదని నిరుటి ఘటనల తర్వాతకూడా ప్రజలు చూపుతున్న సాహసంచూస్తే అర్ధం అవుతుంది. ఇంక సాగలాగుతే వాళ్ళు బరితెగిస్తారు. అందుచేత తెలివి వుపయోగించాలి. ఏచట్టాన్నీ అనుసరించని రాజ్యంలో ప్రజల్నిమాత్రం కట్టివుంచేదేముంటుంది? కాంగ్రెసు చట్టబద్ధమైన ప్రభుత్వం కావాలనే అంటూంది. ఈ అల్లకల్లోలంనుంచి దేశాన్ని రక్షించాలంటే చట్టబద్ధమైన ప్రభుత్వం వుండాలి.

రమణారెడ్డికి తండ్రిని హేళనచేయగల సాహసంలేదు. కాని వాదనను వదలుకొనే పిరికిదనమూలేదు.

"వాళ్ల బానిస లంజ....ఆ మాట గుర్తున్నంతకాలం శాంతంఅన్నా. మరేవన్నా. అది గుర్తుండేటట్లు చేయడం బాధ్యతమనది. బూటుమడమతో గొంతుముడి తొక్కిపెట్టి వాడిచోటు వాడికి చూపాలి. ధనియపుజాతి .."

జాతి లక్షణాలతోసహా విరుగుళ్లు వర్ణించిచెప్పినా తండ్రి వినిపించుకోలేదు.

తండ్రిపట్టునల ఎరిగినవాడవడంచేత స్వయంగా. స్వంతపూచీమీద వ్యవహారంలోదిగడం ఇష్టంలేక రమణారెడ్డి రుంజుకుంటూ వెళ్ళిపోయేడు.



## నాలుగో ప్రకరణం

వెంకటయ్య శివరామిరెడ్డివద్ద రెండేళ్లు పనిచేసేడు. కాని, ఈ నాడు తనయెడ ఆయన చూపిస్తున్న అభిమానమూ. ఆదరమూ అననుభూతం. అలాగని శివరామిరెడ్డి భయంకరుడేం కాదు. కోపిష్టీకాదు. ధూర్తుడూకాదు. నోటి దురుసు మనిషి అసలే కాదు. మనుష్యులని ఎంతో ఆప్యాయంగా. మర్యాదగా చూస్తాడు. అంత ఆప్యాయత చూపుతున్నా అధిక పరిచయానికీ, చనువుకీ అవకాశం ఇవ్వడు. ఆయన ఎదట పడడం అంటే ఒక విధమైన భయం, భక్తీ కూడా అనిపిస్తుంది.

అసలు పెద్దదొర పిలుస్తున్నా డనేసరికే వెంకటయ్యకి భయం పుట్టింది. తాను సత్తెమ్మను పెళ్ళి చేసుకోదలచిన వార్త ఆయన వరకూ వెళ్ళిందని గ్రహించేసరికే వణుకు పుట్టింది. పెద్దవాళ్ళ యిళ్ళల్లో ఏం జరిగినా ఫర్వాలేదు. కాని, తన బోటిగాడు ఏం చేసినా, చెయ్యక పోయినా ప్రమాదమే. నిరుడు కోమటి బంగారయ్య పక్కింటివాళ్ళ కోడలితో మాట్లాడాడని, నడివీధిలో బుర్ర గొరిగించి వూళ్ళోంచి తరిమేసేరు. జాగీర్దారు రామచంద్రారెడ్డి కొడుకు బందూకు చూపించి తండ్రిని గదిలోంచి తరిమేసి, సవతి తల్లి పక్కలోకి చేరుతాడు. బహిరంగం. ఎవ్వరూ పైకి చెప్పుకోరు. లోకం అల్లావుంది. ఇప్పుడు పెద్దరెడ్డి తన నేం అంటాడో?

భయపడుతూన్న సమయంలో ఆయన చెప్పిన వూరడింపు మాటలు వెంకటయ్యకి చాలా ఆశ్చర్యం కలిగించేయి. వితంతువులకు వివాహం చెయ్యడం చాల మంచిపని అనీ, ఆ పనికి సాహసించ గలవాడు నిజంగా వీరుడనీ ఆయన అన్నారు. సరాసరి తనను భుజం తట్టకపోయినా. ఆ మెచ్చుకోలు చాల వుత్సాహమే కలిగించింది.

కాని, రెండో వేపున అనుమానం కూడా బాధిస్తూనేవుంది. ఈ మెప్పుకోలూ, ప్రశంసా వట్టి తాటాకులు కట్టడమే నేమో !

ఆయన ముఖంలోగాని, స్వరంలోగాని ఆ అనుమానానికి ఆస్కారం కనబడలేదు. ధైర్యం కలిగింది, పైగా సాయం చేద్దామనుకొన్నానని ఆయనే చెప్తూంటే. ఆ సాయం స్వరూపం ఎటువంటిదా యనే ఆలోచనలలో తేలిపోయేడు.

సాయం చెయ్యాలనుకొంటే దొర చెయ్యగలడు. తన తండ్రి తాతలు నాటి పాతిక ముప్పయ్యెకరాలు ఆయన స్వాధీనంలో వున్నాయి. అవి తిరిగి యిచ్చెయ్యడం తక్కువ సాయమా? బహుశా దొర ఆలోచన అదే నేమో.

తన తాతా, తండ్రీ సరదాపడి ఆ భూమిలో కొంతమేర మామిడి తోట వేసేరు. ఇన్ని సపోటాలూ నాటేరు. తమరు సుఖపడలేక పోయినా తరవాత వాళ్ళైనా ఇంత తింటారని వాళ్ళ ఆశ. కాని అది కాస్తా దొరచేతిలోకి పోయింది. కానైతే అన్యాయం జరిగిపోయిం దనిపించింది. కాని ఆయన చూపించిన కాగితాలలోని విషయం విన్నాక ఆ భూమిమీద ఆశ వదులుకొన్నాడు. తోట పెంచడానికీ, పంటలు చెడ్డప్పుడు తిండికీ, పన్నుకీ తెచ్చిన రుణాలు పాపం పెరిగినట్లు పెరిగాయి. అప్పు డప్పుడు కట్టిన చెల్లులు వడ్డీకూ డా సరిపడలేదు. ఇచ్చిన నెయ్యీ, కోడిగుడ్లూ వగైరాలు నజరానా లవుతాయేగాని అప్పు తీరేటందు కవి సాయపడలేవు.

పెద్దాళ్ళు చచ్చిపోయేక దొర భూమిని తనచేతిలోకి తెచ్చుకొన్నాడు. తానే ఒబ్బిడిగా చేయిస్తూ, ఆదాయాన్ని అప్పులో తీర్పుపెట్టి, వెంకటయ్య పెద్దవాడయ్యేనాటికి భూమి చేతికిద్దామని ఆయన సంకల్పం. కాని, వ్యవసాయంలో ఖర్చులన్నీ లెక్కేసుకుంటే కిట్టి ఏడుస్తుందీ? అందుకేనేమో ఏడవగలుగుతేనే వ్యవసాయం అన్నారు.

అప్పుతీరడంమాట అలావుండగా వ్యవసాయంలో అప్పు దప్పుడు పెట్టిన పెట్టుబడులుకూడా జతపడి తుప్పుతినేసినట్లు ఆ స్తిని తినేసేయి.

ఆ ఆస్తిమీద జమాఖర్చు లన్నింటినీ దొర అణాపైసలతో వ్రాసి వుంచేడు. ఇచ్చినా, పుచ్చుకొన్నా ప్రతికానీ లెక్కలోవుంది. అప్పు తీరలేదు. ఆ స్తిని మించిపోయింది. చివరకు వెంకటయ్యను పిలిచి సంగతులన్నీ చెప్పేడు. అప్పటి కాతడూ ఓయిరవయ్యేళ్ళవాడయ్యేడు.

దొర బజారుధరకన్న మరో పదివేసి భూమిని తానే తీసుకొన్నాడు. మరోవందపైగా అట్టే మిగిలింది. అది కొట్టేసేడు. ధానికే తాను బ్రహ్మా నందపడుతూంటే ఓపాతిక చేతిలోపెట్టేడు. నీ బ్రతుకు చూడుకోమన్నాడు.

అంత కట్టుదిట్టంగా చెయ్యిజారిపోయిన భూమి మళ్ళీ వస్తుందనే ఆశ లేకపోయినా, తోటలంటే తనకున్న అభిమానంకొద్దీ దొరమాటల్లో వెంకటయ్య బోలెడు ఆశలు పెంచుకొన్నాడు. కాని, అంతలో ఆ ఆశలు నిరాశలేననిపించింది. సత్తెమ్మను పెళ్ళిచేసుకొంటాననుకొన్నప్పుడు ఆయన సహాయపడదామనుకొన్నారు. కాని, పూరికేకాదుగదా? ఇప్పు డాపెళ్ళీలేదు. అ ఆశాలేదు. వెంకటయ్య తలవంచుకొనే తనపెళ్ళిచెడిపోవడం, రంగయ్య పట్టుదల చెప్పేడు.

శివరామిరెడ్డి సానుభూతితో తలపంకించేడు. ఆయన కా సంగతి తెలుసు. అన్నీ యిదివరకే విన్నాడు. తన అభిప్రాయం కూడా చెప్పేడు.

ఆ స్తి లేకపోవడంతప్ప వాళ్ళపెళ్ళి చెడిపోడానికి మరోకారణం లేదన్నాడు. కాస్త భూమో, పుట్రో వుంటే ఆరంగయ్యా, ఆవీరమ్మా ఆటంకాలు చెప్పేవారేనా? ప్రపంచంలో తాను ఎన్ని చూడ్డంలేదు?....

పెద్దరెడ్డి చెప్పకపోయినా వెంకటయ్యకు ఆమాట తెలియదా? ఓ రావుగారికూతురు ముసల్మానునే పెళ్ళిచేసుకుంది....

....చదువుకొన్నవాడు గనక రంగయ్యకేనా కనీసం ఆతెలివి వుండ వలసింది. లేకపోయింది. ఏమనుకొంటేమాత్రం ఏంలాభం?....

దేశంయొక్క దురవస్థ తలుచుకొని శివరామిరెడ్డి ఒక్కనిట్టూర్పు విడిచేడు.

వెనకాధరువు లేనివాళ్ళని సంఘంలో కాకులల్లే పొడిచేస్తారు. అందుకే తాను వాళ్ళకింత ఆస్తరణ చూపాలనుకొన్నాడు. చూపించడమే. తానేం పెట్టనక్కర్లేదు పొయ్యనక్కర్లేదు. మరో అడ్డం లేకుండాచేసి వాళ్ళది వాళ్ళ కిచ్చేస్తేచాలు. కాని దైవం అనుకూలించలేదు.

ఆమాటలు విన్నాక వెంకటయ్యకు మళ్ళీ ఆశకలిగింది. వాళ్ళది వాళ్ళ కిచ్చెయ్యడం అంటే తనభూమి తన కిచ్చెయ్యడంగాక మరేముంటుంది ? తమరిద్దరిలో ఒకప్పుడేనా కొద్దోగొప్పో ఆస్తిఅంటూ వున్నది తనకే. సత్తెమ్మ పుట్టింటివాళ్ళు కాస్త భూమిగలవాళ్ళయితేమాత్రం. ఆమెకా ఆస్తి మీద హక్కు ఎక్కడుంది ?

కాని, కొద్దిసేపటికి తన ఆశలూ, ఆలోచనలూ తప్పుదారిన నడుస్తున్నాయని వెంకటయ్యకు అర్థం అయింది. తమ రిద్దరిలో సత్తెమ్మకే ఆస్తిహక్కు వున్నట్లు రెడ్డి భావించడం ఆశ్చర్యం అనిపించింది. చాల సేపువరకూ ఆయనచెప్పేదేమిటో ఆతనికర్థం కానేలేదు. రత్తయ్యగారి జోళ్ళపొలం తనక్కావాలని ఎందుకన్నాననుకొన్నావంటే తానేం చెప్ప గలడు ? ఆ అడగడానికీ, తనకు సాయంచేయాలనే సంకల్పానికీ గల సంబంధం చాలసేపటివరకూ తోచలేదు. కాని ఏదో సమాధానం ఇవ్వాలి గనక ఇచ్చేడు.

"చిత్తం, చిత్తం."

అది ఆయన ప్రశ్నకి సమాధానమేకాదు. కాని శివరామిరెడ్డి దానిని గుర్తించినట్లేలేదు. తనలోతానే మాట్లాడుకొంటున్నట్లు ఏమేమో చెప్పు కొని పోతున్నాడు. వెంకటయ్య నోరుతెరచి వింటున్నాడు ఆయన ఆలో చనలన్నీ వింతగా కనిపిస్తున్నాయి.

నలుగురూ పోగడి పెళ్ళి చెడగొట్టేరని తెలిసి శివరామిరెడ్డి చాల విచారించేడు. అది అంతవరకూ వస్తుందనే అనుమానం ఆయనకు మొదటి నుంచీవుంది. కాని, రంగయ్య పెద్దచదువులు చదువుకొన్నాడనీ, పట్నంలో మెసిలి నాలుగుసంగతులూ చూసినవాడనీ, కనక పర్వావుండకూడదని అనిపించింది. కాని తీరాచూసేసరికి తనది వట్టి భ్రమమాత్రమేనని తేలిపోయింది. తీరా అంతా ముగిసినాక తాను కలగచేసుకోడం మంచిదికాదని తోచింది. అప్పట్లో ఏదో జరిగిపోయింది. ముందుముందు ఇటువంటి అటంకాలు రాకుండా చేయాలని ఆలోచించేడు.

ఆభూమి సత్తెమ్మదే అయివుంటే ఆమె వెనకతగ్గే మనిషేనా? సమయానికి తాను చెయ్యాత నివ్వగలిగివుంటేనా? సరే. ఇంకేనావూరుకోకూడదనుకొన్నాడు. వెంటనే తాను చెయ్యగలదేదో చేసిపారేస్తే ముందుకు పనికొస్తుందనుకొన్నాడు.

అందుకే బోళ్ళపొలం వదిలెయ్యమన్నది. ఎంతచాకిరీ చెయ్యనీ, నగలమ్మే పెట్టుబడిపెట్టనీ, ఆభూమి నెవ్వరూ ఆవిడదనరు. ఆభూమి ఆవిడదే అనిపించేస్తే? సొమ్ము సొమ్ములో వుంటుంది. ఆవిడకి ఆధరువూ ఏర్పడుతుంది. ఇంత రంతుచేసిన రంగయ్య ఆవిడ తన నగలొలిచి భూమి మీద పెట్టిందని కొంచెమన్నా విశ్వాసంచూపుతాడా? అబద్ధం. ఆతనికి అభిమానంఎంతుందోతెలిసేపోయింది. అందుకే తాను కలగజేసుకొన్నాడు. అంతేగాని తరాలుగా వాళ్ళు చేసుకొంటున్న భూమి తనకి కావాలా? తనదని వ్యవహారం ప్రారంభిస్తేగాని ముడిపడేటట్లులేదు. అందుకని ఆమాట అన్నాడు.

సత్తెమ్మ చేస్తున్నభూమిని ఆమె కివ్వడంకోసమే పుచ్చుకోదలచేనని రెడ్డి చెప్తూంటే వెంకటయ్యకు అసలురహస్యం అర్థంఅయింది. ఆకాస్తా అర్థంఅయ్యేక ఆయనమీద తాను కల్పించుకొన్న సద్భావం పటాపంచ

లయింది. 'అమ్మ దొంగముండాకొడక '—అని తిట్టుకొన్నాడు, మనస్సు లోనే. పైకి అనే శక్తిలేదు.

సత్తెమ్మ జువ్వకర్ర తీసుకొని మంచిపనే చేసిందనుకొన్నాడు. దానినిగురించి ఏమిటి అభిప్రాయపడుతున్నాడో తేలదేమని పదిమాట్లు అనుకొన్నాడు. ఆఖరుకు ఆదీవచ్చింది. ఆవిషయంలోకూడా శివరామిరెడ్డి తనదే పొరపాటన్నట్లు చెప్తూంటే ఆశ్చర్యపడ్డాడు.

తాను చేయదలచిందేమిటో, ఎందుకో ముందుగానే సత్తెమ్మని పిలిపించి చెప్పేస్తే బాగుండిపోయేదని రెడ్డి ఇప్పుడు విచారపడుతున్నాడు. అలాగ తానుచెప్తే ఈ పరిస్థితి వచ్చేదికాదు. భూమి నన్యాయంగా లాగేస్తున్నాడేయని కంగారుపడింది .... పాపం .... ఇప్పు డనుకొంటే మాత్రం ఏంలాభం ? పనిజరిగే పద్ధతేదో చూడాలిగాని....

ఆ ' పనిజరిగే పద్ధతేదో ' కూడా చెప్పేడు. కాని ఆ పద్ధతిప్రకారం పని జరిపించడానికి వెంకటయ్యమాత్రం ఇష్టం చూపలేదు.

బోళ్ళపొలంమీద తనకే ఆశ లేదంటాడు దొర. దిక్కుమాలిన ప్రపంచం. దొరలు భూములనుంచి రైతుల్ని బేదఖల్‌చేస్తున్నారనే దొకటి వచ్చిపడిందిగదా. ఆమాటే తనకీ వచ్చింది, అనవసరంగా....ఇంక తాను అటువంటి అపనిందకు అవకాశం ఇవ్వతలచుకోలేదు. తనకే కావలసి, బేదఖల్ చేయాలనేవుంటే సత్తెమ్మచూపిన తొందరపాటుకి వూరుకొనేవాడేనా ? ఒక్కరిపోర్టు వ్రాసిపారేస్తే పోలీసులువచ్చి ఆ వ్యవహారం ఏదో చూసుకుపోయేవాళ్ళే. ఆవుద్దేశం తనకులేదు. కనకనే పస్తాయించేడు.

ఉన్నట్టుండి శివరామిరెడ్డి వెంకటయ్య ముందు ఆలోచన లేమిటో తెలుసుకొనగోరేడు. ఆత డింకా సత్తెమ్మను పెళ్ళిచేసుకోవాలనే వుద్దేశంలోనే వున్నాడా ?

ఆలాంటి వుద్దేశం వుంటే బోళ్ళపొలం అతడే తీసుకొని చేసుకొనే టందుకు తాను సాయం చేస్తానన్నాడు. సత్తెమ్మతో చెప్పేపూచీ తానే నెత్తిన వేసుకొంటాడు. అసలు సంగతి తెలుస్తే చల్లగా పూరుకుంటుంది. వెంకటయ్య పొలంలో వుంటాడు గనక ఆమె అనుమానించ వలసిన పని వుండదు. రంగయ్య కోర్టుకెక్కితే తాను చూచుకొంటాడు.

పెట్టుబడికి అవసరం అయితే డబ్బు తీసుకెళ్ళమన్నాడు.

కాని....

వెంకటయ్య నిరాకరించేడు. సత్తెమ్మను పెళ్ళిచేసుకొనేటందుకే అయినా ఆతడా పొలంవేపు చూడ్డానికి అంగీకరించలేడు. చాలమర్యాదగా వద్దన్నట్లుగాకుండా నిరాకరిస్తూనే దొరవుద్దేశంతనకి అర్థం అయినట్లు తెలియ చెప్పేడు.

సరిగ్గా ఈ మధ్యనే అనసూయమ్మ ఇంత తెలివిగా కాకపోయినా ఇదే మాదిరి ప్రతిపాదన చేసింది.

బోళ్ళ పొలాన్ని ఆనుకొని ఆమెకు ఓ ఏభయ్యేకరాల చెలకవుంది. దానిని నరిసిరెడ్డి ఓ పాతికేళ్ళనుండి చేస్తున్నాడు. ఆతనిని దానిలోంచి బేదఖల్ చేయడానికి ఆమె అన్ని విధాలా ప్రయత్నించి విఫలురాలయింది. బోళ్ళపొలంలోంచి తన్ను పంపేసేరని విని అమె కబురుపెట్టింది. అక్కడి నుంచి పంపేసినా భయపడవలసిన దేమీలేదని అభయం ఇచ్చింది. తన పొలం చేసుకోమని సలహాయిచ్చింది. పక్క పక్క పొలాలు గనక సత్తెమ్మను కలుసుకొంటూండ వచ్చునని ఉపాయం ఉపదేశించింది. తన పొలంలోంచి పొమ్మన్నాడే గాని, నీపొలంలోంచి పొమ్మనడానికి రంగయ్య కేం అధికారం వుంటుందని చట్ట సూక్ష్మం చూపించింది. సత్తెమ్మ పొలం రాకమానదు. కోరడికి ఆవలా, ఈవలా గనక మాటా మంతీ కష్టంకాదు. ఆ విధంగా ప్రలోభనం సాగించింది.

ఆ భూమినుంచి నరిసిరెడ్డిని తరిమి వెయ్యడానికై తన్ను పని ముట్టుగా వాడుకో గలననే ఆలోచనే ఆ అభిమానికి మూలం. దానిని తానూ ఎరుగును. కాని ఎరిగినట్లు ఆతడు తేలలేదు. ఏమీ ఎరగనట్లే మాట్లా దేడు. ఆవిధంగా దొంగతనంగా కలుసుకోడం తన కిష్టంకాదన్నాడు.

ఆ కథ చెప్తూన్నా. శివరామిరెడ్డి ఆలోచనల్ని పసికట్టినట్లు తోపించ కుండానే వెంకటయ్య మాట్లాడేడు. అయినా అసలు వుద్దేశ్యాన్ని గ్రహిం చడం శివరామిరెడ్డికి కష్టంకాలేదు. కాని పైకి తేలలేదు.

వెంకటయ్య సెలవు తీసుకొని వెళ్ళబోయేముందు దొర మళ్ళీ ఇంకోమారు భరోసా యిచ్చేడు. ఎప్పుడైనాసరే. సహాయం కావలసివస్తే రమ్మన్నాడు.

"చిత్తం"

వెంకటయ్య తన తండ్రి తాతలనాటి పొలంలో కొద్ది చెలకయినా ఇస్తానంటాడేమో యని ఒక్కక్షణం ఎదురు చూసేడు. కాని శివరామిరెడ్డి నోట అటువంటి మాట సూచనగా కూడా రాలేదు.

మళ్ళీ సెలవు పుచ్చుకొంటూ వెంకటయ్య దొర దొంగఎత్తుల్ని తిట్టుకొన్నాడు.

"ఎలకమీద పిల్లినీ, పిల్లిమీద ఎలకనీ ఎక్కించేటందుకా ఎత్తు."

కాని ఆభావాన్ని ఛాయా మాత్రంగానైనా పైకి కనబడ నివ్వలేదు. పైగా కనుమరుగయ్యేంతవరకూ వొంగి వొంగి దండాలు పెడుతూనే వున్నాడు.



# అయిదో ప్రకరణం

సాయంకాలం చల్లబాటువేళ బుడేమియా వచ్చేడు. గొడవల్లో పడిన తన భూముల వ్యవహారాల్ని గురించి వాకబుచేయడం ప్రారంభించేడు. ఇంక అనసూయమ్మ సంతోషానికి మేరయే లేకపోయింది. లోపల అరుగుమీద కూర్చోపెట్టింది. స్వహస్తంతో చా తయారుచేసింది. తయారుచేసి సిద్ధంగా యింట్లోనిలవవున్న నాలుగు మురుకులు ప్లేటులోపెట్టి ఎదట పెట్టింది. అవి తింటూండగానే చా కప్పులోపోసి ఎదుటకు గెంటింది. చా త్రాగేక వేసుకొనేటందుకు తాంబాళంలో ఇన్ని ఆకులూ, వక్కా, చూరూ, సున్నమూ సిద్ధంచేసింది. ఈ లోపున తన భూములకు సంబంధించిన కాగితాలన్నీ తెచ్చుకొని దస్త్రంవిప్పింది.

అనసూయమ్మ తెచ్చియిచ్చిన చా రుచిని పొగడుతూ, కప్పుమీదుగా ఆమె ముఖంవంక చూస్తూ, గుటకవేస్తూ బుడన్ వ్యవహారాల వివరాలు తెలుసుకొంటున్నాడు.

నరిసిరెడ్డి ఓ పాతికేళ్ళక్రితం తనవద్ద ఏభయ్యెకరాలు కోరుకు తీసుకొన్నాడు. దానిని తిరిగి ఇవ్వమంటే కదలడంలేదు. రెండేళ్ళనుంచీ వాటిని స్వాధీనంలోకి తెచ్చుకోవాలని ఆమె విశ్వప్రయత్నం చేస్తూంది. కాని సాధ్యం కావడంలేదు. ఆ ప్రాంతాల్లో పేరుపడ్డ జాగీర్దారు ఛోటేజాన్ వాళ్ళకి మద్దతు.

ఆ ముల్లును తీసెయ్యడానికి ఆమె మార్గాల నన్వేషిస్తూంటే ఎవరో ఖాజీమహమ్మద్ రసూల్ పేరు సూచించేరు. అతడు మరో పెద్దజాగీర్దారు; ఇత్తెహాదుల్ ముస్లిమీన్ నాయకుడూను.

అనసూయమ్మ ఖాజీవద్దకు రాయబారం నడిపించింది. ఈ వేళ బూడే మియా హాజరయ్యాడు.

ఆమె ఖాజీని ఎరగదు. కాని బుడన్‌ను ఎరుగును. ఆతడొక హంత కుడుగా చుట్టుప్రక్కల గ్రామాలన్నింటా పరిచితుడే. ఆతని ఆకారం. వేష భాషలుచూస్తే ఈ మనిషి హత్యలు చెయ్యగలడా అనిపిస్తుంది. కాని. హత్య చేసేడు. దానికో పెద్ద కారణమూలేదు. పంది పడినది. తన దొడ్డి కూడాకాదు. అదయినా మామగారిది. దానిని బల్లెంతో పొడిచేడు. దాని వెనకనే వస్తున్న ఆ వడ్డెరవాళ్ళ కుర్రవాణ్ణికూడా ఆబల్లెంతోనే పొడిచేసేడు. ఆ దారుణానికి చుట్టుపక్కల పల్లెలన్నీ గగ్గోలెత్తిపోయాయి. ఆకారానికీ. స్వభావానికీ మధ్యనున్న ఆ వైరుధ్యమే బుడన్ అందరికీ తెలియడానికి కారణం అయింది.

హత్యకేసు వచ్చినప్పటినుంచీ అతడు ఖాజీపక్క చేరేడు. ఖాజీవద్దనున్న బలగం అంతా అట్లాంటి బాపతేనంటారు. కనీసం రెండు హత్యలన్నా చేసిన ఘటికుడికిగాని ఆయన కొలువు లభించదని ఓ ప్రతీతి.

ఆ బుడనే నేడు తన యింటికి వచ్చేడు. మొదట వింతగానూ. తర్వాత వినోదంగానూ. వచ్చినపని తెలిసేక శ్రద్ధగానూ ఆతడిని ఆహ్వానించింది. ఆతడు తన భూముల వ్యవహారాలు తెలుసుకుంటూంటే ఇంక తాను గట్టు ఎక్కినట్లేనని అనసూయమ్మ ఆనందపడింది. ఆ వుత్సాహంలో ఆత డొక్క టడుగుతే తాను పదిచెప్పింది. బుడన్‌కూడా మంచి వ్యవహార జ్ఞానం కలవాడే. ఆత డొకటికి పదిప్రశ్నలు వేసేడు.

గంటలు గడిచేయి. చీకటి పడింది. బుడన్ ప్రశ్నలుగాని. అన సూయమ్మ చెప్పవలసిన సంగతులుగాని పూర్తికాలేదు.

భోజనం అయ్యేక మళ్ళీ కూర్చున్నారు.

అనసూయమ్మ విప్పిన దస్త్రంలో రెండేళ్ల కోర్టుల్లోనూ. బయటా నడిచిన వ్యవహారాల తాలూకు కాగితాలు. అవసరమైన కౌలు కదపాలతో.

పన్ను రశీదులతో సమగ్రంగా వున్నాయి. అన్నీ ఉర్దూలో వున్నాయి. గుర్తుకోసం వ్రాసుకొన్న తెలుగుమాటల్ని పట్టి అవసరమైన కాగితాల్ని ఆవిడ అందిస్తూంటే బుడన్ వాటిని సమగ్రంగా చదువుతున్నాడు. అందులో లా పాయింట్లు ఏరి చెప్తున్నాడు.

చాల రాత్రి అయింది. చదవవలసిన కాగితాలుకూడా పూర్తి అయ్యాయి. బుడన్ లేచేడు. ఏదో తప్పుచేసి క్షమార్పణ కోరుకొంటు న్నట్లు ఒక్క మ్లానహాసం చేసేడు. రాత్రి బాగా గడిచిపోయిం దన్నాడు.

"ఖాజీమియా వివరాలన్నీ అడుగుతారు. తెలుసుకోనిదే వెడితే...."

బుడన్ పడిన శ్రమకు అనసూయమ్మ అనుతాపం తెలిపింది. అంత రాత్రివేళ చీకట్లో నాలుగైదుమైళ్లు వెళ్ళడం కష్టమని గుర్తు చేసింది.

"పక్కవేస్తారు. పడుకోండి. పొద్దుటే వెళ్ళవచ్చు."

ఖాజీమియా తనకోసం కనిపెట్టుకొని కూర్చుంటారేమోనని సందే హాన్ని వెలిబుచ్చుతూ, ఇంత రాత్రివేళ వెళ్ళడంలోవున్న ఇబ్బందుల్నీ, వెళ్ళకపోతే చెడిపోగల పనుల్నీ బుడన్ ఏకబిగిలోనే వల్లించేడు. చివరకు అట్టే బలవంతం అక్కర్లేకుండానే అంగీకరించేడు. ఆతనికి పక్కతెచ్చి వేసే బాధ్యను ప్రక్కనేవున్న అత్తగారికి వప్పజెప్పి తాను లోపలికి వెళ్ళి పోయింది.

ఆమె గది దూరాన అక్కడికి కనిపిస్తూనేవుంది. ఒకగంట ఆమె ప్రవేశించిన గదివంక చూస్తూ బుడన్ ముసలమ్మకు అంతశ్రమ ఇస్తు న్నందుకు అనుతాపం తెలియబరచేడు.

సాయంకాలంనుంచీ వ్యవహారాల వివరణలో కోడలికి సాయ పడుతూ ముసలమ్మ అరుగుమీదనే కూర్చుంది. కోడలికన్న ఆమెవ్యవహార దక్షత బాగావున్న మనిషి. బుడన్ ప్రశ్నలు కాలక్షేపానికి వేస్తున్నట్లు ఆమెకు అనిపించింది. కాని, ఏమీ అనలేను. ఎంతయినా కోడలికన్న

పదేళ్ళయినా చిన్నవాడై వుంటాడు. కోడలి అందం నలగకపోయినా వయస్సు?

ముసలమ్మ పక్కఏర్పాట్లు చేయడంకోసం లోని కెళ్ళగానే బుడన్ కాలుస్తున్న సిగరెట్టును మట్టివేసి చరచర అనసూయమ్మ ప్రవేశించిన గది లోకి వెళ్ళేడు.

మారుబట్ట కట్టుకొనేందుకు కట్టుబట్ట విడిచిన స్థితిలో, తలుపు చప్పుడు వినబడి అనసూయమ్మ ఉలికిపడింది. నేలనున్న చీరకొంగు గుండెలకంటా లాక్కుని, దానివెనక నిలబడి, తిరగబడి చూసింది. ఆశ్చ ర్యం, భయంతో ఆమెకళ్లు పెద్దవయ్యేయి. ఏ నగలకోసమో పొడిచి చంపడుగద?

"ఏం కావాలి?"

బుడన్ చిరునవ్వు నవ్వేడు.

"ముసలమ్మ పక్క ఇక్కడ వేశానంది."

భర్త హయాములో కడబట్టిన ఆస్తిని మళ్ళీ పూటుకొనేటట్లు చేయ డానికి ఆమె కోడలి సౌందర్యాన్ని వుపయోగించింది. అనసూయమ్మను పట్వారీ లక్ష్మీనారాయణకు అలవాటుచేసిం దీవిడే. ఆ ఆడవాళ్లు తెస్తున్న అవమానానికి కుంగిపోయి ఏమీ చేయలేక కొడుకు ఎక్కడికో పోయేడు. అయినా ఆమె విచారపడలేదు. చండశాసనుడైన లక్ష్మీనారాయణ హత్య చేయబడినప్పుడు మాత్రమే ఆమె ఓమారు విచారపడింది. అదయినా ఆతడు పొందిన దుర్మరణానిక్కాదు. తమ ఆస్తి వ్యవహారాలు పూర్తిగా గాడిని పడకపూర్వమే అకాలమరణం చెందినందుకు మాత్రమే; అంతే.

అత్తగారి స్వభావం ఎరిగిన అనసూయమ్మ ఏమీ అభ్యంతరం చెప్ప లేదు. ఆస్తి రక్షించుకోడానికి ఇదికూడా అవసరం కాబోలు ననుకొంది.

బుడన్ తలుపు గొళ్ళెం పెట్టేడు.

ముసలమ్మ వాకిట్లోకి వచ్చి చూసేసరికి బుడన్ కనబడలేదు. మళ్ళీ లోపలి కొచ్చింది. కోడలి గదిలోంచి మాటలు వినబడుతున్నాయి. ఒక్కక్షణం నిర్ఘాంతపోయినట్లు నిలబడింది. తరువాత సరిపుచ్చుకొంది. బుడన్ వట్టి సేవకుడు మాత్రమే. అతనివలన జరగగల పనేమీ వుండదు. ఆ విషయం ముసలమ్మకు తెలుసు. కాని, వాణ్ణి కోడలు పక్కలోకి తీసుకొంది. ఇది అనవసరంగా లోకువ పడడమే ననుకొంది. కాని, కోడలి శారీరకావసరాన్ని గుర్తు చేసుకొని మనస్సు సరిపుచ్చుకొంది.

కాని, మరునాడు ఖాజీ ఈ వ్యవహారాన్ని సరిచెయ్యడానికై వెయ్యి రూపాయలు కావాలని కబురంపేడు. ఆ వార్తవిన్నాక అనసూయమ్మ తాను పడిన శ్రమ వ్యర్థం అయిందనే దుఃఖముతో అత్తగారిమీద విరుచుకు పడింది.

నువ్వు పడుకోమని పంపేవన్నాదంటుంది అనసూయమ్మ.

మనసుపడి తీసుకెళ్ళావనుకొన్నా నంటుంది ముసలమ్మ.

నెపం తనమీదనే పడినందుకు చురచుర లాడింది అనసూయమ్మ. ముసలిదిమాత్రం తక్కువదా? ఆ ఇద్దరి సిగపట్లలో ఇంటిగోడలమధ్య జరిగిపోయిన ఈ అవమానం నడివీధినపడింది. నలుగురూ నవ్వేరు.

కోపం, పట్టరానికోపం వచ్చింది. అనసూయమ్మ వియ్యాలవారికి మాత్రమే. అత్తాకోడళ్ళ జగడం మధ్య ఈ వినోదగాథ వీధిని పడగానే సావిత్రిని మామగారు పుట్టింటికి తోలేసేడు.

"దొరక్క దొరక్క తురకాడే దొరికాడా" యని అతడు హిందూ మతం మీదవున్న అపరిమితాభిమానాన్ని ప్రకటించేడు.

వియ్యపురాలికి పట్వారీ లక్ష్మీనారాయణతో వుంటూవచ్చిన సంబంధాన్ని ఆయన ఎరక్కపోలేదు. బహుశా లక్ష్మీనారాయణ హిందువుడే గనక ఆ వ్యభిచారం అవమానంగా తోచలేదేమోకూడా. వియ్యపురాలికి సావిత్రి ఒక్కర్తేకూతురు. నాలుగైదు వందల ఎకరాలకి వారసురాలు.

అంత ఆస్తిని పొదుపుచేసి పెడుతూండడంచేత కొడుకు పెళ్ళి కాలంలో లక్ష్మీనారాయణను బావగారూ అని పిలిచి బాంధవ్యం కలుపడాని కూడా సిగ్గుపడలేదు.

ఈ పరిణామాలకి నిజంగా అవమానబాధ ననుభవిస్తున్నదీ. దుఃఖ పడుతున్నదీ ఒక్కసావిత్రిమాత్రమే. అయితేనేం. మామగారు బండిఎక్కిం చేక ఆ అవమానానికీ, దుఃఖానికీ కారణం అయిన తల్లివద్దకు పోవడంతప్ప మరోశరణ్యంలేదు. కనబడనూలేదు.

తండ్రి ఎప్పుడు పోయేడో. ఎక్కడికి పోయేడో సావిత్రి ఎరగదు. అసలాయన ఎక్కడికన్నా వెళ్ళిపోయేడో. చచ్చిపోయేడో కూడా తెలియదు. తల్లి గడుపుతున్న జీవితంలాగే. ఆమె పునిస్త్రీతనంకూడా అభూతకల్పనే యేమో.

ఆమెతండ్రి అసలామెకు జన్మకారకుడే కాదేమో. అదీ తెలియదు సావిత్రికి. కాని. ఆ అజ్ఞాతవ్యక్తికే తండ్రితనం ఆపాదించింది. తండ్రిలాగ అక్కునచేర్చి ముద్దాడిన లక్ష్మీనారాయణను చిన్నతనంలో బాబయ్యగారని పిలిచింది. కాని. జ్ఞానం తెలిసేక తల్లికి ఆయనతోగల సంబంధం తెలిసేక ఆవిధంగా పిలవనూలేకపోయింది. తల్లిని గౌరవించనూలేక పోయింది. తండ్రి నామె యెన్నడూ చూడకపోయినా ఆయననుగురించి ఎన్నో కల్ప నలు చేసుకొంది. తల్లిమీద కోపంవచ్చినప్పుడు ముసలమ్మ అనేమాటల్ని పట్టి లక్ష్మీనారాయణ తనతండ్రిని చంపించి వుంటాడనికూడా భావించింది. తల్లికి ఆవిషయం తెలుసుననే కల్పనతో ఆమెపై తీవ్రమైన అసహ్యం పెంచుకొంది.

కాని, సావిత్రి చాల మేధకురాలు. ఎంతద్వేషం రగిలిపోతున్నా తల్లి నొక్క ఎదురుప్రశ్న వెయ్యగలశక్తి ఆమెలోలేదు. ఆ అసమర్థత ఆమె ద్వేషం, అసహ్యం పెరగడానికే తోడ్పడింది. తల్లిముఖం చూడరాదనే ఆమె నిర్ణయం. కాని....

తల్లిదగ్గరనుంచి పోడానికే ఆమె అత్తవారి యింటినిగురించి కలలు కంది. అన్ని ఆశలలాగే ఆ ఆశకూడా వ్యర్థమేఅయింది. తల్లి ఆస్తిని గురించి తన మగడూ, ఆతనివైపు బంధువులూ పెట్టుకున్న ఆశలూ, చంపుకొన్న అభిమానాలూ చూసేక ఆమె మరీ ఉడికిపోయింది.

ఒకనాడు సావిత్రి ధైర్యంచేసి భర్తను మందలించింది.

"లక్ష్మీనారాయణను మామగారూ అని పిలవడానికి అభిమానం అనిపించడం లేదా ?"

వామనరావు గుడ్లింతచేసి భార్యముఖంలోకి చూసేడు. ఆ మందలింపునకు అభిమానమూ కలిగింది.

"మీ అమ్మనే అడక్కపోయేవూ ఆమాట."

సావిత్రి చిన్నపుచ్చుకొంది. కళ్ళనీళ్లు తుడుచుకుంది. ఆమెను ఊరడించడంకోసం వామనరావు అన్నమాటలూ, తెలిపిన అభిప్రాయాలతో ఆతనిపై ఆమె కదివరకేమన్నా గౌరవం మిగిలితే అది కాస్తా తుడుచుకుపోయింది. వెళ్ళడానికి మరో చోటూ, ధైర్యమూ లేక అక్కడే మగ్గిపోయింది గాని ఆమె మనస్సు అక్కడ కూడా నిలవలేదు.

"ఆవిడ వొంట్లో హుమ్మస్సుంది. పడుకుంది. మధ్య నీకేం. నాకేం. ఆ వెధవ కుక్కచాకిరీ చేస్తున్నాడు. కుక్క కాపలాకాచి ఆస్తి పోగుచేసి పెడుతున్నాడు. ఏం తీపు తీసిందా ?"

లక్ష్మీనారాయణ హత్యచేయ బడినప్పుడు భర్త తన తల్లిని పరామర్శ చేయడానికి వెళ్ళేడు. పైకి చెప్పలేదనుకోంది. కాని, సావిత్రి ఎరుగు. తల్లి చాటుగా ఏడ్చింది. భర్త దిగులు పడ్డాడు. ఊరంతా పచ్చిపాల పరవాన్నం వండుకున్నారు. వాళ్ళతో సావిత్రీ ఆనందించింది. పండుగ చేసుకోలేకపోయినా.

లక్ష్మీనారాయణ చావుకి సంతోషించవలసిన అపకారం అతడు సావిత్రికి చేయలేదు. బయటవాళ్ళ కెంత దుర్మార్గుడైనా ఆవిణ్ణి కూతురులాగే చూసు కొన్నాడు. అయినా. ఆయన దుర్మరణానికి అనుతాపంకూడా కలగలేదు. ఆ ద్వేషం అకారణం అయినా, అంత భయంకరం.

లక్ష్మీనారాయణ ఒకరోజు తెల్లవారగట్ల మందబయలు కెళ్ళేడు. వెళ్ళిన వాడు మరి తిరిగి రాలేదు. అతని శవంకూడా కనబడలేదు. ఎవ్వరో పదిమంది మీదపడి పక్కనున్న గుట్టల్లోకి లాక్కుపోయారనీ. పనసపొట్టు తరిగినట్లూ, ఖైమాకొట్టినట్లూ నరికేసి పొలాలమీద చల్లేసేరనీ చెప్పేరు. నిజం ఎంతవరకో, రక్తపు మడుగు చూసినవాళ్లు నలుగురినీ కేకేసి వెతక బొయ్యేసరికి కుక్కలూ, నక్కలూ, కాకులూ, గద్దలూ ఆ మాంసఖండాల్ని విందారగించి వేసేయి. పంచాయితీ చేయడానికైనా ఒక్క శరీరభాగంకూడా దొరకలేదు. అతనిపై మందికున్న ద్వేషం సీమారహితం.

సావిత్రికూడా అసమర్థత పెంచిన ద్వేషంతో తబ్బిబ్బయి పోయింది. తల్లిచేస్తున్న పనిమీమున్న అసహ్యంతో ఆమె కూడబెడుతున్న ఆస్తినీ అసహ్యించుకొంది: ఆ ఆస్తికోసం భూములనుంచి లేవగొడుతున్న రైతుల మీద సానుభూతి పెంచుకొంది. వాళ్లు విజయం పొందినప్పుడూ, లొంగక తల్లిని ఏడిపించినప్పుడూ మనస్సులోనే విజయానంద మనుభవించింది. తన అసమర్థత, తన మెత్తదనంవలన తాను ఏమీ చెయ్యలేకపోయినా, తాను ద్వేషిస్తున్నవాళ్ళకి పరాభవం కలిగినప్పుడల్లా ఆమె ముఖం కళకళ లాడింది. నిరుడు వెట్టిచాకిరీ చేయడానికి ప్రజలు నిరాకరించి మంది సంగం పెట్టుకొన్నప్పుడు తాను ద్వేషిస్తున్న వాళ్ళంతా హడలిపోయేరు. మరల మిలిటరీవచ్చి పద్దాలని కాల్చేసి, జనాన్ని కొట్టినప్పుడే వాళ్ళముఖాలు విక సించేయి. కనక సావిత్రి మనస్సులో సంగాన్ని అభిమానించింది. పోలీసు వాళ్ళు నిరాధారురాలినిచేసి హింసించేరనీ, బంధువులంతా దూరంగా కొట్టేసే రనీ, విన్నప్పుడు చాకలి మంగమ్మని పిలిపించి, తన బట్టలువేసి, మొట్ట

మొదట ఆమెకు ఆశ్రయం ఇచ్చింది. తన అత్తవారివాళ్లు వ్యతిరేకించినా లెక్కచేయలేదు. ఆమె తన జీవితంలో స్వతంత్రించి చేసిన మొట్టమొదటి పని అదేనేమో!

సత్తెమ్మ ఆమెకు ఆబాల్య స్నేహితురాలు. గ్రామం అంతా పెద్దపులిని చూచినట్లు భయపడే కిష్టయ్యని జువ్వకర్రతో రెండు అంటించి పొలం లోంచి తరిమేసిందనివింది. మహాసంతోషం కలిగింది. చాకలిమనిషిద్వారా అభినందించింది. ఆమెను చూడాలనేకోరిక తెలిపింది.

తల్లిని సత్తెమ్మతో పోల్చుకుంది. వెంకటయ్యతో తన స్నేహితురాలికి గల స్నేహాన్ని ఆమె యెరుగును. కాని, అదికాదిప్పుడామెకు కనిపిస్తూంట. తన భూముల్ని తిరిగి స్వాధీనంలోకి తెచ్చుకొనేటందుకై తన తల్లి హత్యలుచేసినా, చేయించినా ఆమె సంతోషించేదేమో. కాని, జరిగింది వేరు. ఆ ఘటనను తన భర్త రసవత్తర శబ్దాలతో వర్ణిస్తూ పక్కలు పట్టుకొని నవ్వుతూంటే ఆమె సిగ్గుతో కుంగిపోయింది.

"పక్కలోచేరి పనులు చేయించుకోడం అలవాటయిపోయింది. వాడో ఉచ్చు. తేరగా వస్తే మావాడింకోడున్నాడనే రకం. పక్కలోకి చేరేడు. భూమి స్వాధీనం చేయించాలంటే వెయ్యాతెమ్మన్నాడు. వాడూ మొనగాడు. ఇప్పుడు ముండలిద్దరూ తిట్టుకుంటున్నారు. నువ్వు పంపేవన్నాడంటుంది మీ యమ్మ. నీకు కావలసి తీసికెళ్ళేవనుకున్నా నంటుంది ముసలిది. ముండలిద్దరూ సిగపట్ల గోత్రంలో పడ్డారు."

ఆ వినోదఘట్టాన్ని తలుచుకొని తలుచుకొని పక్కలు పట్టుకొని నవ్వేడు. మధ్యమధ్య ఆయాసం వచ్చినప్పుడో నిముషం ఆగి, మళ్ళీ మొదటికి వస్తున్నాడు.

సావిత్రి సిగ్గుతో కుంగిపోయింది. మగడి మాటలు విని, తల్లి తెచ్చిన అప్రతిష్ట తలచుకొని కళ్లనీళ్లు పెట్టుకుంది. ఆ నవ్వుచూసి

అసహ్యపడింది. ఇంత సిగ్గుమాలినవాడు, సానుభూతన్నా లేనివాడు తనకు మగడయ్యాడా అని దుఃఖపడింది. ఆ ఆవేశంలో మామగారు కచ్చడం బండి గుమ్మంలోపెట్టి ఎక్కమన్నాడు. మారుమాట లేకుండా ఎక్కేసింది.

మామగారు తన్ను ఇప్పుడు పుట్టింటికి ఎందుకు పంపుతున్నాడో సావిత్రికి అర్థం కాకపోలేదు. తన అమ్మగారిల్లు ఆ వూళ్ళోనే లేకపోయినా దూరభారంలో లేదు. రెండూళ్ళకీ మజరాగ్రామం వొక్కటే. దూరంకూడా రైతుల లెక్కలో రెండేరెండు చెలకలు అడ్డు. అయినా మామగారు కచ్చడంబండి సిద్ధం చేసేరు. దాని వుద్దేశం అర్థం అయింది. ఇదివరలో ఒకటి రెండుమాట్లు తల్లిగారింటికి ఆమె కాలినడకనే వెళ్ళవచ్చింది. కాని, ఇప్పుడీబండి ! భూముల్ని త్వరగా చేతిలోకి తెచ్చుకోడానికై మామగారు వొత్తిడి తేదలచేడనీ, దానికి ప్రస్తుత ఘటన నుపయోగించుకో దలిచేడనీ గ్రహించింది. కాని పైకి ఏమీ అనలేదు. మగని మాటలవలన కలిగిన అసహ్యంలో మాట్లాడక బండి ఎక్కింది. ఇటువంటి సిగ్గుమాలిన బ్రతుకు బ్రతుకుతున్నందుకు తల్లిని నాలుగూ తిట్టెయ్యా లనుకొంది. బండివాడిని పొమ్మనికూడా చెప్పకుండా చరచర లోపలికి వెళ్ళింది.

ఏదో పనిచేసుకొంటున్న తల్లి తలఎత్తి చూసేసరికి గుమ్మంలో కూతురు. కళ్ళు ఎర్రబడివున్నాయి. ఛెంపల్ని కన్నీటి చారికలు. ఆ కన్నీట తడిసి అంటుకుపోయిన ఒకటి రెండు ముంగురులు. అదిరిపోతున్న పెదవులు. నోటమాట చెప్పలేక, సహజమైన పిరికిదనంతో వేలికి చీరకొంగు మెలి తిప్పుతూంది. ఆమెను చూడగనే తల్లికి అసలువిషయం అర్థం అయింది. కూతురుకు తనపై ఎంత అసహ్యమో అనసూయమ్మ ఎరుగును. పండుగులకు పిలిచినా ఆమె రావడాని కిష్టపడదు. ఇంటికివచ్చి పడగలడబ్బు ఆశతో వియ్యంకుడూ, ముట్టే మంచిబట్టలూ, బహుమానాల ఆశతో అల్లుడూ ఆమెను బలవంతంచేసి పంపుతుంటారు. పండుగులకి తాను ఎంత విలువగల చీరతెచ్చీ ఆమెచేత ఒకపట్టాన కట్టించలేక పోయేది.

ఆ చీరనైనా తిరిగి వెళ్ళేటప్పు డుత్సాహంతో పట్టుకెళ్ళిందిలేదు. ఎప్పుడూ ఏ చాకలికోయిచ్చి పంపించడమే.

అటువంటికూతురు అప్రత్యాశితంగా ఇప్పుడు గుమ్మంలో నిలబడిం దంటే కారణం గ్రహించలేనంత తెలివితక్కువదికాదు. అనసూయమ్మ. కూతురు చూపులవెనకవున్న అసహ్యాన్నీ. ద్వేషాన్నీ సహించలేకపోయింది. అత్తింటినుంచి వచ్చిన కూతుర్ని కుశలం అడిగి. కూర్చోమని ఆహ్వానించాలనన్నా తోచలేదు. తమయిద్దరిమధ్యా ఏదోవాగ్వాదం జరుగుతూ జరుగుతూ మధ్యలో నిలచిపోయినట్లూ. తాను మళ్ళీ అందుకొన్నట్లూ చిర చిర లాడుతూ తిట్టడం మొదలుపెట్టింది.

"ఈ వెధవమూకకోసం కానిపనులన్నీ చేయవలసివస్తూంది. పైగా అంతా నన్నేవాళ్ళే. ఫో, పాడుమొహం నాకు చూపించకు."

బుడన్ చేసినద్రోహం అత్తగారు తిట్టినతిట్లూతో ఉడికిపోతున్న అనసూయమ్మ కూతురుమీద చీపురుకట్ట తీసింది.

తీరా తల్లియెదుట పడినాక సావిత్రికి మళ్ళీ పిరికిదనం ఆవహించింది. తల్లిని అనెయ్యాలనుకొన్న మాటలన్నీ మరిచిపోయింది. అతికష్టంమీద అనునయిస్తున్నట్లు ఒక్కమాట అనగలిగింది.

"మేమే చేయమన్నామా ?"

"అనేదేమిటి ? రాణిగారు ఇప్పు డెందుకు వచ్చేరో తెలీదా ? ఆస్తి రాసివ్వకపోతే పిల్లదాన్ని పంపేస్తానని మీమామగారు పెట్టినకబురు అందింది."

సావిత్రికి ఈవార్త కొత్త. అయితే కబురుకూడా పెట్టేడన్నమాట అనుకొంది. కూతురు ఆశ్చర్యాన్నిగాని, విచారాన్నిగాని అనసూయమ్మ లెక్కచేయలేదు.

"డబ్బు. మాట్లాడితే డబ్బు. ఏపనీ ఎవ్వరూ చేయమని చెప్పరు. ఏసంగతీ నీ కక్కర్లేదు. ఆముసిలిది చావుకి సిద్ధంగావుంది. ఆవిడకు కావలసింది అంతకంటెలేదు. ఇంక కావలసిందంతానాకే. ఫోండి. ఈభూమి లేకపోతే నాకేం గడవకపోదు."

అనసూయమ్మ మహాకోపంతో కూతురు రెండుభుజాలమీదా చేతులు వేసి గదిబయటకు నెట్టివేసి తలుపులు భళ్లున వేసుకొంది.

ఒక్కక్షణం సావిత్రి నిస్తబ్ధురాలయి నిలబడిపోయింది. మరునిముషంలో ఏదోనిశ్చయం చేసుకొంది. గబగబ ఇల్లువిడిచి వీధిలోకివచ్చింది.

నలుదిశలా చీకట్లు కమ్ముకొన్నాయి.



# ఆరో ప్రకరణం

షాహే ఉస్మాన్........జిందాబాద్

ఆజాద్....హైద్రాబాద్

షాహే....

ఆజాద్....

ఊరి పొలిమేరల్లో లారీ నిలబడింది. నిలబడడమే తడువుగా ఇరవైమంది పక్కల కెగబ్రాకి క్రింది కురికారు. లోపలినుంచి అందించిన కర్రలు, కత్తులు, జంబియాలు, భర్మార్లూ అందుకొన్నారు. పెద్దగా నినాదాలిస్తూ ఊళ్ళోకి బయలు దేరేరు.

ఇరవైమందీ చేతులు విసురుతూ, ఎవరికి తోచినప్పుడు వారు, తోచిన నినాదం ఇస్తూ కదిలి వస్తూంటే ఆ గలభా ఏమిటో తెలియక శీతారామపురం యావత్తూ కాళ్ల విరగతొక్కుకుంది. శివరామిరెడ్డి దొర మిలిటరీని తోడుతెచ్చేడే యన్నారు. అన్నదే తడువుగ ఎక్కడిపని అక్కడే వదలిపెట్టి పారిపోయేటందుకు ప్రయత్నించేరు. తమ భర్తలు, తండ్రులు, అన్నలు, తమ్ములు తప్పించుకు పోయేటందుకు అవకాశంకలిగించేటందుకై ఇళ్ళల్లోని ఆడవాళ్ళంతా చటుక్కున వీధిలోకి వచ్చేసేరు. గంద్రగోళం వినవచ్చినవైపుగా పరుగులెత్తుతున్న పిల్లగాళ్ళని కేకపెట్టి పిలుస్తున్నారు. వినిపించుకోకపోతే అరిచి తిడుతున్నారు. అప్పటికీ తిరక్కపోతే వెంట పరుగెత్తి పట్టుకొని జబ్బ పాయిసాలు, రెండు మొట్టికాయలూ బహూకరించి లాక్కువస్తున్నారు.

ఇంతలో వీధిమొగకు వూరేగింపువచ్చింది. అందరికీముందు ఇద్దరు అరబ్బువాళ్లు అరచేతివెడల్పు పట్టాకత్తులుదూసి నడుస్తున్నారు. ఏదో అరుస్తు

న్నాడు. గొంతులు బొంగురుపోయి మాట తెలియడమేలేదు. వాళ్ళ వెన కనే పెద్ద బల్లెంతీసుకొని ఖడన్ వస్తున్నాడు. తాను ఎరిగున్న మొహాలూ, తనను ద్వేషించే మొహాలూ కనబడగానే ఆతడు స్వరం హెచ్చించేడు.

షాహే ఉస్మాన్....

అంతవరకూ ఇష్టం వచ్చినట్లల్లా అరుస్తున్న ఇరవైకంఠాలూ ఒక్క మారు కలిశాయి.

....జిందాబాద్.

ఆ దృశ్యంచూసీ, అరుపులువినీ అదిరిపోయి ఆడవాళ్ళంతా ఇళ్ళల్లోకి బిలబిలలాడుతూ దూరిపోయారు. జనం కంగారు చూసేక ఊరేగింపులో వాళ్ళ ఉత్సాహానికి మేరలేకపోయింది. నినాదాలు మళ్ళీ గాడి తప్పేయి.

ఊరేగింపులో అందరి చేతుల్లోనూ కత్తులో, కటార్లో, బరిసెలో, బర్ఛీలో, బందూకులో, జంబియాలో, ముడ్డుకర్రలో వున్నాయి. నినాదానికి పూతం యిచ్చేటందుకు ప్రతివాడూ చేతులు విసురుతున్నాడు. ఎగురు తున్నాడు. ఉన్నట్టుండి, ఆవేశంపట్టలేక, అడుగువేస్తూ, కర్రో, కత్తో తిప్పుతున్నాడు. పల్టీలు కొడుతున్నాడు. పరవళ్ళు తొక్కుతూ ఊహా కల్పిత శత్రువుల్ని అంత దూరాన నిలబెట్టడానికి హైరాణవుతున్నాడు. ఆతని కర్రదెబ్బ శత్రువులకేగాక తమకే తగిలే ప్రమాదం వుండడంచేత చుట్టూవున్నవారు గబగబ తప్పుకొని అతడు ఆయాసపడేటందుకు అవ కాశం కలిగిస్తున్నారు. ఆ కంగారులో ఒకరిమీద ఒకరుపడి అదాబ్ చెప్పు కొంటున్నారు.

ఈ ఆవేశాలు అంటురోగంలా అందరికీ అంటుకొంటూ రావడంచేత ఊరేగింపు అడుగడుగునా నిలిచిపోతూంది.

గమళ్ళపుల్లమ్మ దుకాణంవద్దకు వచ్చేసరికి ఊరేగింపుకు దాహం వేసింది, చూస్తూండగానే ఆదాహం విదాహం అయింది. దుకాణానికి గిరాకీ

తగిలినందుకు పుల్లమ్మ ఆనందపడింది. ఆమెరెండుచేతులూ ఆ ఆనందాన్ని అందుకోడానికి చాలలేదు. కూతుర్ని పిలిచింది. ఈగంద్రగోళంలో తమకు దెబ్బలు ఎక్కడ తగులుతవో ననేభయంతో పుల్లమ్మ మగడూ, అల్లుడూ అరగంటక్రితమే పారిపోయారు.

పుల్లమ్మ ఆనందాన్ని అల్లంత దూరంనుంచే చూసి కోటమ్మ పరుగెత్తి వచ్చింది. దొడ్డిదారిన ఇంట్లోకెళ్ళి నెత్తీ నోరూ కొట్టుకొంది.

"ఊళ్ళో మమ్మల్నెవర్నీ బ్రతకనియ్యవుటే పుల్లమ్మతల్లీ!"

పోలీసులూ, మిలిటరీవాళ్ళూ, ఇట్లాంటి వూరేగింపుల్లోవాళ్లూ దుకాణాల్లో మస్తుగా తాగి ఊరంతా అల్లరి చేసిన ఘటనలు అనేకం కోటమ్మవింది. ఒకటి రెండు తానూ చూసింది. పుల్లమ్మ ఆమెవాదాన్ని ప్రత్యాఖ్యానం చేసింది.

"నాలుగు పైసాలొచ్చేవి వదులుకో మంటావుటమ్మా కోటమ్మ వదినా?"

బుడన్ దుకాణంలోకి వస్తూనే ముందుగానే ఓ పదిరూపాయల నోటును పుల్లమ్మ కందించేడు. ఈ బేరంలో బాగా కిట్టుబాటు కాగలదనే ధైర్యంఅదే. ఆపదీ కంటబడకపోతే ఈపీడ ఎలాగవదల్చుకోడం కోటమ్మా యని వెంటబడేదే. అట్టే నష్టపడకుండా వాళ్ళని వొదుల్చుకొనేటందుకు తానూ తొందరపడివుండేది.

కోటమ్మ నిరాశతో తల వ్రేలవేసుకొని లేచివచ్చింది.

మరల వూరేగింపు కదిలింది. కాని ఈ మారు మనుష్యులలో ఆ గాంభీర్యం లేదు. చేతులలో ఆయుధాలు పైకి లేవడంలేదు. అడుగులూ సరిగ్గా పడడంలేదు. కాని త్రాగుడుమత్తులో అల్లరీ, భీభత్సం ఎక్కువ ప్రారంభించేరు.

నది బజారుకు ఊరేగింపు వచ్చింది. అడుక్కునేందుకు తిరుగుతున్న ముసిలి ముష్టివాడు దారి తొలిగి ఒకపక్కగా నిలబడ్డాడు. వానిని దాటి ఊరేగింపు కొంతదూరం నడిచిందికూడా. ఇంతలో అతనిచేత నినాదాలు చెప్పించాలని ఎవరికో, ఎందుకో తోచింది. వెంటనే పిలిచేరు.

నలుగురూ వానిచుట్టూ చేరేరు. నినాదాలు చెప్తున్నారు.

షాహే ఉస్మాన్....

ఆజాద్....

ఆ ముసిలివాడికి ఈ గొడవేమీ అర్థంకాలేదు. వానికి తాను అనవలసిందేమిటో, ఎందుకనాలో తెలియలేదు. తన్ను పట్టుకొన్నవాళ్ళు తాగివున్నారు. వాళ్ళచేతుల్లో కర్రలూ, కత్తులూ వున్నాయి. భయంతో వాని నోరు బిగుసుకు పోయింది.

చివరకు వాని భయం నిజమే అయింది.

ముష్టివానినోట తాము చెప్తున్న మాటలు రాకపోయేసరికి ఊరేగింపులో వాళ్ళకి మహాకోపం వచ్చింది. ఆలాహజ్రత్ జిందాబాద్ అని చెప్పనివాళ్ళు హైద్రాబాద్ ఆజాదీకి వ్యతిరేకులే అయివుంటారు. అంతా ఆ విషయాన్ని ఏకగ్రీవంగా అంగీకరించేరు. ఒక్కపెట్టున నాలుగువైపుల నుంచీ ఆసమ్మతి ప్రతిధ్వనించింది. ఆ అసమ్మతిలో ప్రతీకారాన్ని వాంఛించేరు.

"మారో బద్మాష్‌కో"

కర్రలతోపాటు బల్లేలు లేచేయి. ఒక ఆరబ్బువాని కత్తిపోటుతో ముసిలివాడి ప్రాణం పోయింది. బరిసె పోట్లూ, కత్తిపోట్లతో తిండిలేక ఎండి వరుగులావున్న ముసిలాడి రక్తం నేలని కాలవ కట్టింది.

ఇళ్ళల్లో తలుపుల వెనకా, తడకల వెనకా నిలబడిచూస్తున్న ఆడవాళ్ళూ, పిల్లలూ ఆ దురంతాన్ని చూసి గొల్లుమన్నారు.

ఆ అరుపులు విన్నాక, రక్తం కళ్ళబడ్డాక ఊరేగింపుకు తెలివి వచ్చింది. ముసలివాడి కాళ్లుచేతులు ఇంకా కొట్టుకొంటూ తన్ను హత్య చేసిన వారిమీది కురకడానికి ప్రయత్నిస్తున్న ట్లనిపిస్తూంది. ఒక్కమాటు ఒళ్లు కంపరం పుట్టింది. నిలవలేకపోయేరు. ముందొకడు ఉరికేడు. వాని వెనుక మూక అంతా ఉరికింది.

ఊరేగింపులోవాళ్లు పారిపోతూండడం గమనించి, ముసిలివానికి సహాయం చేయడానికై ఇళ్ళల్లోవున్న జనం బిలబిలలాడుతూ పరుగెత్తి వచ్చేరు. పరుగెత్తివస్తూ పెద్దగా గోలచేస్తున్నారు.

ముసిలివానిని చూడడానికి వస్తున్న జనాన్ని చూసేక ఊరేగింపులో వాళ్ళకాళ్లు మరింతచురుగ్గా కదిలేయి. తమ మీదికే వారంతా వస్తున్నా రని పించింది. ఇంకా ఇంకా వేగంగా పరుగెత్తే ప్రయత్నంలో బోర్ల పడుతున్నారు. లేస్తున్నారు. తమకంటె ముందుపోతున్నవాళ్ళని పిలుస్తున్నారు. ఒకటే కోలాహలం.

ఊరిబయట లారీ నిలబడివుంది. తాను తెచ్చి దింపినజనం నినాదాలను కట్టిపెట్టి, వెర్రికేకలు పెడుతూ వురుకు వురుకున వస్తూంటే డ్రైవరుకు కంగారు పుట్టింది. ఏదో ములిగిందనుకొన్నాడు.

కండక్టరు హేండిల్ వేసేడు. ఇంజను స్టార్టుకాకుండా మొరాయిస్తూంది. చివరకి గుర్రు. బర్రుమంది. ఇంజను ఆగిపోకుండాచేసే ఆదుర్దాలో డ్రైవరు బండిని కదిపేడు. జనం ఎక్కుతూన్నది ఆతడు గమనించనూలేడు. గమనించినా మాననూలేడు. రేకులు పట్టుకొని పైకెగబ్రాకుతున్న వాళ్ళల్లో ఒకడు చప్తాగా క్రిందబడ్డాడు. ఇద్దరు ఈడిగిలబడ్డారు. నాలుగువైపులనుంచీ ఆదుర్దాగా అరుపులు వినబడ్డాయి.

"తహరో, తహరో."

అంతా కష్టపడి లారీలో కెక్కేరు. ఆ భారాన్ని ఈడవలేక అసంతృప్తి తెలుపుతున్నట్లు లారీఇంజను గురుగుర్రుమంటూంది. భయంలేదనే భరోసా చిక్కేక అందరికీ మళ్ళీ గొంతులు విడ్డాయి.

పాకిస్తాన్.... మిల్ గయా.

షాహే ఉస్మాన్....

....జిందాబాద్.

అజాద్....

....హైద్రాబాద్.

ఇత్తెహాదుల్ ముస్లిమీన్, కాశిం రజ్వీలకీ ర్తికి ఊరేగింపు జోహారు లర్పించింది. ఆ నినాదాలతో శ్రుతిగలుపుతూ లారీ పరుగుతీసింది.



## ఏడో ప్రకరణం

•

ఒక మహావీరునికి జరిగే మర్యాదలతో ముసిలి ముష్టివాని శవం గ్రామ వీధులలో కదిలింది. అదివరలో ముష్టి పెట్టడానికి విసుక్కున్న వాళ్లకూడా రెండుచేతులా పువ్వులు శవంమీదచల్లేరు. జాలితోనో, అసహ్యం తోనో ఈ ముసిలాణ్ణి యముడుకూడా మరిచిపోయేడన్నవాళ్ళే నేడాతని మరణానికి కంటతడిపెట్టారు.

నేడాతడు అమ్మా, అయ్యా అని అడుక్కుతినే ముష్టి ముసిలాడు కాడు. దిక్కూ, దీమూలేని అనాధుడూకాడు. ఉస్మాన్ షాహీకి జైకొట్ట నిరాకరించిన ప్రజాతంత్రవాది. హైద్రాబాద్ స్వతంత్రంగా వుండాలన్న నినాదాన్ని పలక నిరాకరించిన దేశభక్తుడు. ఆశయానికై అసువు లర్పించిన ధీరుడూ, త్యాగధనుడూను.

నిజాము పరిపాలన నిష్ఠుర యమలోకానికి పర్యాయం. జాగీర్దారీ దురంతాలకు, వెట్టిచాకిరీకి, కరువుకు, అవిద్యకు పుట్టిల్లు. తెలంగాణా ప్రజానీకం ఆపీడ వదల్చుకోవాలనే ఎప్పుడూ కలలు కంటున్నారు. అందరూ ఆ మాటనే బైటకు చెప్పలేకపోవచ్చు. ఉస్మాన్ షాహీ పోవా లని తాము పైకి చెప్పలేకపోయినా, ఆ విధంగా చెప్పగలవానిని అభినం దించకుండా వుండలేరు. ముసలివాడు వద్దని అనలేదు. కాని, కావాలనీ అనలేదు. కనకనే ఆతడు వారికళ్ళల్లో ఒకమహాయోధు డయ్యాడు.

ఆతని మరణఘట్టాన్ని గురించి కోటమ్మ అతిశయోక్తులేమీ చెప్ప లేదు. తాను కన్నవీ విన్నవీ మాత్రమే చెప్పింది. గోడల చాటునుంచి విన్నవాళ్ళూ, కన్నవాళ్ళూ ఆ మాటల్ని రుజువుపరిచేరు.

కోటమ్మ గమళ్ళ పుల్లమ్మ ఇంటినుంచి తిరిగొస్తూ కోమటి పేరయ్య ఇంటిమూల కొచ్చింది. పేరయ్యభార్య పిలుస్తే లోనికెళ్ళింది. వూరేగింపు వాళ్ళొకివస్తూన్నవార్త తెలియగానే పేరయ్య దుకాణం మూసేసేడు. గల్లాపెట్టి పాతిపెట్టేడు. విలువయిన సరుకులు తలోమూలా దాచేసేడు. కొట్టుగది తాళంవేసి, చెవులు మొలలో దోపుకొని ఇంట్లోంచేకాదు - వూళ్ళోంచికూడా వుడాయించేడు.

ఊరేగింపు వాళ్ళ కంటబడితే కొట్టుసగం ఖాళీ అయిపోతుంది. గల్లాపెట్టెకూడా తరుచుగా ఖాళీఅయి తేలిక అయిపోతూంటుంది. బాబ్బాబు నీ కాళ్ళొక్కుతానన్నా తన్నులూ, తాపులూ మాత్రమే దక్కుతాయి. ఆ భయంతోనే ఆతడు జారుకొన్నాడు. ఇంట్లో ఆడాళ్లు బిక్కుబిక్కుమంటూ వుండిపోయారు. మాటకారి కోటమ్మ వాకిట్లో కనిపించేసరికి ప్రాణాలు లేచొచ్చేయి. పిలిచేరు.

వాళ్ళ వాకిట్లోనే ఆ దురంతం జరిగింది. అది చూస్తూంటే వాళ్ళ కెంతో బాధా, దుఃఖమూ కలిగింది.

ఆతడో ముష్టివాడు. ఆతనిపేరు ఎవ్వరికీ తెలియదు. ఆకారం చూస్తే ముసిలివాడల్లే వున్నాడు. వాళ్ళకి జ్ఞానం వచ్చినప్పటినుంచీ ఆతడు ముష్టి ఎత్తుకొనే బతుకుతున్నాడు. అందుచేతనే ఆతనికా నామధేయం.... ముసిలి ముష్టాడు.

ఊరేగింపులో వస్తున్నవాళ్ళని అతడు తిట్టేడా, తిమ్మేడా? వాళ్ళొస్తూంటే దారిచ్చి ఓ పక్కగా నిలబడ్డాడుకూడా. వూరేగింపులోవాడే ఎవడో అతణ్ణి "ధోతీ ప్రసాద్" అని ఎగతాళిగా పిలిచేడు. మిగత వాళ్ళంతా నవ్వేరు. ముసలాడేదో పెదవులు కదిలించేడు. ముసిలి బోసి నోటివాళ్ళ కదో అలవాటు. అస్తమానూ పెదవులూ, దవడలూ ఆడిస్తుంటారు. అంతేగాని ఆతడేమీ అనివుండడు. అన్నాగానీ ఎవరికీ విని

పించలేదు అదేమిటో, బోసినోరు కదిలించేదేతప్ప ఏమీ అనే స్వభావం కలవాడుకాదని కోటమ్మ తన అభిప్రాయం చెప్పింది.

ఆ తర్వాత బుడన్‌గాడో. ఎవ్వరో .... ఆ వూరేగింపులో ఆమె బుడన్ నే ఎరుగును. కనక వానిపేరే నోటికి చటుక్కున వచ్చేసింది .... బహూశా బుడనే అయివుంటాడు. దగ్గిరి కొచ్చేడు.

"పాకిస్తాన్ మిల్‌గయా" — అనమన్నాడు. ముసలా దేమీ అన లేదు ....

మరో దెవరో షాహే ఉస్మా నన్నాడు. జిందాబాద్ అనమన్నాడు .... ఉహూ ముసిలాడు నోరు విప్పలేదు.

ఆజాద్ హైద్రాబాద్ - అనమన్నారు. అదీ అంతే. వాళ్ళకి కోపం వచ్చింది. ఎవడో బల్లెం ఎత్తేడు. ముసిలాడు కదలలేదు. అరబ్బువాడు కత్తితో పొడిచేడు.

ముసిలి ముష్టివాని త్యాగనిరతినీ, దేశభక్తినీ తలచుకొని గ్రామం అంతా వుద్రేకపడింది. రంగయ్య ఆవార్త వినగానే పరుగెత్తుకొని వచ్చేడు. పెద్దదొర కొడుకు రఘునందనరెడ్డీ, అల్లుడు రాజిరెడ్డీ ఊరేగింపు బయల్దేరే వేళకి వచ్చేరు.

చేతులు వికారంగా చాచి, కాలుతున్న బూడిదలో బోరగిలా పడి వున్న ముసిలివానిని చూసి రంగయ్య చాల వుద్రేకపడ్డాడు. ఇత్తెహాదుల్ ముస్లిమీన్ రజాకార్లు సాగిస్తున్న దౌర్జన్యచర్యల వార్తలు కొత్తవేం కాదు. వాటికి ప్రభుత్వం మద్దతు బాగావుంది. సందేహంలేదు. లేకపోతే సంస్థానంలో నాలుగువేపులా జరుగుతున్న ఘటనల కర్ధమేలేదు.

ఏడాది క్రితం కాంగ్రెస్ జెండాను ఎగరవేసినందుకు వరంగలు జిల్లాలో మొగిలియ్యను హత్య చేసేరు. ఆ హంతకులు కత్తులూ, కటార్లతో ప్రదర్శనలు చేస్తూంటే అధికార్లు అంతా ఆనందించారు.

ఈ మధ్య ముస్లిం గూండాలు మట్టివాడలో మనుష్యుల్ని కొట్టేరు. కొంపలు దోచేరు. తగులబెట్టేరు. మొత్తం నాలుగయిదు లక్షల రూపాయల ఆస్తి నష్టపరిచారు. నిజాం ప్రభుత్వం దుండగీళ్ళని శిక్షించడానికి బదులు ధ్వంసం అయిన ఆస్తి నాలుగు లక్షలు కాదనీ 75 వేలది మాత్రమే ననీ ప్రకటనలు చేసింది. 75 వేల ఆస్తి నష్టానికి గూండాలని నొక్కేయ్య నక్కర్లేదనా ప్రభుత్వం ఆలోచన?

ఇవన్నీ ప్రభుత్వంమీద ఆతనికి విశ్వాసం అనేది లేకుండా చేస్తున్నా. ముసలి ముష్టివాని హత్యవిషయం రిపోర్టు చేయడానికై పోలీసు పటేలు ఇంటికి వినవిసా నడిచేడు. వెళ్ళినా జరిగేదేమీ వుండదు. అదీ తెలుసు. కాని చదివింది వకాలతు. ఆ చదువు ప్రభుత్వ యంత్రపరిధుల్ని దాటి ఆలోచించనివ్వదు.

తీరా వెళ్ళేసరికి పోలీసుపటేలు ఇంట్లో లేడన్నారు. రెండోమాటు అడిగితే అసలు వూళ్ళోనే లేడన్నారు. ఇంక తానే బాధ్యత వహించి అయిదారు మైళ్ళదూరంలోవున్న పోలీసు నాకాకి మనిషిని తోలేడు.

* * * *

పోలీసుల రాకకోసం ఎదురుచూస్తూ జనం తమ కళ్ళముందు జరిగిపోయిన ఈ ఘోర దురంతాన్ని గురించి కధోపకధనం సాగిస్తున్నారు.

ఇత్తెహాదుల్ ముస్లిమీన్ రజాకార్లూ, దేశముఖుల గూండాలూ పోలీసులూ వూళ్ళల్లో సాగిస్తున్న దౌర్జన్యాల కధలు పలుముఖాల వినబడుతున్నాయి. దౌర్జన్యాల వార్తలతో ప్రారంభమయిన కథలు ప్రతిఘటన గాధలలోకి మారేయి.

విసునూరు దేశముఖు గూండాలు మోహనరెడ్డిని నానాహింసలు పెట్టేరు. ఆయన చచ్చిపోయేడని కొందరన్నారు. బ్రతికే వున్నాడని మరికొంద రన్నారు. మోహనరెడ్డి బ్రతికి వున్నాడో లేదో తేలకపోయినా

ఆయనను గూండాలు చచ్చిపోయేటంతవరకూ కొట్టేరని రంగయ్యకి అర్థం అయింది. కొట్టిన రౌడీలంతా రొమ్ములు విరుచుకు తిరుగుతున్నారనే కని పిస్తూంది. రౌడీ నాయకుల్లో ఒకడన్న మేరె రంగయ్యని తాను మొన్న నల్లగొండలో చూసేడు.

•

ఇంతకీ మోహనరెడ్డి చేసిందేమిటి ? దేశముఖు ధర్మాపురంలో రైతుల్ని లేవగొట్టి భూములు ఆక్రమించాలని చూసేడు. మోహనరెడ్డి సంగంపెట్టి రైతుల్ని నిలబెట్టేడు. దేశముఖు పోలీసుల్ని తెచ్చి రెడ్డిని అరెస్టు చేయించేడు. జైలులో వేయించేడు కాని, ఆయన అక్కడ ఎన్నోరోజు లుండలేదు. జైలులోంచి పారిపోయి వచ్చేడు. వచ్చి కూర్చు న్నాడూ ? మళ్ళీ జనాన్ని పోగుచేసేడు. ఓ రోజున రౌడీలు ఆయనని దొరికించుకొని కొట్టేరు. ఆ కొట్టడంకూడా బహు అమానుషంగా. మర్మ స్థానంలోనూ. కళ్ళల్లోనూ కారం కూరేరుట.

ఇల్లాంటి హింసల్ని కూడా ధిక్కరించి ప్రజ తిరుగుబాటు చేస్తూంది. ఎదురుదెబ్బ కొడుతున్నారు. అవన్నీ వింటూంటే తన భూమిని విడిపించ డానికై గ్రామస్థులు చూపిన సాహసం గుర్తు కొచ్చింది. ఆ ఆలోచన తట్టగానే ముసిలి ముష్టివాని మరణంలో ఏదో చెప్పలేని ఉదాత్త భావం రంగయ్యకి కనబడింది.

తెల్లారుపల్లి జాగీర్దారుకూడా భూముల్లోంచి రైతుల్ని వెళ్ళగొట్టి. వాటిని ఆక్రమించాలనే బయల్దేరేడు. ధర్మాపురం, తెల్లారుపల్లి, తమ సీతా రాంపురం .... ఓ వూరేమిటి. పల్లేమిటి ? సర్వత్రా భూస్వాముల యావ ఒక్కటేలా కనిపిస్తూంది. ఊళ్ళోవున్న భూమినీ, చుట్టుప్రక్కల వూళ్ళనీ కూడా చుట్టబెట్టాలనే దొక్కటే పరమార్థం అనుకొంటున్న ట్లనిపిస్తూంది. తెలంగాణా సమస్యే ఇది.

జాగీర్దారు తెల్దారుపల్లికి తన మనుష్యుల్ని పంపేడు. వాళ్ళని గ్రామ ప్రజ యావత్తూ ఎదుర్కొని తరిమేసేరు. ఆ కసితో జాగీర్దారు నెలా పదిహేనురోజుల క్రితం వూరంతా తగులబెట్టించేసేడు.

తెల్దారుపల్లి ప్రజల పోరాటగాథ ప్రజలనోట మహారసవంతంగా అభివర్ణిత మవుతూంది.

పదిరోజుల క్రితం జాగీర్దారు రౌడీలు సాంబయ్యగారి పొలం ఆక్రమించడానికి మళ్ళీ వచ్చేరు. కొంపలు తగుల పెట్టేక గ్రామస్థులకు కుసులు లొంగి వుంటాయని వాళ్ళ అంచనా. కాని జరిగిందివేరు. మంది రౌతులూ, వడిసెలలూ యధేచ్ఛగా వాడేరు. ఆడవాళ్ళూ, ముసిలివాళ్ళూసహా రౌడీల్ని చితక్కొట్టేసు.

నాలుగువందలమంది ఆడా, మగా, పడుచూ, ముసిలీ అనకుండా వచ్చిపడ్డారు. గూండాలవద్ద బందూకులూ, జంబియాలూ, కత్తులూ, కర్రలూ, జంజాలూ వున్నాయి. రైతులవద్ద ఒక్కటీలేదు. అయితే మాత్రం వెనకాదేరా ? ఆరుగురికి బందూకు దెబ్బలు తగిలేయి. ఒకరేనా జంకేరా ?

తన వూళ్ళోని పడుచువారు కర్రసాము నేర్చుకొంటున్న ఘటన రంగయ్యకి గుర్తు వచ్చింది. బందూకుల ముందు కర్రలేంచేస్తాయని తాను నవ్వుకొన్నాడు. ఏమీ చెయ్యలేవు. ఆ మాట నిజమే. ఇక్కడ ప్రాముఖ్యత మనుష్యులది. వారి చేతుల్లోవున్న కర్రలవీ కాదు ; బందూకులవీ కాదు.

తమ్మినేని అప్పయ్యగారికి గుండుదెబ్బ తగిలింది. అంత బాధలోనూ ఆయన ఓ రౌడీని నేల పడగొట్టేడు. వేగినాటి లక్ష్మయ్యగారికి కత్తిపోటు తగిలింది. ఆయన లొంగలేదు. చేతిలోవున్న దుడ్డుకర్ర తీసుకొని ఓ రౌడీని జందెప్పెట్టుగా వేసేసేడు.

ఆడవాళ్లు రౌతులందిస్తూంటే మగాళ్ళు వడిసెలలు విసిరేరు. గూండాలకు రషీద్ అన్నవాడు నాయకుడట. వాడు పారిపోతూ, పారి

పోతూ ఆడవాళ్ళకి దొరికేడు. పొలంమీద పేచీలోకి పోలేక పొలిమేరల్లో కూర్చున్న ముసిలాళ్ళూ, ముతకాళ్ళూ, ఆడవాళ్ళూ వాడిని పట్టుకొని పుఱసులోకి ఎముకలేకుండా చితక పొడిచేరు. తాను పంపిన రౌడీమూక పని ఎల్లా చేస్తున్నారో చూస్తూ దగ్గర్లో గట్టుమీద తెల్దారుపల్లి జాగీర్దారు నిలబడి వున్నాడు. ఆతడిని చూడగానే జనం అటు తిరిగేరు. ఈ ఉప్పెన చూసి ఆతడు ఖమ్మందాకా ఒకటే పరుగు.

ఒక్కొక్క కథ జనంలో మరుగుతూన్న నూనెలో పడ్డ నీటిచుక్కలా పనిచేస్తూంది. ప్రజ ఉద్రేకం, ఆవేశంతో ఉడికిపోతున్నారు.

సాయంకాలం వేళకి పోలీసు నాకాకి వెళ్ళిన మనిషి వచ్చేడు. అక్కడ జరిగిన ఘటనలు చెప్పేసరికి ప్రజల వుద్రేకాల్ని పట్ట శక్యం కాకుండా పోయింది.

ముసిలి ముష్టివాణ్ణి ఇత్తెహాదుల్ ముస్లిమీన్ రజాకార్లు పొడిచి చంపేసేరని చెప్తే అమీను మరేం కొంపమునిగిపో లేదులే అన్నాడు. పోలీసు పటేల్ ఫిర్యాదు చేస్తేతప్ప తనకేం సంబంధం లేదన్నాడు. మరో మాట చెప్పేసరికి మండిపడ్డాడు. చచ్చింది నువ్వు కాదుగదా?....రిపోర్టిచ్చే పని నీకేం వచ్చింది?....ఎవరివో సంగం వాడివల్లే వున్నావే....యని కఱ్ఱ తీసుకొని రెండు కొట్టేడు. జైలులో పెట్టకుండా తరిమేసినందుకు సంతోష పడుతూ ఆతడు పారిపోయి వచ్చేడు.

ఫిర్యాదుకు పట్టినగతి విన్నాక జనం గర్జించింది. తెల్దారుపల్లి మహిళల వీరగాథలతో ఉబ్బి తబ్బిబ్బులయిపోతున్న మహిళాలోకం ముందడుగు వేసింది. వాళ్ళ ప్రోత్సాహంతో మగాళ్లు కదిలేరు. పెద్ద సమారోహంతో ముసిలివాని శవాన్ని వూరేగింపు తీసేరు. చుట్టుప్రక్కల నాలుగు మూడు పల్లెల్లోని డప్పులూ తాళాలూ వచ్చేయి. వందలూ, వేలూ జనం పోగు పడ్డారు. ఒక్కొక్క మనిషి వచ్చిచేరినకొద్దీ జన సముద్రంలో ఒక్కొక్క కెరటం లేస్తూంది.

ముసలి వానిని హత్యచేసిన రజాకార్లమీద కోపం వుండొచ్చు: తాటస్థ్యం వహించడంద్వారా పోలీసులు రజాకార్లకి ప్రోత్సాహం ఇస్తున్నారనే నమ్మకం వుండొచ్చు. ముసలివాని మరణంలో ఉదాత్తతా కనబడవచ్చును. కాని, రంగయ్యకిమాత్రం ఆతని శవాన్ని వూరేగించడం, దానికంత సమారోహం నచ్చలేదు.

ఆతని అభ్యంతరాలు పలుముఖాలు. కొన్ని పైకి చెప్పగలడు: కొన్ని చెప్పలేడు.

అన్నింటికన్నా పెద్ద అభ్యంతరం వూరేగింపు జరపడానికి ప్రభుత్వం అనుమతిలేకపోవడం. ఇప్పుడై తేతప్పంతారజాకార్లదీ, ప్రభుత్వోద్యోగులదీ. కాని అనుమతి లేనిదే వూరేగింపు జరపడం తప్పంతా తమ నెత్తిన వేసుకోవడం అవుతుందని ఆతని అభిప్రాయం. చట్టరీత్యా సమస్యల పరిష్కారానికి పూనుకోకుండా చట్టధిక్కారానికి పూనుకొంటే పోలీసుల దౌర్జన్యాలకో కారణం కల్పించిన వాళ్ళం అవుతామని ఆతని అభ్యంతరం.

రెండోవేపున మనస్సులో మరో సందేహంకూడా లేకపోలేదు. ముసిలి ముష్టివాడు ప్రజ లనుకొంటున్నంత త్యాగం చెయ్యగలడనే నమ్మకం ఆతనికి లేదు. నిజాం వుండాలో, పోవాలో ఆతని కేం తెలుసును? పాకిస్తానంటే ఏమిటో, హైద్రాబాద్‌కు ఆజాదీ అంటే ఏమిటో ముసిలివాడికేగాదు. ఇక్కడున్నవాళ్ళల్లో ఎందరికి తెలుసు? ఆ నిర్భాగ్యులు తెగ తాగి క్రిందూమీదూ ఎరగని దశలో చంపేసేరు. వాని నిప్పుడు బ్రహ్మాండ నాయకుణ్ణల్లే వూరేగించడంలో అర్థం ఏమిటి?

కాని, ఈ అభ్యంతరాన్ని అందరివద్దా చెప్పగల ధైర్యంలేదు. ధైర్యంగా తాను చెప్పగలిగిన అభ్యంతరాన్ని జనం ఖాతరు చెయ్యలేదు.

*    *    *    *

ప్రొద్దువాటాలే వేళకి రఘునందనరెడ్డి చెల్లెలి మగనితోసహా వచ్చి జరిగిపోయిన దురంతానికి విచారం తెలిపేడు. వందలూ, వేలసంఖ్యలో తీర్థప్రజలా పోగుపడ్డ జనంమధ్యకు వెళ్ళలేక అంతదూరాన వీధి మొగలో తిన్నెమీద నిలబడ్డాడు. పెద్దరెడ్డి కొడుకుకు అభివాదం చేయవచ్చిన కొందరు పెద్దవాళ్లు సమీపించి మాట్లాడగల ధైర్యంలేక అంతదూరంలోనే నిలబడిపోయేరు.

నిశ్శబ్దంగా ఒకరి మొగా లొకరు చూసుకుంటూ నిలబడి వుండడం ఏలాగో అనిపించింది. అయినా తన అంతస్థుకి తక్కువయిన వాళ్ళని ఎల్లా పలకరించాలో చేతగాక రఘునందనుడు తికమక పడ్డాడు. దగ్గరికి రమ్మనడానికి మనస్సు వొప్పడంలేదు. తనకంటె పెద్దవయస్సువాళ్లు తన కంత దూరంనుంచే భయప్రపత్తులతో పరిశీలనగా చూస్తూ చేతులు కట్టుకొని నిలబడ్డం ఎల్లాగో అనిపిస్తూంది. మాట్లాడ్డానికేనా ప్రక్కన మనిషిలేడు. కూడావచ్చిన బావమరిది జనంమధ్య ఎవరితోనో మాట్లాడుతున్నాడు. ఆ మనిషిని ఎక్కడో చూసినట్లనిపించింది. కాని గుర్తురాలేదు.

జనం శవాన్ని కదిలించే ప్రయత్నాలు చేస్తూంటే వుండబట్టలేక దూరాన కనిపించిన రంగయ్యకు కబురంపేడు. పొలం విషయంలో జరిగిన గ్రంథాన్ని జ్ఞాపకం చేసుకొని రంగయ్య మొదట జంకేడు. కాని తప్పలేదు.

రఘునందనుడు ఆ విషయమే ఎత్తలేదు. గతంలో పరిచయం లేనందుకు సంకోచం ప్రకటించాడు. శవాన్ని పోలీసులు వచ్చేవరకూ కదల్చకుండా వుంచకపోతే వచ్చే ఇబ్బందుల్ని జ్ఞాపకం చేసేడు. అందులోనూ తగుల బెట్టేస్తే మరేమన్నావుందా ?

రంగయ్య బొడు కరిచేడు. అనుమతి లేకుండా వూరేగింపు జరపడం తప్పనేంతవరకే తనకు తోచింది. ఇప్పుడు రఘునందనుడు జ్ఞాపకం

చేసినది అంతకన్న ప్రమాదకరమయిన తప్పిదం. హత్యతో సంబంధించిన వ్యవహారం ఆయె.

కాని, ఈ అభ్యంతరాన్నికూడా జనం ఖాతరు చేయలేదు. పోలీసు అమీను ధోరణి విని వాళ్ళంతా మహా ఆవేశపడుతున్నారు. జనంమధ్య తానెన్నడూ చూసివుండని కొత్తమొగం కనబడింది. వేలుపెట్టి లెక్కపెట్టగల ప్రత్యేకత ఆ మనిషిలో కనబడకపోయినా, చుట్టూచేరిన గ్రామ యువకుల సంఖ్యే ఆతనిని రంగయ్యకు చూపింది. తన అక్కగారుకూడా ఆయనతో మహాపరిచయం వున్నట్లు ఏమిటో మాట్లాడుతూంది. అసలు సంరంభం అంతా ఆక్కడే వున్నట్లు తోచింది. రంగయ్య ఆయన దగ్గిరికెళ్ళేడు. ఎందుకు చెప్తూన్నాడో ఎరక్కుండానే వూరేగింపును అపడంలో తోడ్పాటు కోరాడు. అంతా చెప్పాక గుర్తువచ్చింది. ఆయన పేరుకూడా తెలియదు. అడిగేడు.

"తమ పేరు...."

ఆ యువకుడు సగౌరవంగా అభివాదన చేసేడు.

"సత్తిరెడ్డి...."

మనిషిలాగే పేరుకూడా సర్వసాధారణమైనదే. ఆ పేరు కొందరికి భయోద్రేకాలు కలిగించి వుండేదేమో. కాని రంగయ్యకు ఆ పరిచయం లేదు. రజాకార్లుచేస్తున్న ఇల్లాంటి దురంతాలను ప్రభుత్వంద్వారానే ఆపించాలిగాని ప్రజలు చెయ్యిచేసుకోడం మంచిది కాదన్నాడు. నిజామే దీనిని ప్రోత్సహిస్తున్నాడనేవాదం వస్తుందనే ఆలోచనతోనో యేమో నిజాం ఈ మధ్యనే చేసిన ఫర్మానామాట జ్ఞాపకం చేసేడు. దౌర్జన్యకారుల్ని అణిచేస్తామన్న ఆ ప్రకటనమీద హైద్రాబాద్‌లో తనకు కలిగిన అనుభవం విశ్వాసాన్ని కలిగించకపోయినా ప్రస్తుతం జనాన్ని వెనక్కి లాగిపట్టేటందుకు దానిని ఉదాహరించక తప్పిందికాదు. ఆ వూరేగింపు సాకుచూపి, పోలీసులు మళ్ళీ దాడులు చేస్తే?

సత్తిరెడ్డి ఎంతో శాంతంగా, తాను చెప్పింది ఓ వాదనే కానట్లు నిర్లక్ష్యంగా సమాధానం ఇస్తూంటే రంగయ్యకు ఏమనడానికీ తోచలేదు. పోలీసులు దాడిచేయడానికి ఓసాకుకూడా కావాలా? సాకు దొరక్కుండానే చేసుకోవాలనే తాపత్రయానికి బదులు చీటికి మాటికి మీదపడే దురలవాటు మానిపించాలన్నాడు. • వాళ్ళకి ఏదయినా సాకే. షావుకారు రంగయ్య పిండిప్రోలు దేశముఖ తనకు బాకీవున్న జొన్నలు ఇవ్వాలనడిగినందుకు ఆయనమీద కేసులు పెట్టించేడు. ఆ మనిషి దొరకలేదని ఆయన భార్యని నానాబాధలు పెట్టేరు. జొన్నలు ఇవ్వాలనడమే ఓసాకు అయితే మరి కాని దేమిటి?

నల్లగొండజిల్లాలో నిరుడు 25 మందిని చంపేసేరు. పదహారు వేలమందిని కొట్టేరు. పదిహేనులక్షల రూపాయల ఆస్తి నాశనం చేసేరు. నూరుమందివరకూ పడుచుల్ని చెరిచేరు. వీ టన్నింటికీ సాకులేవున్నాయా?

అంతవరకూ ఎందుకు? ఈ ముసిలివాణ్ణి చంపడానికి వాళ్ళు చూపించిన సాకు ఏమిటి?

రంగయ్య అన్నీ విన్నాడు. పరిస్థితులు ఇల్లావున్నాయి గనకనే తొందర పడకూడదని నీతి చెప్పేడు.

కాని సత్తిరెడ్డి చెప్పింది దానికి ప్రత్యక్ష విరుద్ధం.

ప్రతిపేటలోనూ వలంటీరు దళాల్ని కూర్చుకొని దౌర్జన్యం చేస్తున్న వారిని కాస్త అదుపులో పెట్టాలన్నాడు. ప్రజల పోరాటాలనుండి నేర్చుకో వలసిన పాఠాలలో అదొకటి. ఒకటికాదు. అతిముఖ్యమైనపని ఆయన అభిప్రాయం.

నిజాం నవాబు ప్రభుత్వం మధ్యయుగాలనాటి అనాగరిక ప్రభుత్వం అన్నాడు. దానిని ఇల్లాగే సాగనిస్తే అసలు మనుష్యజాతి అభివృద్ధినే అవమాన పరచడం....

ఆ మాటలకి ప్రజలు హర్షం వెలిబుచ్చుతున్నారు. ఏడాది క్రితం పోలీసులూ, మిలిటరీవచ్చి మడతకొట్టుగు సాగించినా గుర్తు లేవన్నమాట. పైగా ఎవరో తన్ను అవహేళన చేయడానికా అన్నట్లు రాజకీయ నినాదం ఒకటిచ్చేరు.

"నిజాము భారత యూనియన్‌లో చేరాలి."

నిజానికి ఆ నినాదం తనకూ అంగీకారమే. కాని, ఆ ఇచ్చిన మనిషీ, సమయమూ చూస్తే తనను హేళన చెయ్యడానికే వుద్దేశించినట్లనిపించింది.

ఆ నినాదం ఇచ్చింది నరిసిరెడ్డి కొడుకు భాగ్యరెడ్డి. అతనికి యూనియనేమిటో, దానిలో నిజాము చేరడం ఏమిటో తెలియదు. పది రోజులక్రితం బొగ్గులబండి తోలుకొని హైద్రాబాద్ వెళ్ళేడు. పట్నంలో ముసల్మానులంతా హడావిడి చేస్తున్నారు. ఆత దదేమిటని వాకబుచేసేడు. నిజాం మంత్రులు అయిదుగురు ఢిల్లీలో సర్కారుతో మాట్లాడ్డానికి వెళ్ళేరట. కాంగ్రెసువాళ్లు నిజాము యూనియన్‌లో చేరిపోవాలన్నారట. వెళ్ళినవాళ్ళల్లో ఇద్దరు పనికిరా దన్నారుట. ముగ్గురేదో షరతులు పెట్టేరుట. * ఇత్తెహాదుల్ ముస్లిమీన్ చేరవద్దని చెప్తూంది. వాళ్ళ నాయకుడు కాశిం రజ్వీ రంకెలేస్తూ ఏదో కరపత్రం వేసేడు. భాగ్యరెడ్డి ఓ కరపత్రం సంపాదించి, మడతపెట్టి బొడ్డులో దోపుకొని పదేపదార్థంగా తీసుకొచ్చేడు. యూనియ నన్నది కొత్తమతం ఏమన్నా కాదుగదా యని తన్ను ప్రశ్నించేడు.

---

* 1947 జూలై 25 న ఢిల్లీలో సంస్థానాధీశులసభ జరిగింది. దానికి నిజాము తరఫున ఛత్తారీ నవాబు, అలీయార్ జంగ్, పింగళి వెంకట్రామారెడ్డి, మాంక్టన్, అబ్దుల్ రహీమ్‌లు హాజరయ్యేరు. కొన్ని షరతులతో నిజాము యూనియనులో చేరడానికి ఛత్తారీ నవాబూ, మాంక్టనూ, అలీయార్‌జంగూ సమ్మతించారనీ, మిగతాయిద్దరూ వ్యతిరేకించారనీ ఆ రోజులలో పత్రికలలో వార్తలు వచ్చేయి.

తాను ఎంతో ఓపికతో రాజకీయ విషయాలు చెప్పేడు. ఆ భాగ్య రెడ్డి ఆనాడు తాను చెప్పినవన్నీ తనమీదికే తిప్పికొడుతున్న ట్లనిపించింది.

ఛత్తారీ నవాబు యూనియన్‌లో నిజాము చేరవచ్చునన్నాడు. ఆయన్ని చంపుతామని ఈ ఇత్తెహాదుల్ ముస్లిమీన్ గంతువేసింది. వాళ్ళే నేడు ఈ ముసిలాడిని చంపేసేరు. అటువంటి దుర్మార్గులు యూనియన్‌లో చేరవద్దంటున్నారంటే అదేదో మంచిదై వుండాలి. భాగ్యరెడ్డి ఆ ఆలోచన తోనే ఆ నినాదం ఇచ్చేడు.

జనానికి ఆ మాత్రమూ తెలియదు. యూనియన్ అనేమాటను వాళ్ళెన్నడూ వినలేదు. కోటమ్మ అడిగింది.

యూనియనంటే 'బ్రిటిష్' అని భాగ్యరెడ్డి ఒక్క కేక పెట్టేడు. తెలంగాణాను ఆనుకొనివున్న కృష్ణా, గుంటూరు, గోదావరి జిల్లాలు బ్రిటిష్ ప్రాంతాలు. నందిగామ, బెజవాడ, పల్నాడు మొదలయినవన్నీ బ్రిటీష్ ప్రాంతాలు. అక్కడ తమర్ని పీడించే వెట్టీ, ఈ దురన్యాయాలూ ఇంతగాలేవని చెప్పుకొంటారు. నిత్య జీవితంలో ఎన్నోమాట్లు 'బ్రిటీష్' లోకిపోయి బ్రతుకుదామని కలలు కన్నవాళ్ళే. అందుచేత యూనియన్ అంటే బ్రిటిష్ ప్రాంతాలే అనే వ్యాఖ్యానం వినబడగానే వాళ్ళ వుత్సాహం వురకలేసింది. కొత్తగా వున్నమాటనువదలి పాతమాటనే వుపయోగించేరు.

"బ్రిటిష్‌లో చేరిపోవాలి."

బ్రిటిష్‌వాళ్ళు పోతాం మొర్రో అంటూంటే, వీళ్ల వాళ్ళతో చేరిపోతా మంటూ నినాదం ఇవ్వడం రంగయ్యకు వెగటు అనిపించింది. మాట్లాడ కుండా వెనుతిరిగేడు. ఇంటికి వెళ్ళేవరకూ తరుముకొస్తున్నట్లు నినాదాలు వినిపిస్తూనే వున్నాయి.

కొంతసేపు జనం బ్రిటీష్‌లో చేరిపోవాలని గంతులేసేరు. పోలీస్ అమీన్ కొట్టిన దెబ్బలు చిమచిమ లాడుతూంటే ఆత దన్నమాటలు గుర్తు

చేసుకొని ప్రొద్దుటి వార్తాహరుడు 'సంగం జిందాబాద్' అన్నాడు. ఈ మాట అంతా అందుకున్నారు. సంగం అందరికీ తెలిసినది.

'సంగం జిందాబాద్'

'బ్రిటిష్‌లో కలవాలి.—నినాదాలమధ్య శవం లేచింది. కొండరాళ్ళ మధ్య పెద్ద హోరుతో పరవళ్ళు తొక్కుతూ ఉరకలువేసే వాగులాగ ఇరుకు వీధులలో జనప్రవాహం కదిలింది.

వూరేగింపు సిలార్ ఇంటివద్దకు వచ్చేసరికి ముంతాజ్ రెండు చేతులతో ఇన్నిపూలు శవంమీద చల్లింది.

వీధిలో దారికడ్డంగా ప్రవహిస్తున్న మురుగుజాలు మీదుగా వురకలు వేస్తూ జనం కదిలింది.

నినాదాలు పిక్కటిల్లేయి. ముసలి ముష్టివాని దుర్మరణానికి విచారపడుతూ వీధిలోకి వచ్చిన సిలారు చెవులు మూసుకొని యింట్లో దూరేడు.

జనం గర్జించింది.

"నిజాం సర్కార్.... ముర్దాబాద్...."

---

## ఎనిమిదో ప్రకరణం

తెల్లవారేసరికి పదిమంది పోలీసులతో అమీన్ వెంటరాగా సర్కిలిన స్పెక్టరు రమణారెడ్డి వూళ్ళోకి రానూవచ్చేడు. వాళ్ళవుద్దేశం తెలిసి జనం సర్దుకొనేలోపున పదిమందిని అరెస్టూచేసేడు. ఎందుకు అరెస్టు చేసేడో అర్థం అయ్యేలోపున వాళ్ళ కమ్ములు కట్టేలాగ కొట్టనూకొట్టేడు. అందరినీ లాక్కుపోయి గదీలో పెట్టేడు. కచేరి సావట్లోని కటకటాలగదిలో పడేసేడు. అప్పుడు విచారణకు పూనుకొన్నాడు.

రమణారెడ్డికి ముసిలివాడిని ఎవరు చంపేరో తెలుసుకోవడం ముఖ్యంకాదు. శవాన్ని ఏంచేసేరని అడగలేదు. పోలీసులు వచ్చేదాకా వుంచక ఎందుకు కదిపేరని ప్రశ్నించలేదు. అసలు వెనకటిరోజున రజాకార్లు వూళ్ళోకి వచ్చేరనీ, వచ్చి ఓ అమాయకుణ్ణి చంపేరనీ ఆయనకు తెలుసునో, తెలియదోకూడా అర్థంకాలేదు. ఆయన ప్రశ్నలన్నీ సత్తిరెడ్డి అనేవానికోసం. అత డెక్కడున్నాడు ? ఎక్కడనుంచి వచ్చేడు ? ఎక్కడి కెళ్ళేడు ? ఎప్పు డొచ్చేడు ? ఎప్పు డెళ్ళేడు ? ఎవరితో మాట్లాడేడు ? ఏం మాట్లాడేడు ? ఇదీ ధోరణి. ఆప్రశ్నలకోఅంతులేదు, ఆపులేదు.

ఎంతకొట్టినా ఎవ్వరూ ఏమీ చెప్పలేదు. చాలమందికి సత్తిరెడ్డి ఎవరో తెలియదు. అంతా ఆమనిషిని చూసేరుగాని ఆయన్నిగురించి ఎరగరు. తమకు తెలిసిందికాస్తా చెప్పినా రమణారెడ్డి వూరుకోడు. కనక వాళ్లు చూసేమని చెప్పడానికికూడా సిద్ధపడలేదు. ఆయన్ని ఎరిగిన వాడల్లా వెంకటయ్య ఒక్కడే. ఏమీ ఎరగనని తప్ప అతనినోట మారుమాట రాలేదు.

రమణారెడ్డి అన్నీ తెలుసుకొనే వచ్చినట్లు తోచింది. ఊరేగింపులో ఆ వీధిలో వాళ్ళ యింటివద్ద మంచినీళ్ళిప్పించలేదా. వీళ్ళ యింటివద్ద మాట్లాడేవు కాదా యని అట్టిపుట్టి ఆనవాళ్ళతో అడుగుతున్నాడు. కూపీ యిచ్చినవా డెవడో వివరంగానే యిచ్చేడు. రమణారెడ్డి ప్రశ్నలకి వెంకటయ్య ఆశ్చర్యపడ్డాడు. తన కంటితో చూసినట్లే అడుగుతూంటే ఆశ్చర్యం గాకేముంది? కాని, ఆ భావాన్ని పైకి కనబడనివ్వలేను. ప్రారంభించి నప్పటిలాగే చివరకంటా ఒక్కటేమాట. "ఏమీ తెలియదు .... " ప్రశ్నలు వెయ్యలేక ప్రాణం చాలొచ్చి రమణారెడ్డి వెంకటయ్యని వేరే గదిలో పడేయించేడు.

వెంకటయ్యని వేరేగదిలో పడేసేరనీ, క్రూరంగా కొడుతున్నారనీ వార్త తెలిసి సత్తెమ్మ మ్రాన్పడిపోయింది. చేతిలో పని పారేసింది. కోటమ్మని సాయం పిలిచింది. ఇద్దరూ గఢీకి బయలుదేరేరు.

వెళ్ళి తాను ఏంచేయ దలచిందో సత్తెమ్మ ఆలోచించనేలేదు. వెంకటయ్యని కాపాడాలి. అంతేవృష్టి.

బయలుదేరుతూ కోటమ్మని పిలిచింది. కోటమ్మ, వెంకమ్మ, మంగమ్మ, లక్ష్మి వగైరాలను పేరుపేరున పిలుస్తునే చంటిబిడ్డను చంకనేసుకొంది. 'ఎక్కడికి పోతున్నావే నీ తాడుతెగా' యని ఆశీర్వదిస్తున్న భర్తవేపు ధూత్కారంగా చూస్తూ గబగబా అడుగువేసింది. మనవాళ్ళని ఎందుకు పట్టుకొన్నారో, ఎందుకొట్టుతున్నారో కనుక్కుందాం రమ్మని రంకెవేస్తుంటే ఆ యమ్మా, ఈ యమ్మా ఓ పదిమంది కదిలేరు.

వీళ్ళు వెళ్ళేసరికి గఢీ గుమ్మంలో చాలమంది చేరి వున్నారు. అంతా ముసిలీ, ముతకా, పిల్లా, మేకాను. తమ కొడుకునో, అల్లుణ్ణో, తమ్ముణ్ణో తండ్రినో కొట్టవద్దని వేడుకోడానికీ, వాళ్ళు ఏమీ ఎరగరని చెప్పుకోడానికి చేరేరు అంతా. లోపలనుంచి వినిపిస్తున్న గద్దింపులూ, మొర్రో మొర్రో మన్న యేడ్పులూ వింటూ నీరసంగా, నీరవంగా గోడలకి జేరబడిపోయి

షన్నారు. మధ్య మధ్య ఒకడు లేస్తాడు. ఏదో గుర్తువచ్చినట్లు సర్కిల్ దగ్గిరికో, అమీన్‌వద్దకో తూలితూలిపోతూ బయలుదేరుతాడు. అతని వెన క్కాల మిగిలినవాళ్లుకూడా లేస్తారు. కదులుతారు. ఎవరికివారికే అధికారితో మాట్లాడ్డానికి భయం. కాని. ఎవరో ఒకరు సాహసంచేస్తే పనిలోపని తానూ ఓమాట అనడానికీ. తనవాడుకూడా ఒక దక్క డున్నాడని గుర్తు చేయడానికీ. మిగిలినవాళ్లు లేస్తారు.

వెళ్ళి ప్రాధేయపడుతున్నారు. అపరాధం చెప్పుకొంటున్నారు. కాల్మొక్కుతామని నోటితో అనడమేగాక క్రియారూపంలోకూడా కాళ్ళ ముందు సాగిలపడుతున్నారు. "బాంచల" మంటున్నారు. ఆ వుద్యోగి గదు ముతే నిరాశతో మళ్ళీవచ్చి ఆవీధిగోడల్నే. ఆచెట్లనే ఆశ్రయిస్తున్నారు.

గఢీ గుమ్మంలోకి వచ్చేసరికి అక్కడ చుట్టకాలుస్తూ కూర్చున్న ఒకడు కోటమ్మను పలుకరించేడు.

"కారపుముంత తెచ్చేవా?"

కోటమ్మ వులికిపడింది. సత్తెమ్మ తిరిగిచూసింది. ఆ పలకరింపు ఎవరినో ఇద్దరికీ అర్థంకాలేదు. ఆ కూర్చున్నవాడుకూడా వాళ్ళని ఆ సందిగ్ధ స్థితిలో అట్టేసేపు వుంచలేదు. తన పలకరింపు వుద్దేశాన్ని పక్కవాడికి వివరించేడు. ఇద్దరూ నవ్వుకొన్నారు.

"ఈవిడ బండమీద ఆడాళ్ళని కూర్చోబెట్టుకుని కళ్ళల్లో కారం గుండ ఎల్లాకొట్టాలో నేర్పుతూంది."

"మొగుడి కళ్ళలోనా?"

ఇద్దరూ విరగబడి నవ్వేరు. మొదటివాడు లేచి నిలబడ్డాడు. ఆరోజున ఆమె బండమీద చేసిన అభినయమూ, గంతులూ మిత్రునిముందర ప్రదర్శిస్తూంటే నవ్వలేక డొక్కలుపట్టుకు దొర్లిపోయేరు.

కోటమ్మ పదడుగులువేసి సత్తెమ్మచెవిలో వూదింది.

"వీడో ఖుఫియా. ఆరోజున బండమీద నేను అన్న మాటలన్నీ విన్నాడన్నమాట. లంజ...."

సత్తెమ్మ వాడి ఆకారాన్ని గుర్తుపెట్టుకోడానికై వెనక తిరిగింది. కోటమ్మ ఆమెచేయి పట్టుకు గుంజింది.

గఢీ గుమ్మంలోకి వెళ్ళేకగాని సత్తెమ్మ తాను చెయ్యవలసింది ఏమిటని ఆలోచించలేదు. తాను ఎందుకొచ్చింది? వెంకటయ్యను విడుదల చేయమని ఎవర్ని అడుగుతుంది? వెంకటయ్య నీకు ఏమవుతాడంటే ఏం చెప్తుంది? ఈమధ్య జరిగిన గందరగోళాల అనంతరం తాను వచ్చిన పని చెప్తే నలుగురూ నవ్వరా?

ఈ నగుబాటునుంచి బయట పడడానికి ఆమెకోమార్గం తోచింది. సుమిత్రతో తనకు స్నేహంవుంది. ఆమెతో చెప్పొచ్చు. చెల్లెలిమాట రమణారెడ్డి కాదనగలడా? జైలులో పెడితేపెట్టేరు. కొట్టకపోతేసరి. ఆమాత్రం సాయం సుమిత్ర చేయలేదా? సత్తెమ్మ పక్కగుమ్మాన చటుక్కున లోనికి చొరబడింది.

లో గుమ్మంలో కిష్టయ్య ఎదురయ్యేడు.

సత్తెమ్మను చూడగనే బోళ్ళపాలంకథ గుర్తువచ్చింది. కసి తీర్చుకొనేటందుకు సమయం వచ్చిందనుకొన్నాడు. దారికడ్డంగా నిలబడ్డాడు.

"ఎక్కడికి?"

సత్తెమ్మ వినిపించుకోలేదు. వినిపించుకొనేటట్లూలేదు. పక్కకు తప్పించుకొని చరున లోపలికెళ్ళింది. ఆమె వెనకనే వస్తున్న కోటమ్మను ఆపుచేసే హడావిడిలో కిష్టయ్య సత్తెమ్మమాట మరిచిపోయేడు.

వెంకటయ్యగురించి ఏమీ చెప్పకపూర్వమే సుమిత్ర ఆమె రాక లోని వుద్దేశాన్ని అర్థంచేసుకొంది. ఆరెస్టులూ, కొట్టుళ్ళూ గురించి వాళ్ళూ వింటున్నారు. ఇల్లు బాగా లోపలగావున్నా దెబ్బలుతింటున్నవాళ్ల పెడు

తున్నగోల. కేకలు లోనికి వినిపిస్తూనే వున్నాయి. కాని, ఎవ్వరూ ఏమీ చెయ్యగలదిలేదు. బహుశా అలా దెబ్బలుకొట్టడం కొత్తగా తోచనేలేదో యేమో. వాళ్ళెన్నడూ ఇట్లాంటి ఘటనల్లో ఇదేమని అడగడంవుండదు. అడిగినా విషయం తెలుసుకొనేటంతవరకే. అంతకుమించి కలగచేసు కొంటే వినేవాళ్ళెవరు?

సత్తెమ్మ ఆక్రోశానికి సుమిత్ర చెప్పగల వోదార్పుమాట ఒక్కటీ లేకపోయింది. అప్పుడే ఆవేపువచ్చిన శివరామిరెడ్డి ప్రశ్నించేడు.

“ఎవరా సత్తిరెడ్డి ?”

“అదేమో చిన్నబాబు చెప్పాలి.”

సత్తిరెడ్డి రఘునందనుణ్ణిచూసి తన కాలేజీ సహాధ్యాయి యని గుర్తించేడు. ఆతనితో మాట్లాడేడుకూడా. ఆ అవకాశాన్ని సత్తెమ్మ వుపయోగించు కొంది.

సత్తిరెడ్డి తన తమ్ముడితో మాట్లాడిన విషయం రమణారెడ్డికి తెలుసు. కాని, ఆమాట నాతడు పైకి రానివ్వలేదు. ఆతనికి కావలసింది సత్తిరెడ్డి ఎవరనికాదు, ఆ విషయం తన తమ్మునికంటె తనకే బాగా తెలుసు. కావలసిందల్లా అత డెక్కడున్నాడనేది. దానికై అతడి నడిగి ప్రయోజనంలేదు. అందుకే ఆరోజున సత్తిరెడ్డి తన తమ్ముడితోకూడ మాట్లాడేడని తెలిసినా రమణారెడ్డి పట్టించుకోలేదు. ఆవిషయం శివరామిరెడ్డికి తెలియదు. ఆశ్చర్యం ప్రకటించేడు.

ఆక్కడేవున్న రఘునందనుడు ఆమాటను ఒప్పుకొన్నాడు.

“కాలేజీలో నా సహాధ్యాయి. నిన్న కనిపించడమే. మళ్ళీ ఈమధ్య చూడలేదు.”

తనకు దొరికిన అవకాశాన్ని సత్తెమ్మ చివరికంటా వినియోగించు కొంది. సత్తిరెడ్డి చదువుకొన్నవాడు. పెద్దయింటివాళ్ళతో పరిచయా

ఉన్నవాడూను. ఆతడెవరనీ, ఎక్కడున్నాడనీ పాలేరుతనం చేసుకు బ్రతికే వాళ్ళని అడుగుతే వాళ్ళేంచెప్తారు?"

పైకి చాల బలమయిన ప్రశ్నే. సబబుగానే కనిపిస్తూంది. కాని శివరామిరెడ్డికి నమ్మకం కలగలేదు.

"నీకు, తెలియకపోవచ్చు. కాని వెంకటయ్యకి .... "

ఆ ప్రశ్నకు సత్తెమ్మవద్ద సమాధానంలేదు. రాజిరెడ్డి ఆమెకు సాయం వచ్చేడు. సత్తిరెడ్డికోసం విచారణ జరుగుతూందని ఆతని కింత వరకు తెలియదు. తెలిసివుంటే ఇంతక్రితమే ....

ఏమిచేసి వుండేవాడో మాట పూర్తిచేయకుండానే రాజిరెడ్డి కచేరీ సావడి వైపుగా చరచరా నడిచేడు.

ఆతడు వెళ్ళేసరికి ఆడవాళ్ళూ, ముసిలివాళ్ళూ అంతా గడీ గుమ్మంలో చేరేరు. తమవాళ్ళందర్నీ విడుదల చేయమంటున్నారు. గొల్లున గోల పెడుతున్నారు. రమణారెడ్డి కోపంతో గంతులేస్తున్నాడు.

ఆతని విచారణ ఇప్పుడు సత్తిరెడ్డిని గురించికాదు. ఆత డెక్కడున్నాడనీకాదు. యూనియన్‌లో చేరాలన్నవా శ్లెవరు? నిజాం సర్కారు కన్న యూనియన్‌లో ఏం వొరుగుతుందని? ....

అల్లాంటి ద్రోహం తలపెట్టినవాళ్ళ చర్మం వొలిపించేస్తాడు. కాంగ్రెసు ఏమన్నా అడ్డుకుంటుందా? సంగం సాయం వస్తుందా?

అది జరిగేపనికాదు. సంస్థానాల వ్యవహారాలల్లో మేమేమీ కలగ చేసుకోమని పటేలు అన్నాడు. గవర్నర్ జనరల్ మౌంట్‌బాటెన్ హామీ వుంది. ఈముండలేం చేస్తారు? ....

నవాబు పాలనలో ఇంత తిండేనా తింటున్నారు. యూనియన్‌లో చేరితే ఇంక మనుష్యులుకూడా మిగలరు....

నిముషానికోఫక్కీ బుజ్జగింపు. బెదరింపు. రంకెలు. అనునయం. ఆశలుచూపడం. శిక్షాదండం ఝళిపించడం....రమణారెడ్డి ఏకపాత్రాభినయం నడుపుతున్నాడు.

అక్కడున్న జనంలో ఆమాటలఅర్థం, రాజకీయ పరిణామాల రహస్యమూ తెలిసిం దెందరికి ? అతని మాటల్లో వాళ్ళకి తెలిసిందల్లా శిక్షా భాగం మాత్రమే.

రమణారెడ్డి చీరుతాను, చంపుతాను అంటూంటే తమ బంధువుల విడుదలకోసం వచ్చినజనం వడవడ వణికిపోయేరు. బాంచలమంటూ తమ అల్పత్వం ప్రకటించి ఆశిక్షాస్మృతిబారి పడకుండా తప్పించుకు పోవాలని మహా శ్రమపడుతున్నారు.

ఆ దృశ్యం చూసేసరికి రాజిరెడ్డికి చాలవెగటు కలిగించింది. పెద్ద బావమీద అతని కెప్పుడూ సదభిప్రాయంలేదు. రెండోవైపునా అంతే. రమణారెడ్డి పెద్దకుటుంబాల ఆధిక్యతా ప్రాముఖ్యతా రక్షింపబడాలనే ధోరణి గలవాడు. కాని దానిని కాపాడుకొనేశక్తిలేని దుర్బలుడు. ఆ దౌర్బల్యమే అతని సంసారంలో చిచ్చుపెట్టింది. భార్యా భర్తలమధ్య మహాద్వేషాన్ని కల్పించింది. అయినా దానిని గుర్తించగలనేర్పూ, ఓర్పూకూడ ఆతనిలో లేదు. ఆతని దృష్టిలో చెల్లెలిమగడు ఓ అభాజనుడు. మనుష్యుల్లో ఎక్కువ తక్కువలు లేవనీ, జాగీర్దారీ, జమీందారీ పద్ధతులు సంఘాన్ని అగాధంలోకి ఈడుస్తున్నాయనీ చెప్పే పరమ కమ్యూనిష్టు. మర్యాద నిలుపుకోవాలనే వాంఛకూడాలేని శుద్ధ అవివేకి.

అనేక సమస్యలమీద బావా, బావమరదు లిద్దరూ అనేకమార్లు చర్చలు జరిపి ఇద్దరూ ఒకే నిర్ణయానికివచ్చేరు. ఇంక మాటలనవసరం అని ఒక్కమారే అనుకున్నారు.

అటువంటి మరిది ఈ సమయంలో రావడమూ, వచ్చినవాడు నోరు మూసుకుకూర్చోక సత్తిరెడ్డిసంగతి వాళ్ళకేంతెలుసు నన్నడగ మనడముతో రమణారెడ్డి అగ్గిపుంత అయిపోయేడు. చిరాకుపడ్డాడు. అరక్షణంలో ఉభయులూ ఘుంయేమన్నారు. ప్రజలు విస్తుబోయి చూస్తున్నారు.

రాజిరెడ్డి చిరాకు ప్రజలమీదికి తిరిగింది.

"ఇంతమంది వున్నారు. మీవాళ్ళని లాక్కుపోలేరూ, మీకు అడ్డం ఎవరు రాగలరు ?"

ఓ ముసిలివాడు రాజిరెడ్డి ప్రతిపాదనను ఖచ్చితంగా నిరాకరించేడు.

"బాంచెలం అంతపనా ?"

వాళ్ళ మెత్తదనంచూసే ఇంతింత దారుణవ్పనులు చేయగలుగుతున్నారని రాజిరెడ్డి అభిప్రాయం. కాకపోతే వూళ్ళో వాళ్ళమీద ఈదాడి ఎందుకు ? రజాకార్లువచ్చి ఒ ముసిలాణ్ణి చంపడంఏమిటి ? ఆ సత్తిరెడ్డి ఎవరు, ఈ ముత్తిరెడ్డి ఎక్కడికెళ్ళేడని ప్రశ్నలేమిటి ? ఎవరు చంపేరని ఏమన్నా అడిగేరా ? ఒక్క రౌడీని అరెస్టుచేసేరా ?...జనం నోరుమూసుకూర్చుంటే ఇల్లా దబాయిస్తారు.

బావమరది మాటలు వింటున్న రమణారెడ్డి కోపం పట్టలేకపోయేడు. ఆతనిమీద ఇంతకాలంగా పేరుకొనివున్న అసహ్యం కట్టలుతెగింది. దానికి తోడు తన వుద్యోగంలో అలవడే చురుకుదనం ఒకటి. రెండూ కలిసేయి. ప్రక్కనున్న టేబిలుమీద పడివున్న హోల్డరు నందుకొన్నాడు. అలవాటుపడ్డ చురుకుదనంతో అరక్షణంలో రివాల్వరు చేతికివచ్చింది. మరుక్షణంలో రివాల్వరు రాజిరెడ్డివేపు తిరిగింది.

అంతవరకూ తాంబేలునడకగా సాగుతున్న ఘటనలు విద్యుద్వేగాన్ని అందుకొన్నాయి.

రాజిరెడ్డి వెనకనే ఇంట్లోవాళ్ళంతా కచేరీ చావడివేపు వచ్చేరు. ఎవరూ ఏమనడానికీ. ఏమి చెయ్యడానికీ కూడా వ్యవధి లేకుండానే బావ. బావమరదులమధ్య ఘర్షణ పెరిగిపోయింది. రమణారెడ్డి హోల్డరు నందుకొంటుండగనే సుమిత్ర ప్రమాదాన్ని పసికట్టింది. అన్నగారి స్వభావం ఎరిగి వుండడంచేత భర్తకు కలగనున్న అపాయాన్ని గ్రహించడం కష్టమేం కాదు. మగణ్ణి కాపాడుకోవాలంటే వెంటనే కదలాలి. ఒక్క అంగలో

సావిడిమీద కొచ్చింది. క్రింద దొర్లుతున్న రూళ్ళకర్ర తీసుకొంది. ఆమె వుద్దేశాన్ని అన్నగారు గ్రహించేలోపున రివాల్వరు పట్టుకొన్న చేతిమీద ఒక్కదెబ్బ కొట్టింది.

రివాల్వరు ఎగిరి అంతదూరాన పడింది. పడిన అదురుకి పేలింది. పేలుడుచప్పుడు వినగానే గుమ్మంలోని జనాన్ని తోసుకుంటూ, తొక్కుకుంటూ పోలీసులు పారిపోయేరు.

ఆధ్వని విని రాజిరెడ్డి వెనక్కి తిరిగేసరికి రమణారెడ్డి చెల్లెలిగొంతు నులుముతున్నాడు. ఒక్కక్షణంక్రితం తన తలమీదుగా పోయిన మృత్యుచ్ఛాయల నాతడు ఎరగనే ఎరగడు. కాని తనభార్య యిప్పుడు మృత్యుచ్ఛాయలో వున్నదని గ్రహించేడు.

తడుముకోకుండా, ఎక్కడ తగిలేదీ ఆలోచించకుండా ఊతం తీసుకొని ఒక్కతన్ను తన్నేడు.

దూదిమూటమీద తన్నినట్లు మెత్తని చప్పుడు, ఆ అదురుకి ఊపిరి పట్టిపోయి గతుక్కుమన్నధ్వని, ఆయువుపట్టులో తగిలిన తన్నుకి రమణారెడ్డి చెల్లెలుగొంతు వదిలి తన డొక్కలు పట్టుకొన్నాడు. మరుక్షణంలో నేలని దొర్లాడేడు.

* * * *

సుమిత్ర వెనువెనుకనేవున్న సత్తెమ్మ సమయం కనిపెట్టింది. వంట చెరుకు నరకడానికై తెచ్చి గోడకు జేరవేసిన గొడ్డలి చటుక్కున అందుకొంది. వెంకటయ్యను వుంచిన గది తాళంచెవులు ఎవరివద్ద వున్నాయంటే చెప్పేవారెవరు, ఇచ్చేవారెవరు, చేతిలోవున్న గొడ్డలితో ద్వారబంధం పేళ్లు రెండూడగొట్టింది. పరిస్థితులన్నీ చూస్తూ ఏమీ చెయ్యలేక గదిలో కుంటుకుంటూ అలంగం తొక్కుతున్న వెంకటయ్య తలుపులు విడిపోగానే వొక్క వురుకులో బయటికి వొచ్చేడు. వస్తూనే ఉచ్చులనుంచి బయటపడ్డ పెద్దపులిలా బొబ్బరించేడు.

"ఇంకా చూస్తారేం?"

అతడు పెట్టిన కేకతో జనం నిస్తబ్ధత వొదిలి బయటపడ్డారు. రాజిరెడ్డి వుపన్యాసం కదలించలేకపోయినా ఒక్క కేకతో తిరగబడి చూసింది. ఆ ఆడాళ్ళే, ఆ ముసిలాళ్ళే, ఆ బానిసలే, ఒక్క ఉదుటున లోనికి తోసుకొచ్చేరు. పెద్ద కోలాహలంమధ్య కచేరీ సావడి గది తలుపులు విడిపోయాయి.

ఖైదీలంతా విడుదలయ్యేరు. పెద్దపులులు బయటపడ్డట్లే, వస్తూనే అటూయిటూ చూసేరు. ఉదయంనుంచీ తమరిని యమకొట్టుడు కొట్టించిన రమణారెడ్డి అక్కడ పడుండాలి. కనిపించలేదు. కనిపిస్తే కీళ్ళు విప్పేసి వుండేవారు. మంది అంతా హడావిడిలో వుండగా రఘునందన రెడ్డినీ, అమీనునూ తోడుచేసుకొని శివరామిరెడ్డి పెద్దకొడుకును ఇంట్లోకి పట్టించుకు పోయేడు. ఆసంగతి నెవ్వరూ గమనించనేలేదు. లోనికున్న ద్వారం మూతబడింది.

జనం అటూ యిటూ చూసేరు. కసితీర్చుకొనేటందుకు మనిషి అక్కడలేడు. ఇంక అక్కడున్న కుర్చీలూ. బల్లలూ. మంచాలమీద కసి తీర్చుకొన్నారు. క్షణంలో అవన్నీ విరిగిపోయేయి. తర్వాత అంతవరకూ తమరిని బంధించిన గదితలుపులు బద్దలుకొట్టేసేరు. ఆగది వాళ్ళ అసమర్థతకి మూర్తిమంతం. బానిసత్వానికి చిహ్నం. వాళ్ళ లోకువతనానికి నిదర్శనం. తిరుగుబాటులో మొట్టమొదట వాళ్లు దానినే ధ్వంసంచేసేరు.

ఇంతలో ఇంటి మిద్దెనెక్కిన అమీను కచేరీసావడిని ధ్వంసంచేస్తున్న జనాన్ని బెదరించేటందుకు రైఫిల్‌తో కాల్పులు ప్రారంభించేడు. అతడంతకన్న చేయగలదిలేదు. ఆయింట్లో కచేరీ సావడి వేరే ఆవరణలోవుంది. చుట్టూవున్న ఎత్తయిన ప్రహరీగోడ ఇంటికీ దానికీ చూపులుకూడా లేకుండా చేసింది.

మొట్టమొదటి తుపాకి చప్పుడుతో జనం వీధిలోకి వచ్చేసేరు. ఏ వైపునుంచో నినాదం వినవచ్చింది.

"సంగం జిందాబాద్"

చెల్లా చెదురుగా నడుస్తూ పరుగెడుతూ గంతులేస్తున్న జనం నిల బడ్డారు. వెంకటయ్య ఎక్కడిదో ఎర్రజెండా తీసేడు. కర్రకి తగిలించి పైకెత్తి కుంటుకుంటూ అడుగువేసేడు. ఏ గర్రలమీద కర్రదెబ్బలు కదు ములుకట్టి కమిలిపోయి వున్నాయి.

జనం ఆతని వెనకచేరి నినాదాలిస్తూ గ్రామంవైపు నడిచేరు.

వీధిలో వూరేగింపు నడుస్తూంటే ప్రతి ఇంటిముందూ హారతు లిస్తున్నారు. పువ్వులు చల్లుతున్నారు.

గాలిపాటున ఎర్రజెండా రెపరెప లాడుతూ జనాన్ని పిలుస్తూ నడిచింది.

* * * *

జనం అంతా చెదిరిపోయేక రాజిరెడ్డి భార్యను చేయిపట్టుకు లేవ దీసేడు. ఒక్క పావుగంట కాలంలో నడిచిన ఆ ఘటనల ఆవేగంతో ఆమె కాలుచేతు లాడకుండా అయిపోయింది.

"లే పోదాం."

ఆమె వెనక్కి తిరిగి చూసింది. లోనికివెళ్ళే తలుపు వేసివుంది. ఇంక ఆ దారి బందయింది. కాలివద్దపడివున్న రివాల్వరును దూరంగా తోసేసింది. ఇద్దరు గఢీవదిలి బయటకు వచ్చేసేరు.

వారివెనుక చాకలి మంగమ్మ వుంది. బట్టలు ఇవ్వడాని కామె వచ్చింది. ఈ గంద్రగోళం అంతా చూస్తూ ఓ ప్రక్కన నిలబడింది. బట్టలు అక్కడ వదిలిపోవడమో, మళ్ళీతేవడమో తేల్చుకోలేక ఒక్క క్షణం తటపటాయించింది. చివరకు వదలిపోవాలనే తేల్చుకొంది.

ఎవరో ఎదురుగా వున్నట్లే, వప్పచెప్పుకొంటున్నట్లే బట్టలు లెక్కపెట్టి అరుగుమీద పెట్టింది. ఆటూ యిటూ చూసింది. సుమిత్ర తోసేసిన రివాల్వరు కనబడింది. మూటకట్టి తెచ్చిన గుడ్డలో దానిని పెట్టుకొని వీధిలోకి వచ్చేసింది.

దూరంనుంచి పిలుపు వినవస్తూంది.

"సంగం జిందాబాద్"

మంగమ్మ హడావిడిగా ఆ వైపు పరుగెత్తింది.

సమాప్తం.

